శ్రీ

# దశావతారస్తోత్రశతకము.

పండిత శ్రీ దామెర చినవేంకటరాయ
ప్రణీతము.

---

బ్రహ్మశ్రీ ద్వివేది రామశాస్త్రి
విరచితాంధ్రపద్యటీకా తాత్పర్య సహితము.

ఇది,

కృతికర్తగారి ప్రథమ పుత్రులగు
శ్రీ రాజా దామెర వేంకటసీతారామయ్య,
బహాదర్ జమీందార్ ఆఫ్ జగ్గంపేట యెస్టేటువారిచేఁ
బ్రకటింపఁబడియె.

---


1925

మద్రాసు
ఆనందముద్రణాలయమున
ముద్రితము.

Rs. 4



శ్రీరాజా దామెర వేంకటసీతారామయ్య బహద్దరుగారు,

జమీందారు, జగ్గంపేట యెస్టేటు.

శ్రీః

# ఉపోద్ఘాతము.

ర్యులారా,

ఈ దశావతారనుతిశతక గ్రంథకర్తను నేను ప్రథమపుత్రుఁడనగుటం
యేవియో కొన్ని పంక్తులిట వ్రాయుచున్నాఁడనే కాని మీవంటివారు
వి యానందింపఁదగిన శైలిలో వ్రాయుటకుఁ దగినంతగాని కొంతగానివై
కలవాఁడను కానని తొలుదొల్త విన్నవించుకొనుచున్నాఁడను.

శ్లో. ఆర్యం య మర్చతిగృహే గృహ ఏవలోకః
పుత్రైః కృతశ్చ యశఏవ మయాత్మలాభః।
సృష్టాచ యేనచ కథేయ మనన్యశక్యా
వాగీశ్వరం పితరమేవ తమానతోస్మి॥

అని బాణమహాకవి కొమరుఁడు లిఖించిన యక్కరములు తామెఱుఁ
వి కావు. నాజ్ఞాన మెట్టిదైనను మాతండ్రిగారికి బట్టియేని భవాదృశులు
వ్రాయునక్కరములను మన్నింతురని నమ్ముచున్నాఁడను.

మావంశము మాతండ్రిగారి తరమునందే గాక యంతకుఁబూర్వమునుం
ఁ గవితాప్రవీణమను వంశము నాచే నింతకుమున్ను ముద్రింపింపఁబడిన
ముత్తాతగారగు శ్రీదామెర చినవేంకటరాయణిఁగారిచే విరచింపఁబడిన
కటాచలమాహాత్మ్యమువలన విస్పష్టమయ్యెడిని. ఆ వేంకటాచల మాహా
ు తెలుఁగులో రచింపఁబడినదియైనను, సంస్కృతపదభూయిష్ఠముగా
కుటచే మాముత్తాతగారుకూడ మాతండ్రిగారిమాదిరిగా సంస్కృతభాష

యందు విశేషపరిశ్రమము చేసినవారే యని ధ్రువపడుచున్నది. శైలీప్రదర్శ
నార్థ మాగ్రంథమునుండి కొండొకమాత్ర ముదాహరించుచున్నాఁడను.

మ. శరవర్షోదయకారియై గురుతరాశావ్యాప్త శృంగమ్ములై
పరచిత్రాభఁదనర్చుచున్ సతతదేవత్రాణమాన్యమ్ములై
కరమొప్పారు ఘనోదయస్ఫురణము ఖ్యంబ్రోచుఁజెల్వొందు శ్రీ
హరిచాపంబు చిరాయురున్నతులు మాకర్పించుఁగా కెప్పుడున్.

శా. వాతోద్ధూతతరంగసంఘరవము ల్వాద్యంబుగాఁ బంకజ
వ్రాతాళిధ్వనిగీతి గా యమునలో వర్తించుహంసాది వి
ఖ్యాతారావము తాళసి స్వనముగా గన్ గాళియాహీంద్రర
త్నాతిస్ఫీతఫణాళిరంగమున నాట్యంబాడెఁ గృష్ణుం డొగిన్.

(వేంకటాచల మాహాత్మ్యమునుండి)

పైపద్యములంబట్టిచూచిన గ్రంథకర్తకుఁగల సంస్కృతభాషాపైదు
ష్యము తెలియనయ్యెడిని. మఱియు నీపద్యద్వయములో మొదటిపద్యముంబట్టి
చూచినఁ గవిశ్లేషకవితాధురంధరుఁడనియుఁ దేలుటంజేసి మాతండ్రిగారి
గ్రంథమునందలి శ్లేషరచనాభూయిష్ఠత్వముకూడ వంశపరంపరా ప్రాప్తమే
యనియు నిర్ణయింపనయ్యెడిని. శైలీ ప్రదర్శనార్థ మీదశావతారస్తుతిశతక
మునుండియు నాలుగుశ్లోకముల నుదాహరించుచుంటిని.

## మత్స్యావతారే

శ్లో॥ శుకవివాద సునాదపరిష్కృతం, ప్రవిలసత్సుమనోవర వాసనం
గహన మంగపదావి మునిశ్రితం, కపటమీన మభీష్టఫలప్రదమ్

## వామనావతారే

శ్లో॥ కుదానతో దానవలోకనాథ, స్స్వర్థస్థితిం ప్రాప యతోనురూపం।
కుదాన మాదాయుచ వామనోపి, లోకత్రయే వర్ధతచిత్రమేతత్॥

# శ్రీరామావతారే

౬. స్మృతిపారగోపి రామో, జనకస్య సుతాంచకార జంభావే।
చిత్రచరిత్ర స్సత్వం మిత్రకులాంభోధి, చంద్రమా జయసి॥
౭. యేనకీశమిజనోభవద్యతో, జానకీశపథవృత్తి రుద్ధృతా।
దీనకీశపతిపాతు రీదృశో జానకీశపద, మాశ్రయేతవ॥

గ్రంథకర్తయొక్క తల్లిదండ్రులంగూర్చియు గురువును గూర్చియు గ్రంథాంతమునందలి యీక్రిందిశ్లోకములు వక్కాణింపఁగలవు.

శ్లో. శ్రీదామెరాన్వయపయోనిధిపూర్ణచంద్ర
శ్రీపెద్ద వేంకటసుధీవరనందనేన,
శ్రీ చిన్న వేంకమసతీ మృదుగర్భశుక్తి
ముక్తాఫలేన చినవేంకటనామకేన ॥

శ్లో. పూతేన గాలచరగోత్రసముద్భవేన
శ్రీవేంకటేశ్వరగురుప్రియశిష్యకేన,
దుష్టేంద్రియౌఘజయహృష్టహృదంబుజేన
శ్రీశావతారదశకస్య నుతిః కృతేయం [యుగ్మం]

మఱియు నీకవివతంసుని యెడలఁ దాత్కాలికులగు కవులకెట్టి యాదరము గలదో యీక్రిందిశ్లోకములవలన నెఱుఁగ నయ్యెడిని.

## శ్రీ తిరుపతి వేంకట కవుల నానారాజ సందర్శనమునుండి.

### దామెర చినవేంకటరాయనింగారు

శ్రీగదంకారశ్శిల్పి సుకవిగకార్త్తంటికశ్చ మేధావీ
దామెర చినవేంకటరాడ్జయతిపయోరథ *సమాఖ్యాక్షేత్రామే. ౧

* పాలతేరు.

శ్లో. జాతోయంకిల పద్మనాయకకులే గర్వం నధత్తేతథా
ప్యాశీర్వాదమపేక్షతే సుకవిరప్యుర్వీసురాణాం ముహుః
ఈషచ్చవ్యసనే మతింకురుతే విద్యాసు తత్రాంతనో
త్యేవం శ్రీకరదామెరాన్వయమణి శ్రీవేంకటాఖ్యోవిభుః 2

శ్లో. జాతోపి పద్మనాయక, వంశేనూచానసంపదభిరామే
జ్ఞాతా యేనతు దైవీ భాషా, తత్రాపి ప్రాప సుకవిత్వం॥ 3

శ్లో. త్రిఫల సఫలీకరణే, చాతుర్యం యేన సాకముత్పన్నం
యస్య శ్రవణేనామ్నః ప్రకుపితరోగోపి రోగిణం త్యజతి॥ 4

శ్లో. సరసా సుగుణా సుపదా, సాలంకారా సువృత్తరీతిశ్చ
చకమేకవితా కన్యా యంకృతినం ప్రాక్కృతేన సుకృతేన॥ 5

శ్లో. యస్సిద్ధాన్తవ్యాప్తం, జాతకవిషయం సమస్తమపి లేభే
అయమయ మిదమితి యత్కిం సర్వం ప్రాప్తంచ మతిమతాం[illegible]॥ 6

ఉ. దామెరవంశసంభవుఁడు దారగుణాఢ్యుఁడు చిన్నవేంక[illegible]
ఖ్యామహితుండు మామహితుఁ డార్జితసత్కవితాలతావృతా
రామవిహారహారి కృతి రంజిత సూరిమనోంబుజోల్లస
చ్ఛ్రీమధుసూదనుండు కడుఁ జెన్నలరారుత మేటికీర్తిన్. 7

సీ. సాహితీగ్రంథముల్ చర్చసేయఁగ నేర్చుఁ
గవనముల్ జక్కఁగ రచించు
శిల్పవిద్యలయందుఁ జెల్వు మిక్కిలి గాంచు
వైద్యమ్మునందుఁ బేర్వాసిఁ జెందు
వినయమ్మునందు మేటి నయమ్మునందుమా
ర్దవమందు నెక్కుడౌ రాణఁగాంచు
తనకన్న గొప్పవిద్వద్వరేణ్యుల సంశ
యంబులు వివరించి యడుగుచుండు,

తే. గీ. గర్వదూరుండు సంపత్ప్రకాశమానుఁ
డవని పాలకబాంధవుఁ డమలధామ
రాన్వయాభరణంబు శ్లాఘ్యతరమూర్తి
పటుతరవిభుఁడు చిన్నవేంకటవిభుండు.

పైశ్లోకములవలనను పద్యములవలనను నీగ్రంథకర్తకుంగల యనేకవిధములగు శక్తిసామర్థ్యములుగూడ సువ్యక్తమగుచున్నవి. ఆయాశక్తులను గూర్చి నేను ప్రత్యేకించి వ్రాయనక్కఱలేకుండ సులువుచేసిన బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకెంతయు నేను కృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాఁడను.

ఈ గ్రంథకర్త ప్రకృతగ్రంథమును సుమారు 25 వత్సరముల ప్రాయమున రచించినట్లు గ్రంథాంతమందలి-శ్లో॥ పవనేందుదిగ్గజగ్లౌ. అనుశ్లోకమువలనఁ దెలియుచున్నది. ఈయనఘుని జననము విభవసంవత్సర కార్తిక బహుళ అమావాస్యాస్థిరవాసరమని జాతకమువలన నెఱుంగనయ్యెడిని. పరమపదించినది విశ్వావసు సంవత్సర మాఘశుద్ధైకాదశి (భీష్మైకాదశి) కావున జీవితకాల మించుమించుగా ముప్పదియొనిమిది వత్సరములని తేలుచున్నది. ఇందు బాల్యావస్థలోని కొంతకాలము తప్పఁ దక్కిన కాలమంతయును నీయనఘుఁడు సత్కాలక్షేపమే యొనర్చెననుటకు రచించిన గ్రంథములే కాక యనితరదుర్లభమగు భీష్మైకాదశీమరణముగూడ సాక్ష్యమిచ్చుచున్నది. ఇట్టి యుత్తమపురుషున కింతస్వల్పముగ నాయువేర్పఱచిన విధాత సర్వథా శోచ్యుఁడనక తప్పదు. అతఁడేమి చేయును? "పాపీ చిరాయుస్సుకృతీ గతాయుః" అనునది సర్వవిదితమే కదా! బాగుగ విచారించినచోఁ జిరాయుష్కుఁడగు మూర్ఖునికన్న నల్పాయుష్కుఁడగు ప్రాజ్ఞుని జీవితమే వేయిమడుంగు లుత్కృష్టమైనది కావున నే-

"అప్రౌఢాత్మ వివేకానాం మాయురాయాసకారణం" అని జ్ఞానవాశిష్ఠము నుడువుచున్నది. అది యటులుండె. మాతండ్రిగారు తుదిదశయందు నాకుఁ గొన్నిహితవాక్యము లుపదేశించుచుఁ దాము రచించిన గ్రంథముల ముద్రణమునుగూర్చి శ్రద్ధ వహింపవలసినదని సెలవిచ్చి యుండిరి. నేనాకార్యము నచిరకాలముననే ముగింపఁగలిగియుండియు మిక్కిలి కఠినపాకములోనున్న వారి కవిత్వమునకు వ్యాఖ్యానమొనర్పఁదగిన పండితుని సంపాదించుటకై కొన్ని సంవత్సరములు ప్రతీక్షింపవలసినవాఁడనైతిని. ఇంతలో దైవవశమున నాకు తణుకు తాలూకా కాకరపర్తి గ్రామనివాసులు బ్రహ్మశ్రీ ద్వివేదిరామశాస్త్రులవారు సంస్థాన విద్వాంసులుగా లభించిరి. వీరు విద్వత్కవులు. కావున వ్యాఖ్యానమొనర్చుటయే కాక ఆయా శ్లోకములకుఁ దెలుఁగుపద్యములుకూడ రచించిరి. ఆపద్యములనుగూడ నిందుఁ జేర్చి ముద్రింపించితిని. అచిరకాలమునన, అవసానకాలమున మాతండ్రిగారిచే రచింపఁబడిన సూర్యసప్తతినిగూడ నిదేరీతిని ముద్రింపించి పాఠకలోకమునకు సమర్పించుకొందును.

D. V. SITARAMIAH,
*Zamindar of Jaggampeta.*

శ్రీరామాయ నమః.

శుభమస్తు. అవిఘ్నమస్తు శ్రీగురుభ్యోనమః.

# శ్రీదశావతారనుతిశతకే మత్స్యావతారః.



శ్లో. శ్రీపద్మా పద్మస్థా పద్మకరా పద్మనాభహృదయస్థా।
పద్మాసనపద్మేషోర్మాతా హృత్పద్మగా మమ స్ఫురతాత్॥

టీ. పద్మస్థా = తామరపద్మంబున నివసించునదియు పద్మకరా, పద్మ = తామరపద్మమువంటి, కరా = హస్తములుకలదియు, లేక విలాసార్థంబుగా తామరపద్మము హస్తంబున ధరించునదియు, పద్మనాభహృదయస్థా, పద్మనాభ = విష్ణుదేవుని, హృదయస్థా=వక్షంబుననుండునదియు, పద్మాసనపద్మేషోః, పద్మాసన=బ్రహ్మకును, పద్మేషోః=మన్మథునకును, మాతా=తల్లియు నగు, శ్రీపద్మా, శ్రీ = శోభాయుతురాలగు, పద్మా=లక్ష్మి, మమ=నాయొక్క, హృత్పద్మగా, హృత్పద్మ= హృదయపద్మమును, గా=పొందినదై, స్ఫురతాత్ =విరాజిల్లుగాత

మత్తకోకిల. పద్మనాభహృదంతరాస్పదపద్మమందిరవిస్ఫురత్
పద్మభాసురపాణిసంతతపాలితామరజాతయుం
బద్మసంభవపద్మసాయకమాత సాగరజాత యా
పద్మ కూరిమి నాదుమానసపద్మమం దలరారుతన్

తా. ఎల్లవిధంబుల పద్మసంబంధము గలుగు నయ్యాది లక్ష్మి యిప్పుడును నామనఃపద్మంబున నిలిచి నాకుం బ్రసన్నురాలు గావుతమని యిష్టదేవతా ప్రార్థనరూపమంగళము.

శ్లో. అభ్యర్ణవర్ణితసుశబ్దసదాళిసేవ్యం
హంసావలోకన వికాసి సుపర్ణజుష్టం।
నీరేశయం మహిత నీరజసమ్మతం య
న్మాత్స్యం మహో మనుమహే కమలానిశాంతం॥ 2

అవతారిక. భగవంతుని దశావతారమ్ములు వేరువేరుగ పదిపది, శ్లోకమ్ములచే నుతియింపంబూనుకొనిన యీకవి యవతారమ్ములలో మొదటిదగు మత్స్యావతారమును, నుతియించుచున్నాడు.

టీ. యత్=ఏది, అభ్యర్ణ ... సేవ్యం, అభ్యర్ణ=సమీపమ్మున, వర్ణిత=కొనియాడఁబడు, సు=నిర్దోషంబులగు, శబ్ద=పదములుగల, సత్=సజ్జనులయొక్క, ఆళి=పఙ్క్తిచే, సేవ్యం=భజింపఁదగినదియు, అని మాత్స్యపరము. అభ్యర్ణ=సమీపమ్మున, వర్ణిత=కొనియాడఁబడు, అనఁగా శ్రావ్యమగు, సుశబ్ద=మంచి ధ్వనికలుగునట్లుగా, సదా=ఎల్లపుడు, అళి = తుమ్మెదలచేత, సేవ్యం=పొందతగినదియు, అని పద్మపరము. హంసావలోకనవికాసి, హంస=పరమహంసలయొక్క, అవలోకన=చూచుటచేత వికాసి=వికాసముకలది. లేక హంస=పరమహంసలను, అవలోకన=దయతోచూచుటయందు, వికాసి=ఆనందముకలది, అనిగాని మాత్స్యపరము, హంస=సూర్యునియొక్క, అవలోకన=దర్శనముచే, వికాసి=వికసించు స్వభావముగలది, అని పద్మపర

ము. సుపర్ణ జుష్టం, సుపర్ణ=గరుత్మంతునిచే, జుష్టం=సేవింపఁబడునది అని మాత్స్యపరము, సు = మంచి, పర్ణ = ఆకులను, జుష్టం=పొందినది. అనిపద్మపరము. నీరేశయం, నీరే=ఉదకమందు, శయం=శయనించునది. అనియుభయపరము, కమలానిశాంతం, కమలా=లక్ష్మికి, నిశాంతం = నివాసస్థానమైనది. అనగా వక్షస్థలంబున లక్ష్మిగలది. అనిమాత్స్యపరము, కమలా=లక్ష్మికి, నిశాంతం=గృహమైనది. అని పద్మపరము. మహితనీరజ సమ్మతం, మహిత=శ్రేష్ఠమగు, నీరజ=పద్మమునకు, సమ్మతం=ఇష్టమైనది, అనగా సమానమైనదని భావము. భవతి=అగుచున్నదో, తత్=అటువంటి, మాత్స్యం=మత్స్యరూపంబగు, మహః=తేజమ్మును, మనుమహే=ధ్యానించుచున్నాము.

మ. అమితోరుస్తుతిశబ్దభాసుర సదాళిశ్యభ్యర్ణసంసేవ్య మా
  నము హంసేక్షణలబ్ధ హర్షము సుపర్ణభ్రాజి నీరేశయా
  ఢ్యము తన్నీరజ సమ్మతమ్ముకమలాహ్లాదాస్పదమ్మైనమా
  త్స్యమహమ్మున్ సతతమ్ము నా దుహృదయమ్మందుం బ్రతి
  ష్ఠించెదన్.

తా. సదాళిసేవ్యత్వము హంసావలోకనవికాసిత్వము సుపర్ణజుష్టత్వము, నీరేశయత్వము అను నీగుణమ్ములచే నీరజసదృశంబగు మాత్స్యమహమ్ము నాహృదయమ్మున నిలిపి ధ్యానించుచుంటిని. శ్లేషానుప్రాణితమైన యుపమాలంకారము.

శ్లో. ధృతవైసారిణరూపో దైత్యారే సోమకం భవాన్ హత్వా।
  సోమపరతాం కలయన్ చకాస్తి వై చిత్రచారిత్రః॥ 3

టీ. హే దైత్యారే=ఓదానవవైరియగు విష్ణుదేవా! ధృత... రూపః; ధృత = ధరింపఁబడిన, వైసారిణ=మత్స్యముయొక్క

ని॥ పృథురోమా ఝషో మత్స్యో మీనో వైసారిణోండజః। అని యమరము. రూపః=ఆకారముగల, భవాన్=నీవు, సోమకం= సోమకాసురుని, హత్వా=చంపి, సోమపరక్షాం, సోమపః=దేవతలయొక్క, లేక యజ్వలయొక్క, రక్షాం=రక్షణను, కలయన్=చేయుచున్న వాఁడవగుచు, వైచిత్రచారిత్రః విచిత్రమేవ, వైచిత్రమ్=ఆశ్చర్యకరమగు, చారిత్రః = చరిత్రకలవాడవై, లేక, చిత్రచారిత్రః, చిత్ర=ఆశ్చర్యకరమగు చారిత్రః=చరిత్రకలవాడవై, చకాస్తివై=ప్రకాశించుచున్నావు, చకాస్తి, అను నది చకాసృ=దీప్తౌ, అనుధాతువుయొక్క లట్ ప్రథమపురుషైక వచనరూపము.భవచ్ఛబ్దము కర్తగావున నియ్యది సంగతము.

గీ. మత్స్యరూపమ్ముదాల్చిసోమకునిజీల్చి
సోమపులరక్షణము సేయుచును సమస్త
జగములవిచిత్రచరితుండవగుచుమిగుల
నెగడుచుంటివిగదనీవునిగమవేద్య.

తా. శబ్దమాత్రమున్నన,సోమునిజంపి సోమప్రభులరక్షణం జేయుట విరోధము సోమకాసురుని సంహరించి దేవతలకు రక్షణముఁ జేసితివని పరిహారము. కావున విరోధాభాసాలంకారము. విరోధమ్మున సోమక యను పదములోని కకారము స్వార్థమున వచ్చినది యని యెరుంగునది.

శ్లో. ఆమ్నాయగ్రాహిణం పుణ్యజనం వాహిన్యధీశితుః।
అభ్యర్ణస్థం భవాన్ విష్ణో వర్ధయన్ జయతి స్ఫుటం ॥ 4

టీ. హేవిష్ణో-మత్స్యరూపమ్మును ధరించిన ఓ విష్ణుదేవా! భవాన్=నీవు, ఆమ్నాయగ్రాహిణం, ఆమ్నాయ=వేదములను

గ్రాహిణం=దొంగిలించిన అని సోమకాసుర పరము. **ఆమ్నా
య**=వేదములను, గ్రాహిణం=స్వీకరించిన, అనగా నధ్యయనం
బొనర్చిన, అని అన్యార్థము, వాహిన్యధీశితుః, వాహినీ=నదు
లకు, అధీశితుః=ప్రభువగు సముద్రునియొక్క అభ్యర్ణస్థం,
అభ్యర్ణః=ఉదకమందు, స్థం=ఉన్న, అని సోమకాసురపరము,
వాహిన్యధీశితుః=సముద్రముయొక్క, లేక వాహినీ=సేనలకు, అధీ
శితుః=అధిపతియగు అనగా సేనావిశిష్టుడగు నొకానొకరాజు
యొక్క, అభ్యర్ణ=సమీపమందు, స్థం=ఉన్న అని అన్యార్థము
పుణ్యజనం=రాక్షసుని అని సోమకాసురపరము. పుణ్య=పవిత్రు
డగు, జనం=జనుని అని అన్యార్థము. వర్ధయన్=ఖండించు
చున్నవాడవగుచు అని సోమకాసురపరము, వర్ధయన్=వృద్ధి
పొందించుచున్నవాడవగుచు అని అన్యార్థము, స్ఫుటం=ప్రసిద్ధ
ముగ, జయతి=తనరుచుంటివి. మొదటియర్థమున వర్ధయన్
అనునది వర్థ=ఛేదనపూరణయోః, అను చౌరాదిక ధాతువు
యొక్క శత్రంత రూపము. రెండవయర్థమునందు, వృధు=వృద్ధౌ
అను భౌవాదిక ధాతువుయొక్క ప్రేరణార్థక ణిజంతరూపము.

గీ. దివ్యమాహాత్మ్య యోమత్స్య! దేవ నీవు
వేదముల నెల్లఁగైకొని! వేడ్క వాహి
నీశునభ్యర్ణమునయందు! నెసఁగుపుణ్య
జనునివర్ధన మొనరించి! తనరుచుంటి.

తా. వేదములను దొంగిలించి సముద్రమ్మునడాగిన
సోమకాసురుని సంహరించి దివ్య మహిమమ్ముతో వెలయు
చుంటివని ప్రకృతార్థము. వేదాధ్యయన మొనర్చి సముద్ర
సమీపమ్మున తపంబుసేయు పవిత్రజనుని వృద్ధినొందించుచు

వెలయుచుంటివనిఅన్వ్యార్థము ప్రకృతాప్రకృత శ్లేషాలంకారము. ప్రతాంతరంబున విశేష్యంబుగూడ శ్లేషించుటంజేసి శబ్దశక్తి మూలకం బగుధ్వని.

శ్లో. ఆమ్నాయమోషక పలాశవినాశకస్య
పుచ్ఛస్య చాలనవశాత్తవ దంభమత్స్య ।
వారాంనిధేర్గగనసంగతశుక్తిజౌఘం
తారాకదంబమితి ముగ్ధజనా వదంతి ॥ 5

టీ. హే దంభమత్స్య = ఓ కపటమత్స్య రూపధారి ఐగు విష్ణుదేవా, ఆమ్నాయ ... వినాశకస్య ఆమ్నాయ=వేదములను, మోషక=దొంగిలించిన, పలాశ=రాక్షసుని, అనఁగా మకుని వినాశకస్య=నశింపజేసిన, తవ=నీయొక్క, పుచ్ఛస్య=తోకయొక్క, చాలనవశాత్=కదలించుటవలన, వారాంనిధేః=సముద్రముయొక్క, గగన ... జౌఘం, గగన=ఆకాశమందు, సం... =కలిసికొనిన, శుక్తిజ=ముత్యములయొక్క, ఓఘం=సమూహమును, ముగ్ధజనాః=మూఢజనులు; తారాకదంబం, తారా=నక్షత్రములయొక్క, కదంబం=సమూహము, ఇతి=అని, వదంతి=పలుకుచున్నారు.

శ్రుతులనుచూరగొన్నయలసోమకదానవు నుగ్రకోపతీ
వ్రతఁ దునుమాడునీదుపృథువాలపరిభ్రమ నేగి మింటన
ద్భుతముగ సక్తమైదగుసముద్రపుముత్తెపుగుంపు తారకా
తతియనివల్కుచుండిరిగదా కడుముగ్ధులుమత్స్యనాయకా.

తా. శ్రుతులను హరించి సముద్రమునన డాగిన సోమకుని సంహరించునపుడు మత్స్యరూపముదాల్చిన నీ

పుచ్ఛము వేగముగా చలింపజేయుటంజేసి సముద్రములోని ముత్యంబులు,ఆకసంబున కెగసిమెప్పుచుండ వాటినే ముగ్ధజనులు నక్షత్రసమూహం బని వర్ణించుచుండిరి.

శ్లో. అమృతోత్తైర్ద్విజైర్జుష్టో దానవారినిషేవితః ।
కమలామోదితశ్ఛద్మమీనస్త్వం కమలాకరః ॥ 6

టీ. అమృతోత్తైః,అమృత=మోక్షమందు, ఉత్తైః=వేడుకగల, ద్విజైః=విప్రులచేత, జుష్టః=భజింపబడు, అనిమాత్స్య పరము. అమృత=ఉదకమందు, ఉత్తైః=వేడుకగల, ద్విజైః= పక్షులచేత, జుష్టః=సేవింపబడు, అనిసరఃపరము, దానవారినిషేవితః, దానవారి=దేవతలచేత నిషేవితః=సేవింపబడు అనిమాత్స్యపరము దానవారి=మదోదకముచేత, నిషేవితః=సేవింపబడిన, అనగా, మదోదకముగల, అనిగాని లేక దాన=పరిశుద్ధమగు దైప్ శోధనే అనుధాతువువలననిష్పన్నము, వారి=ఉదకముచేత, నిషేవితః=సేవింపబడిన, అనగా పరిశుద్ధమగు నుదకంబుగల అనిగాని సరఃపరము. కమలామోదితః, కమలా=లక్ష్మిచేత, మోదితః=సంతోషపెట్టబడిన అనిమాత్స్యపరము. కమల=పద్మములచేత, ఆమోదితః=పరిమళింపజేయబడిన అనిసరఃపరము. ఛద్మమీనః=కపటమత్స్యరూపుఁడవగు, త్వం= నీవు, కమలాకరః, కమలా=లక్ష్మికి, ఆకరః=స్థానభూతుడవు అనిమాత్స్యపరము. ఛద్మమీనః, ఛద్మ=వ్యాప్తమైన, మీనః=మత్స్యములుగలది. కమలాకరః,కమల=పద్మములకు ఆకరః స్థానమైన–అనిసరఃపరము.

క. అమృతాసక్త ద్విజసే
వ్యము కమలామోది దానకవారి పరినిషే

వ్యము నగు నీరూపం బా
కమలాకర మనఁగఁ దగును కగదమత్స్య విభూ.

తా. ఓ మత్స్యరూపమును ధరించిన విష్ణుదేవా! ముముక్షువులగు ద్విజులచే భజింపఁబడునట్టియు, దేవతలచే నెల్లపుడు సేవింపఁబడునట్టియు శ్రీదేవిచే సంతోష పెట్టబడినట్టియు నీవు వక్షస్థలంబున నెల్లపుడు విరాజిల్లు లక్ష్మి కలవాఁడవై యొసంగుచుంటివని తాత్పర్యము. ఓ సరంబా ! ఉదకమందు నాసక్తి కల పక్షులచే సేవింపబడునట్టియు, నిర్మలంబగు నుదకంబుతో నొప్పునట్టియు, పద్మములచే పరిమళింప చేయబడునట్టియు, చేపలచే విరాజిల్లునట్టియు నీవు కమలములకు స్థానభూతంబ వని యర్థాంతర ప్రతీతి. పూర్వము వలెనే మతాంతరంబున ధ్వని లేక ప్రకృతా ప్రకృత శ్లేషము.

శ్లో. శుక వివాద సునాదపరిష్కృతం
ప్రవిలసత్సుమనో వరవాసనం ।
గహన మంగ వదామి మునిశ్రితం
కపట కానన మభీష్టఫలప్రదం ॥ 7

టీ. అంగ=ఓయీ! శుక ... ష్కృతం, శుక=శుకమహర్షి యొక్క, వివాద=విశేష విశిష్టవాక్కులయొక్క, సు=యోగ్యమైన, నాద=ధ్వనిచేత, పరిష్కృతం=పరిష్కరింప బడినట్టియు (శుకులచే గొనియాడబడిన)అని కపటమీన పరము, శుక=చిలుకలను, వి=పక్షులయొక్క, వాద=పలుకులయొక్క, సునాద=అందమగు ధ్వనులచే, పరిష్కృతం=అలంకరింప.బడిన లేక, వివాద=కలహవాక్కులయొక్క, సునాద=శ్రావ్యమగు ధ్వనిచేత అని యరణ్యపరము. ప్రవి ... సనం, ప్రవిలసత్=మిక్కిలి ప్రకాశిం

చుచున్న, సు=యోగ్యమైన, మనః=హృదయమే (సజ్జనహృదయమే) పర=శ్రేష్ఠమైన, వాసనం=నివాసముగాఁగల, అని కపటమీన పరము. ప్రవిలసత్=మిక్కిలి ప్రకాశించుచున్న,సుమనోవర=మంచిపూలయొక్క, వాసనం=పరిమళము కలిగిన యని అరణ్య పరము.ముని శ్రితం, ముని=ఋషులచే, శ్రితం=ఆశ్రయింపఁబడిన యని యుభయపరము లేక, ముని=అగస్త్య వృక్షములచేతను, శ్రితం=ఆశ్రయింపఁబడిన, అని అరణ్యపరము. అభీష్ట ఫలప్రదం అభీష్ట=కోర్కెలయొక్క, ఫల=సిద్ధిని, ప్రదం=ఒసఁగునట్టియని మాత్స్యపరము, అభీష్ట=ఇష్టములగు, ఫల = పండ్లను, ప్రదం=ఇచ్చునట్టి యని యరణ్య పరము, కపటమీనం=కపటమత్స్యరూపుండవగు నిన్ను, గహనం=తెలిసికొన శక్యముకానివానిగానని యర్థము. అరణ్యమునుగా నని యర్థాంతరము. వదామి=వక్కాణించుచున్నాను.

చ. దివిజ సమాజసేవ్య ఋషిశ్రీదేవసదాశ్రిత మాని సంఘమున్
ప్రవితతహృద్య తచ్ఛుకవిశ్రీవాద సునాద పరిష్కృతం బభీ
ష్టవర ఫలప్రదమ్ము విలశ్రీసత్సుమనోవరవాసనమ్మునై
భువిదగునీదు రూపు సతశ్రీమున్ గహనంబని నిర్వచించెదన్.

తా. ఓ మత్స్యదేవా! శుకునియొక్క దివ్యవాక్కులచేఁ గొనియాడఁబడునట్టియు, సజ్జనుల డెందంబే, నివాసముగా కల్గినట్టియు, మునులచే సేవింపబడునట్టియు, భక్తుల కభీష్టవరము లొసంగునట్టియు నిన్ను అవాఙ్మానసగోచరునిగా వక్కాణించుచుంటిని యని భావము. చిలుక పలుకులచే నలంకరింపబడునట్టియు, మంచిపూలచే పరిమళించునట్టియు, మునులచే నాశ్రయిం

పబడినట్టియు, యిష్టములగు పండ్లనొసంగునట్టియు, నరణ్యము నుగా నుడువుచుంటినని యర్థాంతరము.

శ్లో. అమృతదాన చణాద్భుతమీన తే
శుభ మహత్తరసంగవశా జ్జలం ।
అమృతమిత్య భిధాం వహతి స్ఫుటం
న విఫలో మహతాంహి సుసంగమః॥ 8

టీ. అమృ ... మీన.అమృత=మోక్షముయొక్క, దానచణ=ఇచ్చుటచేత ప్రసిద్ధమైన, అద్భుత=ఆశ్చర్యకరమైన, మీన=మత్స్యమా, తే=నీయొక్క శుభ ... శాత్, శుభ=మంగళప్రదమగు, మహత్తర=మిక్కిలి పూజ్యమైన,సంగవశాత్=సంసర్గవశమువలన, జలం=ఉదకము, అమృతమితి=అమృతమని, అభిధామ్=పేరును, స్ఫుటమ్=ప్రసిద్ధముగా, వహతి=ధరించుచున్నది. హి=అదియుక్తమే, మహతామ్ = గొప్పవారలయొక్క సుసంగమః, సు=యోగ్యమైన, సంగమః=సహవాసము, విఫలః=వ్యర్థమగునది, న=కాదు.

క. రహి నమృతం బొసఁగెడునీ
సహవసతిన్ జలము నమృతసదభిఖ్యఁ గనెన్
మహి నతివిచిత్ర మీనమ
మహనీయుల దివ్య సంగమము వ మ్మగునే.

తా. అమృతం బొసంగుటచేత ప్రసిద్ధమైన నీసహవాసమునసే జలము అమృతంబని దివ్యనామమొందె. సజ్జన సహవాసము సఫలంబగును గదాయని తాత్పర్యము. అర్థాంతరన్యాసాలంకారము.

శ్లో. అంతస్సంగత భువనో విష్ణో భువనేవసద్భవానబ్ధేః ।
ధృతపృథురోమ శరీరః పశ్యతిలఘుతాం నకార్యార్థీ॥

టీ. హే విష్ణో=ఓమత్స్యరూపము ధరించిన విష్ణుదేవా!అంతస్సంగతభువనః, అంతః=కుక్షిమధ్యమందు సంగత=కలిసికొనియున్న, భువనః = లోకములుగల, భవాన్=నీవు, ధృత ... రీరః, ధృత=ధరింపబడిన, పృథురోమ=మత్స్యముయొక్క శరీరః-ఒడలుగలవాడవగుచు, అబ్ధేః=సముద్రముయొక్క. భువనే=ఉదకమందు, అవసత్=నివసించితివి, కార్య=పనిని, అర్థీ=కోరువాడు, లఘుతాం= తేలికతనమును, నపశ్యతి=చూడఁడు.

క. పదునాల్గు భువనములు లోఁ
గదియించిన నీవు మత్స్యకాయధరుఁడవై
యుదధి భువనమున నుంటివి
హ్యాది లాఘవమును గణింతురే కార్యార్థుల్.

తా. కుక్షియందుఁ బదునాల్గు భువనములు దాల్చిన మహాత్ముండవగు నీవు మత్స్యరూపముదాల్చి సముద్రములోనేక దేశమున నివసించితివి. కార్యార్థులు లాఘవాలాఘవములు పరిగణింపరుగదా. అర్థాంతరన్యాసాలంకారము॥

శ్లో. కలుషాతి భీష్మనికషాత్మ జానసే
పురుషోత్తమోపి ఝుష విగ్రహం వహన్ ।
పరమేష్ఠితుష్టి మకరోత్త్రయీధనా
త్సుజనైకశోషణ ఫలైషిణో బుధాః ॥ 10

టీ. పురుషోత్తమోపి = పురుషోత్తముఁడవైనను, భవాన్= నీవు, కలు ... సనే కలుష=దుర్మార్గుడును, అతిభీష్మ=మిక్కిలి

భయంకరుఁడునగు, నికషాత్మజ=రాక్షసునియొక్క (సోమకుని యొక్క) అసనే=నశింపజేయుట విషయమై, ఝష విగ్రహమ్, ఝష=మత్స్యముయొక్క, విగ్రహమ్=శరీరమును, వహన్=ధరించుచున్నవాఁడ వగుచు, త్రయీధనాత్, త్రయీ=వేదత్రయంబను, ధనాత్=ధనమ్మువలన, (వేదములొసంగి) పరమేష్ఠితుష్టిమ్, పరమేష్ఠి=బ్రహ్మయొక్క,తుష్టిమ్=సంతోషమును అకరోత్=చేసితివి. బుధాః=బుధులు సుజ ... షిణః, సుజన=సజ్జనుల యొక్క, ఏక=ముఖ్యమైన, తోషణ = సంతోషపెట్టుటయను, ఫల=ఫలమును, ఏషిణః=కోరువారు,భవన్తి=అగుచున్నారు.

చ. అరయఁగఁబూరుషోత్తముఁ డ

వై ననుసీవొక దుష్టరాక్షసుఁ

బొరిగొన మత్స్యపుండనువుఁ

బూని ద్రుతంబుగ వానిఁ దున్మి యా

సరసిజ సూతికిం బ్రియము,

సల్పితి వేదధనం బొసంగి యే

కరణినిగాని సాధులకుఁ,

గౌతుకమున్ ఘటియింత్రుగా బుధుల్.

తా. ఓమత్స్యదేవా! నీవు పురుషోత్తముఁడ వయ్యొక రక్కసుం బరిమార్చుటకు మత్స్యరూపముఁగైకొని వాని దున్మి యాబ్రహ్మకు వేదమ్ము లొసంగి సంతసముఁ గూర్చితివి. ఎట్టిపని యొనర్చియైన బుధులు సజ్జనులకు సంతోషముఁగూర్ప నెంతురుగదా! అర్థాంతరన్యాసాలంకారము॥

శ్లో. వనేవసన్నప్యవనేవసన్ భవా

నపిశ్రుతీడ్యశ్శ్రుతిచోరమప్రసపం।

నిహత్యదంభాండజ తాంశ్రుతిం దద
ద్బహుశ్రుతిం ప్రీణయితుంయసత్యహో॥ 11

టీ. హేదంభాండజ = ఓకపటమత్స్యమా! వనే=వనమందు, వసన్నపి=నివసించుచున్నవాడవై నప్పటికి, అవనేవసన్=అవనమందు వసించుచున్నట్టియు అనివిరోధము, వనే = ఉదకమందు, వసన్=నివసించుచున్నట్టియు, అవనే=సజ్జనరక్షణమందు, వసన్ = సన్నద్ధముగానున్నట్టియు, అనిపరిహారము. భవానపి=నీవున్ను (మత్స్యమయ్యును) శ్రుతీడ్యః, శ్రుతి=శ్రోత్రములచేత, (హేతువులు) ఈడ్యః = కొనియాడతగిన వాడవగుచు అనఁగా అందమైన శ్రోత్రములు కలుగుకారణమున కొనియాడదగిన, వాడవగుచు అని విరోధము. కపటమత్స్యంబవైన నీవు శ్రుతీడ్యః శ్రుతి=వేదములచే, ఈడ్యః = కొనియాడఁదగిన వాఁడవగుచు, అనిపరిహారము. లేక భవానపి=నీవున్ను, (మత్స్యంబవయ్య) శ్రుతీడ్యః=వేదములచేతఁగొనియాఁడదగిన వాఁడవగుచు అని విరోధము. కపటమత్స్యాకారమును ధరించినవాఁడవనియు వేదములచే కొనియాడబడు వాఁడవనియు పరిహారము. శ్రుతిచోరం=వేదములను దొంగిలించిన అస్రపం=రక్కసుని, (నల్ల ద్రావు) నిహత్య=చంపి, తాం=ఆ, శ్రుతిం=శ్రుతిని, దదత్ = ఇచ్చుచున్నవాఁడవగుచు, బహుశ్రుతిం=బహుశ్రుతిని (బ్రహ్మను ప్రీణయితుం=సంతోషపెట్టుటకొరకు, యసతి=ప్రయత్నించుచున్నావు. అహో=ఆశ్చర్యము! యసు=ప్రయత్నే అను ధాతువు దైవాదికమైనను, యసోనుపసర్గాత్ అను సూత్రముచే శ్యన్ప్రత్యయము వికల్పితంబు గావున వికల్పపక్షంబున యసతి అను రూపము సిద్ధించెనని యెఱుఁగునది.

చ. అతులమహత్త్వ! నీవువనమందువసించెడు వాఁడవయ్యుఁ జో
ద్యాతిశయంబు మీరఁగా నవనమందువసించుచుఁ గైతవాండజా
కృతిధరియించియుండఁగ శ్రుతీడ్యతనొందిమహాగ్రహమ్మునన్
శ్రుతిహరుఁడై నరక్కసునిరూపడఁగించియుఁ బేర్మితోడఁ దద్
ప్రచ్యుతినిడియాబహుశ్రుతిఁ బ్రహృష్టుని సేయఁదలంచి తద్దిరా!

తా. ఓమత్స్యవిభూ! నీవు వనమందు వసించువాఁడ వయ్యు నవనమందు వసించుచు అని విరోధము. ఉదకమందు నివసించువాఁడవనియు భక్తులరక్షింపఁబూనియున్న వాఁడవ నియుఁ బరిహారము. మత్స్యంబవయ్యు మనోహరంబగు శ్రోత్రం బులు, గలుగుటచే కొనియాడఁ దగినవాఁడ వని విరోధము. (మత్స్యంబులకు వినుటకు శ్రోత్రరంధ్రంబు కలిగినను కొని యాడఁదగు పై యాకారంబుండదు. గావున శ్రుతీడ్యత్వము విరోధము) లేక జడజంతు వగు మత్స్యమవయ్యు నీవు వేదమ్ము లచేఁ గొనియాఁడ దగినవాడనై యని విరోధము. కపటమత్స్యా కారము ధరించినవాఁడవనియు వేదమ్ములచేఁ గొనియాడఁదగిన, మహిమఁగలవాఁడవనియును పరిహారము. అట్టినీవు శ్రుతులం దొంగిలించినరక్కసుని బరిమార్చి యాశ్రుతినొసఁగి బహుశ్రు తిని సంతోషపరుపఁ బ్రయత్నించుచుంటివి. ఏకశ్రుతిదానము చే బహుశ్రుతిని సంతోషపరుప యత్నించుట యాశ్చర్యము. సోమ కునిజంపి వేదముల నొసంగిబ్రహ్మను సంతోషపరచితివని తాత్ప ర్యము. విరోధాభాసాలంకారము.

మత్స్యావతారనుతి సమాప్తము.

---

## ర్మావతారః.

---

ా ధర ధురంయః ప్రాగ్బిభర్షీచ్ఛయా
ధారణవిధౌయద్వర్ణితః పండితైః ।
చ్ఛాపపతేకుతైస్నవతేతన్నుతిః
స్థాపిమితధీః కర్తుం ప్రవృత్తస్స్వతిం॥
ఓకూర్మనాయకా, యః=ఏ నీవు, ప్రాక్
ా = కోరికచేత,సప్త... ధురం, సప్త
డిన, ధరా=భూమియొక్కయు, ధరాధ
ము, ధురం=భారమును, బిభర్షి =భరిం
త్వం=నీవు, పండితైః=విద్వాంసులచేత,
రశైల=మందరపర్వతముయొక్క, ధా
ధౌ=పనివిషయమై, వర్ణితఇతియత్ =
యేదికలదో, తన్నుతిః తత్ =ఆ, నుతిః=
, అమేయబలస్య, అమేయ=అపరిమిత
తే=నీకు, కుత్తైస్నవ=నిందయే, భవతి =
ునను, మితధీః,మిత=స్వల్పమైన, ధీః=
ం=నేను, చాపలతః=చపలత్వమువలన
ం=పొగడ్తను, కర్తుం=చేయుటకొరకు,

రకముఁ లలిఁదాల్చినసారమూర్తిని
రిక్రియించుటఁజేసి యొనర్చునట్టివి

ద్వన్నుతినిందతోడనరికీవచ్చును కచ్ఛపదేవ మైననే
నెన్నఁగఁబూనితిన్ మితమతిసీఘఁడనయ్యును చాపలంబునన్.

తా. తొల్లి పదునాల్గు భువనములఁదాల్చిన మహాను
ఁడ వగునిన్ను విద్వాంసులు మందర పర్వతమును ధరించితి
ఁ గొనియాడుట యొకగొప్పగాదు. అయినను వారి మార్గ
ి ననుసరించియే కేవల భక్తిపరుఁడనగు స్వల్పబుద్ధికల నేను
అట్లే నిన్నుంగొనియాడఁ దొడంగితిని.

శ్లో॥ ఇందిరాప్తి విషయేకమఠేశా
మందరాగ పరిపూరిత చేతాః ।
మందరాగభరణాభరణోహ్రా
న్మందిరే ప్రవిశ సుందర రూపః॥ 2

టీ. హే కమఠేశ=ఓ కూర్మపతిరూప విష్ణుదేవా, ఇంది
ప్తి విషయే, ఇందిరా=లక్ష్మీదేవియొక్క, ఆప్తివిషయే=పొం
టవిషయమైు, అమం ... చేతాః, అమంద=అధికమగు, రాగ=
ేమచేత, పరిపూరిత=నిండింపఁబడిన చేతాః=మనస్సుకలవాఁడ
గుచు మంద ... రణః మందర=మందరమను, అగ=పర్వతము
యొక్క, భరణ=తాల్చుటయే, ఆభరణః=భూషణముగాకల,
ందరరూపః, సుందర మనోహరమైన రూపః=ఆకారముకల,
ం=నీవు, మే=నాయొక్క, హృన్మందిరే, హృత్=మనస్సను,
ందిరే=భవనమందు, ప్రవిశ=ప్రవేశించుము.

గీ. ఇందిరాదేవి నొందన+మందరాగ
పూరితాత్ముఁడవై మహా+ద్భుతము పొడమ

మందరాగమ్ముదాల్చినకసుందరాంగ
కూర్మనాయకనాహృదిఁకగూడుమయ్య ॥

తా. ఓ కూర్మరూపమ్ముదాల్చిన విష్ణుదేవా! లక్ష్మికై కొన మిక్కిలి మక్కువగలవాఁడవై, మందరపర్వతముఁ దాల్చి సముద్రము మథింపం జేసి యయ్యాదిలక్ష్మిం గైకొనినసీవు నా హృదయమందిరమ్మున నివసింపుము.

శ్లో. త్వద్దయాధిగతయా మృతఝర్యా
దైవతా న్యమృతతా మధిగత్య।
శాశ్వతామృత మహో భవితారః
కచ్ఛపేంద్రకృపయావ సదా మాం॥

టీ. హే కచ్ఛపేంద్ర = ఓకూర్మపతిరూపవిష్ణుదేవా! దైవతాని = వేల్పులు, త్వద్దయాధిగతయా, త్వత్ = నీయొక్క, దయా=కృపచేత, అధిగతయా=పొందఁబడిన, అమృతఝర్యా, అమృత = అమృతముయొక్క, ఝర్యా = ప్రవాహముచేత, అమృతతాం = చావులేకుండుటను, అధిగత్య=పొంది, శాశ్వతామృతమ్, శాశ్వతి = స్థిరమైన, అమృతం = మోక్షమై భవితారః = కాగలరు, అహో=ఆశ్చర్యము! సః = అట్టి, త్వం=నీవు (పదద్వయ మధ్యాహారము) సదా = ఎల్లప్పుడు, మాం = నన్ను అవ = రక్షింపుమా.

చ. అరయ భవద్దయాధిగత కమానమృతమ్మునఁ జేసి వేల్పులం
దొరుసమృతత్వమొందియునుకతుట్టతుదన్ దగశాశ్వతామృత
స్ఫురణమునొందియుందురతికభూమిభవన్మహిమమ్ముకచ్ఛపే
శ్వరపరిపూర్ణమాకృపనకజస్రము మాకు ముదమ్ముగూర్పవే.

తా. ఓ కూర్మరూపమ్ము దాల్చిన విష్ణుదేవా! దేవతలు నీదయచే నొందఁబడిన యమృతముచే నమరులై ముందు శాశ్వత మోక్షము నొందువారు కాగలరు. అట్టి వేల్పులకు వేల్పువగు నీవు మమ్మెల్లప్పుడు సర్వసుఖంబు లొసంగి మను పుము. శబ్ద మాత్రంబున నమృతముచేత నమృతత్వమొంది అమృతము నొందువా రగుట యాశ్చర్యము.

శ్లో. దుష్టతాతప నిపీడిత జంతో
స్తాపనోదనరసం కమలా ప్తం।
పుష్కరస్థ మమృతప్రద మిద్ధం
ఛద్మకచ్ఛప' వదామి ఘనం త్వాం॥

టీ. హే ఛద్మకచ్ఛప=ఓ కపటకూర్మరూప విష్ణూ! దుష్ట ... జంతోః, దుష్టతాతప=ఎండవంటి దుష్టత్వముచేత, నిపీడిత= మిక్కిలి పీడింపఁబడిన, జంతోః=ప్రాణియొక్క తాపనోదనరసం, తాప=తాపత్రయముయొక్క నోదన=పోఁగొట్టుటయందు,రసం= రాగముకల యని ప్రస్తుతార్థము. (ఆధ్యాత్మికము ఆధి భౌతి కము, ఆధిదైవికము యివి తాపత్రయము) దుష్టతా = దోష యుక్తమైన ఆతప=ఎండచేత, నిపీడిత=మిక్కిలి బాధింపఁబడిన జంతోః=ప్రాణియొక్క, తాప=సంతాపమును,నోదన=పోఁగొట్టు రసం=ఉదకముగల దని యన్యార్థము. కమలాప్తం, కమలా= లక్ష్మీదేవికి, ఆప్తం=బాధువైన (భర్త) లేక కమలా=లక్ష్మీదేవిని ఆప్తం = పొందిన యని కూర్మపరము. కమల = ఉదకమును, ఆప్తం = పొందినయని యన్యపరము. పుష్కరస్థం, పుష్కర = ఉదకమందు స్థం=ఉన్నయని కూర్మ పరము, పుష్కర=ఆకాశ మందు, స్థం=ఉన్నయని యన్యపరము అమృతప్రదం, అమృత=

అమృతమును, లేక మోక్షమును ప్రదం=ఇచ్చునట్టి యని కూర్మ పరము. అమృత=ఉదకమును, ప్రదం=ఇచ్చునట్టియని యన్యార్థము. ఇద్ధం=ప్రకాశింపఁ జేయఁబడిన యని యుభయ పరము, త్వాం=నిన్ను, ఘనం=అందరికంటె గొప్పవానిని గానని ప్రస్తుతము, మేఘమునుగా నని యన్యార్థము.

చ. అనవరతాతి దోషబహుళాతప పీడితజంతు తాపనో
    దనరసతన్ విరాజదమృత ప్రదతన్ గురు పుష్కరస్థతం
    గనదురుదీప్తియుక్తిని తగంగమహోన్నతఁ జెన్నుసంగుని
    న్ననుగుణవృత్తి నేఘనుఁడవంచువచించెదఁ గచ్ఛపేశ్వరా.

తా॥ ఓకూర్మరూప విష్ణుదేవా! తాపత్రయంబుచేఁ బీడితులగు భక్తుల తాపమ్ము దునిమి శుభంబుఁగూర్చ నెంతయుం గోర్కె గలిగినట్టియు నెల్లపుడు నురమ్మున సిరిందాల్చునట్టియు, నుదకమ్మున విరాజిల్లునట్టియు దేవతల కమృతంబిడునట్టియు లేక భక్తులకు మోక్షంబొసంగునట్టియు నిన్ను నెల్లరకంటె ఘనుండవని పేర్కొనుచున్నాఁడను అని ప్రస్తుతార్థము ఎండచేఁ బీడితులగు జంతువుల తాపమ్ము దున్మి సుఖంబొసంగు జలమ్ముఁ గల్గినట్టియు నాకసమ్మున నెసంగునట్టియు నుదకమ్ము నొసంగునట్టియు నిన్ను మేఘంబని నుడువుచుంటి నని యన్యార్థము.

శ్లో. పితామహామహేశ్వరప్రభృతయో యదీయం పదం
    దధుర్నకుటతల్లజై రరిదరాది రేఖాంకితం।
    సురాసుర వివర్తనా దుదధిమగ్న మూర్వీధరం
    హరేకపటకచ్ఛపాకృతి రహో వహాస్యాదరాత్॥

టీ. హే హరే=ఓ కూర్మరూప విష్ణుదేవా, పితా . తయః, పితామహ=బ్రహ్మ, మహేశ్వర=శివుఁడు ప్రభృతయః=మున్నగు వారు, మకుట తల్లజైః=ప్రశస్తములగు కిరీటములచేత (కిరీట యుక్త శిరములచేత నని భావము) యదీయం=ఏనీసంబంధమైన అరి ... కితం, అరి=చక్రము, దర=శంఖము, ఆది=మున్నగువాటి యొక్క రేఖా=రేఖలచేత, అంకితం=చిహ్నితమగు, పదం=పాద మును, దధుః=ధరించిరో, సః=అట్టి త్వం=నీవు (అనుపదద్వయ మధ్యాహారము) సురాసుర వివర్తనాత్, సురాసుర=దేవదాన వులయొక్క వివర్తనాత్=మథనమువలన, ఉదధిమగ్నం, ఉదధి =సముద్రమందు, మగ్నం=మునిఁగిన, ఉర్వీధరం=మందరపర్వత మును, ఆదరాత్, ఆదరమువలన, కపటకచ్ఛపాకృతిః, కపట = కపటమైన కచ్ఛప=కూర్మముయొక్క ఆకృతిః=రూపముకలవాఁ డవగుచు, వహసి=ధరించుచున్నావు, అహో=ఆశ్చర్యము !

చ. శతధృతిశంకరాది సురసత్తమమూర్ధకిరీటరత్నరా
జితమృదుశంఖచక్రముఖచిహ్నితపాదుఁడవయ్యుభవ్యకూ
ర్మతనువుదాల్చినిర్జరులురక్కసులున్ మథియించునాఁడువా
ర్ధితలమునన్మునింగినగిరిన్ భరియించితి వౌర శ్రీహరీ.

తా. బ్రహ్మాదిదేవతలచే నొదలలం బూనఁబడు మహా భాగ్యప్రతిపాదకమ్ములగు శంఖచక్రాద్యాకార రేఖలచే నలం కరింపఁబడిన మృదుపదమ్ములుగల వాఁడవయ్యునీవు తాఁబేటి రూపమ్ము దాల్చి, కఠినంబగు మందరపర్వతము మోచితివి. మిక్కిలి సుకుమారమగు దివ్యసుందర రూపమ్ముఁగలవాఁడు తాఁబేటి రూపమ్ముదాల్చుటయు, కఠినంబగు పర్వతము నెత్తి మోయుటయును ఆశ్చర్యము.

శ్లో. అపారాకంపకృపయా పాహి శీతలయా దృశా।
భవతాపప్రతప్తం మాం కచ్ఛపేశార్తినాశన॥ 6

టీ. ఆర్తినాశన, ఆర్తి=పీడలను, నాశన=నశింపఁజేయునట్టి, హేకచ్ఛపేశ=ఓకూర్మప్రతిరూప విష్ణుదేవా ! అపారాకంపకృపయా, అపార=దరిలేని, అకంప=స్థిరమగు. కృపయా=దయగల, లేక, దయచేత శీతలయా=చల్లని, దృశా=దృష్టిచేత, భవ ... తప్తం, భవ=సంసారపు, తాప=తాపత్రయముచేత, ప్రతప్తం= మిక్కిలితపింపఁజేయఁబడిన, మాం=నన్ను పాహి=రక్షింపుమా.

గీ. కూర్మపుం దేవకూరిమిఁ గొమరు మిగుల
నమృతశీతలదృక్ప్రసారము ఘటించి
విషమసంసృతిలోఁబడి వేఁగునాదు
నార్తిఁ దునుమాడి వేగఁగాపాడుమయ్య.

తా. ఓకూర్మరూపవిష్ణుదేవా ! సంసారతాపమ్ములచే మిక్కిలి పీడితుండ నగునాపైఁగరుణారసము పొంగిపొరలు నీ చల్లనిచూడ్కులఁ బరపి ప్రోవుము.

శ్లో. కఠిన మందరపర్వతధారణం
జలనిధౌ వసనం జలజంతుభిః।
శ్రమదమప్యజకూర్మ రమాప్తయే
ద్వితయ మాదృతవానసి నాన్యథా॥

టి. హేఅజకూర్మ, అజ = పుట్టుకలేని, (స్వయంభువవగు) కూర్మ=కూర్మరూపము దాల్చినవిష్ణుదేవా! త్వం=నీవు, కఠి... రణం, కఠిన = కఠినమైన, మందరపర్వత = మందరపర్వతము యొక్క, ధారణం = ధరించుటయును, జలనిధౌ=సముద్రమందు,

(ల, డలకభేదమ్ము, గావున మూర్ఖనిధియనిస్ఫురణము) జల
జంతుభిః, జల=నీటియందలి, జంతుభిః=ప్రాణులతోడ (పూర్వ
మ్మువలెనే జడజంతువులతోననఁగా మూర్ఖజంతువులతోనని
స్ఫురణము) వసనం=నివసించుటయును, శ్రమదమపి, శ్రమ=కష్ట
మును, దమపి = కలిగించునదైనను, ద్వితయం = ఈరెంటిని,
రమాప్తయే, రమా=శ్రీదేవిని, ఆప్తయే = పొందుటకొరకు,
ఆదృతవాన్=ఆదరించినవాఁడవు, అసి=అయితివి. అన్యథా=మరి
యొకవిధముగ, న=కాదు.

మ. బలితంపుందరికొండదాల్చుట మహావారాశిమధ్యమ్మునన్
జలజంతుప్రకరంబుతోడుతనివాసంబిద్వయమ్మున్ శ్రమం
గలుగంజేసెడిదైనదేవ! సిరినింకైగైకోమనం బెంతయున్
వలపుంజెందుటనాదరించితిఁకనన్యం బెద్దియుంగా వజా.

తా. ఓకూర్మరూపవిష్ణుదేవా! కఠినంబగు మందరపర్వ
తముఁ దాల్చుటయు జలనిధియందు జలజంతువులతో వసించు
టయు నీరెండును మనమ్మునకుఁ గష్టమొదవించునవియైనను,
నాశ్రీదేవింగైకొన నెంతయుఁ గోర్కెపొడముటంజేసి యాద
రించితివి. మరి యొండుకారణంబునంగాదు.

శ్లో. ఇచ్ఛాకచ్ఛపపాచ్ఛనిశ్చలహృదా తుచ్ఛేతరైర్గచ్ఛకై
ర్దీపైర్ధూపనివేదనైశ్చ సకలాకల్పైరనల్పైస్తవ।
పూజాం యఃకురుతే సకచ్ఛపపతిర్జాయేతభృంగక్రిమి
న్యాయేనైవవయంచసంయమిజనధ్యేయంభజా
[మోముదా॥ ౮

టీ. ఇచ్ఛాకచ్ఛపప, ఇచ్ఛా=లీలచేఁదాల్పఁబడిన కచ్ఛపప=
కూర్మపతిరూపముగలవిష్ణుదేవా, యః=ఎవ్వఁడు అచ్ఛనిశ్చలహృ

దా, అచ్ఛ=నిర్మలమైన. నిశ్చల=స్థిరమైన,హృదా=మనస్సుతో, తుచ్ఛేతరైః=మంచివగు, గుచ్ఛకైః=పూలగుత్తులచేతను, దీపైః దీపములచేతను, ధూపనివేదనైశ్చ, ధూప=సాంబ్రాణి మొదలగు ధూపములచేతను, నివేదనైశ్చ=నైవేద్యములచేతనున్ను, అనల్పైః=గొప్పవగు (అనఁగా మిక్కిలి విలువగల) సకలాకల్పైః; సకల=వివిధములగు, ఆకల్పైః= అలంకారములచేతను, తవ=నీయొక్క, పూజాం=పూజను కురుతే=చేయుచున్నాఁడో, సః=వాఁడు. భృంగక్రిమిన్యాయేన=భ్రమరకీటన్యాయముచేత, (తుమ్మెద యొకానొకపురుగును పట్టుకొని కొంతకాలము దానిని విడువక తిరుగును. అట్లుండగా కొంతకాలమున కాపురుగు తుమ్మెదరూప మొందునని ప్రసిద్ధి ఇదియే భ్రమరకీటన్యాయము) కచ్ఛపపతిరేవ=కూర్మనాయకుఁడే, జాయేత=అగును. వయంచ మేమున్ను, సంయమిజనధ్యేయం, సంయమిజన=మునిజనముచేత, ధ్యేయం=ధ్యానము సేయఁదగిన, త్వాం=నిన్ను, ముదా,సంతోషముచేత, భజామః=సేవించుచున్నాము.

మ. స్వమతిన్ స్వీకృత కూర్మవిగ్రహాయామిన్ త్వాం నైక గమ్యస్వరూ
పమహాభూషణధూప దీపసుమస్రగ్భవ్యార్చలన్ నిన్ను వే
డ్కమదిన్ గొల్చెడువాఁడొగిన్ భ్రమరకీటన్యాయమార్గానుసా
రముగాఁగచ్ఛపమూర్తియౌటముదమారంగొల్తు నేనున్ నినున్.

తా. ఓకూర్మపతిరూప విష్ణుదేవా, ఎవ్వండు నిన్ను నిశ్చలంబగు మనంబుతో పూలచేతను, ధూపదీప భూషణాదులచేతనుఁ బూజించునోవాఁడు భ్రమరకీటన్యాయముచే నీస్వరూపము నొందును. కావున నేనును మునిజనధ్యేయుండవగు నిన్నుం గొల్చుచుంటిని.

శ్లో. స్వకర్పరపరిభ్రమత్కుధరకాషణోత్థైస్సుఖై
ర్మనాఙ్ముకులితేక్షణోద్గతముదశ్రులేశార్ద్రితః।
సురేశ్వరసురద్విషామమృతదానతద్ధానయో
ర్ముదాకలితదోహదః కమఠనాయకః పాతు నః॥ 9

టీ. స్వక ... ..ణోత్థైః, స్వ=తనయొక్క, కర్పర=వీపుచిప్ప యందు, పరిభ్రమత్=తిరుగుచున్న, కుధర=మందర పర్వతము యొక్క కాషణ=ఒరపుసుచేత, ఉత్థైః=పుట్టిన, సుఖైః=సౌఖ్యముల చేత, మనా ... ...ర్ద్రితః, మనాక్=కొంచెము, ముకుళిత=మూసుకొనఁ బడిన, ఈక్షణ=నేత్రములవలన, ఉద్గత=బయలువెడలిన ముదశ్రు=ఆనందబాష్పములయొక్క లేశ=లవములచేతఁ (బిందువులచేత)ఆర్ద్రితః=తడుపఁబడినట్టియు, సురేశ్వరసురద్విషామ్=దేవ దానవులకు, అమృతదానతద్ధానయోః, అమృత=అమృతమును, దాన=ఇచ్చుటకును, తద్ధానయోః, తత్=ఆయమృతముయొక్క హానయోః=అభావమునకును (దేవతలకిచ్చుటకు దానవులకు లేకుండఁజేయుటకును)ముదా=సంతోషముచేత,కలిత=చేయఁబడిన, దోహదః=దోహదముకల(ఇచ్చటదోహదమనకార్యసాధకమగునుపాయము)కమఠనాయకః=కూర్మపతి,నః=మమ్ము పాతు=రక్షించుఁగాత.

చ. వదలకయాత్మకర్పరముపైఁదిరుగాడెడు కొండరాయిడిం
బొదలుసుఖమ్ముచేతనరమోడ్పుజూపులమోదబాష్పముల్
గదురఁగ వేలుపుల్సుధనుగైకొన దానవులొందకుండ దో
హద మొనరించినట్టికమఠాధిపుఁడేలుతమమ్మునిచ్చలున్.

తా. తనవీపుపైని తిరుగాడుచున్న మందర పర్వతము యొక్క రాయిడిచేఁ, గలిగిన సుఖమ్మున నరమోడుపుకన్నులఁ జాలుగొను నానందబాష్పములచేఁ, దడుపఁబడినట్టియు, దేవతల కమృతమిచ్చుటకును, దానవులకు లేకుండఁ జేయుటకును విచిత్రమగునుపాయంబుఁ బన్నినకూర్మనాయకుండు మమ్ముం బ్రోవుఁ గావుత.

శ్లో. సదోపచితపూజయా నియతచేతసే దేహినే
ప్రదత్తసకలశ్రియం విబుధపూగహర్షప్రదం।
విపల్లవవినాశదం మధుపసంచయారిష్టదం
వదామికమఠేశ్వరంసురతరుం స్ఫుటామోదకం॥

టీ. సదా=ఎల్లప్పుడు, ఉపచితపూజయా, ఉపచిత = వృద్ధిపొందింపఁబడిన. పూజయా=సేవచేత, నియతచేతసే, నియత=నిశ్చలమైన, చేతసే=మనస్సుగల, దేహినే=ప్రాణికొరకు, ప్రదత్తసకలశ్రియం, ప్రదత్త=అధికముగానొసంగఁబడిన, సకల = సమస్తమైన, శ్రియం = సంపదలుకలిగినట్టియు, విబుధపూగహర్షప్రదం, విబుధ=దేవతలయొక్క, పూగ=సమూహామునకు హర్ష=ఆనందమును ప్రదం=ఇచ్చునట్టియు, విపల్లవవినాశదం, విపల్లవ, విపత్=ఆపదలయొక్క, లవ=లేశముయొక్క, వినాశ=నాశనమును, దం=కలుగఁజేయునట్టియు, (నిశ్శేషముగానాపదలను నశింపఁజేయునట్టి) మధు ... ష్టదం, మధుప=మద్యపానముసేయువారియొక్క (త్రాగుఁబోతులయొక్క) సంచయ=సమూహామునకు, అరిష్ట = అశుభమును, దం = ఇచ్చునట్టియని కూర్మపతిపరము, మధుప=తుమ్మెదలయొక్క, సంచయ=సమూహామునకు, అరిష్ట=శుభమును, దం=ఇచ్చునట్టి (మకరందదాన

ము చే) అనికల్పవృక్షపరము, స్ఫుటా మోదకం, స్ఫుట=ప్రసిద్ధ మైన, ఆమోదకం=ఆనందముకల (బ్రహ్మానంద స్వరూపుఁడు) లేక స్ఫుటముగానానందింపఁ జేయునట్టి అని కూర్మపతిపరము, స్ఫుట=వెల్లడియగు, ఆమోదకం=పరిమళముగల (లేక పుష్పము లవికాసముచేత పరిమళముఁగల, వికాసార్థమున స్ఫుటయను పదము స్ఫుటవికసనే అను ధాతువువలన నిష్పన్నము) అని కల్ప వృక్షపరము. కమఠేశ్వరం=కూర్మపతిని, సురతరుం=కల్పవృక్షముగా, వదామి=పలుకుచున్నాను. రూపకము.

మ. అధికస్థేయతఁ గొల్చు వారికి సమస్తైశ్వర్యముల్ దార్చుటన్
బుధసంఘమ్మున కేపు గూర్చుట స్ఫుటామోదమ్ముతో నాప్పుటన్
మధుపారిష్టకృతిన్ విపల్లవమునున్ ఖండించుటన్ జేసి వే
డ్కధృతిన్ నిన్నలకల్పవృక్షమని వర్ణింతుఁ గూర్మేశ్వరా

తా. ఓకూర్మపతిరూప విష్ణుదేవా! భక్తితో నెల్లప్పుడు సేవించు జనులకు సమస్తసంపద లొసంగునట్టియు, విబుధసంఘంబునకు హర్షమ్ము గూర్చునట్టియు, నాపదల నెల్లఁ జెండాడునట్టియు, మధుపసమూహమున కరిష్టముగూర్చునట్టియు, నిన్ను కల్పవృక్షమ్ముగా వర్ణించుచుంటిని.

ఇతి కూర్మావతారః

కూర్మావతారనుతిసమాప్తము.

—••••—

# దశావతారనుతి శతకేకిత్యవతారః.



శ్లో. కుపల్వలదపాంనిధిః ప్రథితఘోణిరూపో భవాన్
కుటన్నటదరిచ్ఛటః ప్రకటకందుకీభూతభూః ।
అనంతమహిమా ద్రుతంమమఘనాఘపుంజంహరే
హరేదితి సునిశ్చయాద్దృఢమతి ర్నుతిం ప్రారభే॥

టీ. హే హరే=ఓ విష్ణుదేవా, ప్రథితఘోణిరూపః, ప్రథిత=ప్రసిద్ధమైన ఘోణిరూపః = వరాహస్వరూపము కలిగినట్టియు కుపల్వల దపాంనిధిః, కుపల్వలత్=అల్ప సరంబై యాచరించుచున్న, అపాంనిధిః=సముద్రములు కలిగినట్టియు, కుటన్నట దరిచ్ఛటః, కుటన్నటత్=తుంగముస్తలై యాచరించుచున్న అరిచ్ఛటః=శత్రుసమూహములు కలిగినటువంటిన్ని, ప్రకటకందుకీభూతభూః, ప్రకట=ప్రసిద్ధముగా,కందుకీభూత=బంతియైన, భూః=భూమి కల్గినటువంటిన్ని, అనంత మహిమా, అనంత=అపారమైన మహిమా=సామర్థ్యము కలిగినట్టియు, భవాన్=నీవు, ద్రుతం=శీఘ్రముగా మమ=నాయొక్క, ఘనాఘపుంజం, ఘన=గొప్పదగు, అఘ=పాపములయొక్క, పుంజ=సమూహమును, హరేత్=నశింపఁజేయుదువు ఇతి=అని, సునిశ్చయాత్ = మిక్కిలి నమ్మకమువలన,దృఢమతిః=స్థిరమైన మనస్సుకలవాఁడనగుచు, నుతిం=స్తోత్రమును, ప్రారభే=ప్రారంభించుచున్నాను.

చ. వెరఁగుగనేభవత్కిటిప విగ్రహకేళికి వార్ధిపల్వలం
బరితతి తుంగముస్తభువికయ్యెదికందుకమయ్యెనోదయా

కరమతియట్టి కేళిమద ఘ ఘుంబులుద్రుంచునటంచు నమ్మికన్
స్థిరమగుడెందముంగొనినుకతింపఁ దొడంగితిఁ బ్రోవు మోహరీ.

తా. ఓ విష్ణుదేవా! వరాహరూపమ్ముదాల్చిన నీ యొక్క క్రీడకు సముద్రములు పల్వలంబులుగను, శత్రుసంఘము తుంగముస్తలుగను, భూమి కందుకముగను నయ్యెనో, యట్టి నీకేళి నాపాపములను దునుమాడు ననునమ్మికతో నిన్నుంగొని యాడ మొదలిడుచుంటిని.

శ్లో. తత్తాదృక్షమధస్సమస్తభువనాభీలాసురచ్ఛేదస
ద్దీక్షాయుక్శతకోటితీక్ష్ణ విలసద్దంష్ట్రాగ్ర్యరుగ్భాసితం।
సర్వౌజఃప్రకరస్య పిండమివ తేరూపం మహద్దారుణం
లోకానాం వ్యసనాపనోదనవిధౌ ఘృష్టీశ్వరాభూత్సతి॥

టీ హేఘృష్టీశ్వర = ఓవరాహపతిరూపవిష్ణుదేవా! తత్తాదృక్షం=నిరుపమానమైన అధ ... ... సితం, అధః=క్రిందుభాగమందలి సమస్తభువన=సమస్తలోకములకు (సర్వజనులకు) ఆభీల=భయంకరులగు అసుర=రాక్షసులయొక్క, ఛేద=ఖండించుట యందు, సత్=యోగ్యమైన దీక్షా=నియమముతో, యుక్=కూడుకొనిన, శతకోటి=వజ్రాయుధము వ్రోలె, తీక్ష్ణ=వాడిగల, విలసత్ ప్రకాశించుచున్న, దంష్ట్రా=కోరలయొక్క, అగ్ర్య=శ్రేష్ఠమైన, రుక్=కాంతిచేత, భాసితం = ప్రకాశింపఁజేయఁ బడినట్టియు, సర్వౌజః ప్రకరస్య, సర్వ=సమస్తమైన, ఓజః= తేజస్సులయొక్క ప్రకరస్య=సమూహముయొక్క పిండమివ=ముద్దవలెనున్నట్టియు మహత్=గొప్పదైనట్టియు, దారుణం=భయంకరమైనట్టియు తే= నీయొక్క, రూపం=ఆకారము, లోకానాం=సమస్త భువనముల

యొక్క (సమస్తజనులయొక్క) వ్యసనాపనోదనవిధౌ, వ్యసన= దుఃఖములయొక్క, అపనోదన=పోఁగొట్టుటయనెడి, విధౌ=పని యందు, అభూత్=ఆయెను. బత=యేమి! (ఆనందద్యోతకము) లేక ఆశ్చర్యద్యోతకము.)

మ. సకలాధోభువనాతిభీకృదసురేశ చ్ఛేదదీక్షాయుత
ప్రకరోరాశనికోటిశాతతరదంష్ట్రాదీపితంబున్ సమ
స్తకనద్దివ్యమహఃప్రపూరమనవిశ్రాసమ్మునొందించుతా
నకరూపమ్మువరాహదేవజగముల్ శాపాలింపనయ్యెన్ బళీ.

తా. ఓవరాహపతిరూప విష్ణుదేవా! నిరుపమానమైనట్టి యు, క్రిందుభాగమందలి సమస్తజనులకు భయంకరులగు నెల్ల రాక్షసుల సంహరించుట యనుదీక్షం బూనిన వజ్రాయుధము కైవడి మిక్కిలి వాడిగల మెరుఁగు కోరలయొక్క నిరుపమాన కాంతిచేఁ బ్రకాశింపఁ జేయఁబడినట్టియు నెల్ల తేజంబుల ప్రోవు వలె మిక్కిలి భయకరం బగునీరూపము సమస్త జనులయొక్క యాపదలం దునుమాడెను.

శ్లో. లక్ష్మీర్దారా విధిమనసిజౌ యస్య పుత్రౌ సురేజ్యౌ
సుత్రామాద్యా నిఖిలకకుభాంనాయకా భృత్యవర్గః।
తాదృక్షస్య త్రిజగదవనే బద్ధదీక్షస్య విష్ణో
ర్ఘృష్ట్యాకృత్యాధరణివహనం నైవ తే దేవ హైన్యం ॥

టీ. హేదేవ=ఓదైవమా, విష్ణో=విష్ణువా, యస్య=ఏనీయొ క్క, దారాః=భార్య, లక్ష్మీః=శ్రీదేవియో, పుత్రౌ=కొడుకులు, సురేజ్యౌ, సుర=దేవతలచేత, ఇజ్యౌ=పూజించఁదగిన, విధిమన సిజౌ, విధి=బ్రహ్మయు, మనసిజౌ=మన్మథుఁడునో, భృత్యవర్గః=

సేవకసమూహము, సుత్రామాద్యాః = ఇంద్రుఁడుమున్నగు, నిఖిలకకుభాంనాయకాః=ఎల్లదిక్పతులో, తాదృశస్య=అటువంటి, త్రిజగదవనే, త్రిజగత్=లోకత్రయముయొక్క, అవనే=రక్షించుటయందు, బద్ధదీక్షస్య, బద్ధ=పూనఁబడిన, దీక్షస్య=దీక్షకల, తే=నీకు, ఘృష్ట్యాకృత్యా, ఘృష్టి = వరాహముయొక్క, ఆకృత్యా=రూపముచేత, ధరణివహనం = భూమినిమోయుట, హైన్యం=కొదువ, నైవ=కాదు.

సీ. కలికిచూపులసిరుల్ కొలుపుకల్కులజవ
రాలునెవ్వానియిల్లాలొ తెలియ
నెల్లవేల్పులలోనఁ దల్లజులగుధాతృ
పద్మనారాచులెవ్వానిసుతులొ
ముల్లోకమును తేజమున వెలయించుసూ
ర్యాచంద్రమసులు నేత్రంబులెవని
కెల్లదిక్కులకును నేలికలైన దే
వేంద్రాదులెవ్వానిభృత్యవర్గ

గీ. మట్టి జగముల నెల్లగాపాడ గట్టి
పూన్కిగలదివ్య మహిమంబుగొనవరునీకు
పోత్రి రూపంబుతో భువిమోయు టొక్క
సేగి గాదయ్య యోసరసీజనేత.

తా. ఓ విష్ణుదేవా! యే నీకు శ్రీదేవి భార్యయో యెల్ల దేవతలలో గరిష్ఠులగు బ్రహ్మమన్మథులు పుత్రులో యింద్రుండు మున్నగు నెల్ల దిక్పాలురు సేవకసంఘమో, యట్టి నీవు ముల్లోకముల నాపద లొందకుండ రక్షించుటకు బద్ధకంకణుండవు

గావున వరాహరూపమ్ముఁదాల్చి భూమిని మోయుట కొదువ గాదు.

శ్లో. పాతాలమగ్న మవనీతల మున్న మయ్య
గ్లానింయథా దళితవా నసి పోత్రినాథ।
సంసారవారినిధి పూరనిమగ్నచిత్తం
మాముద్ధరాశుభవతోద్య యశోధికం స్యాత్॥

టీ హేపోత్రినాథ=ఓవరాహపతిరూప విష్ణుదేవా! పాతాలమగ్నం, పాతాల=రసాతలమందు, మగ్నం=మునిఁగిన, అవనీతలం=భూతలమును,ఉన్నమయ్య=పైకి వెడలించి గ్లానిం=శ్రమను యథా=యేప్రకారముగా, దళితవాన్=తునుమాడినవాఁడవు, అసి=అయితివో, తథా=అట్లే సంసా... చిత్తం సంసార=సంసారమను, వారినిధి=సముద్రముయొక్క, పూర=ప్రవాహమందు, నిమగ్న=మునిఁగిన చిత్తం మనస్సుకల మాం=నన్ను ఆశు=శీఘ్రముగా ఉద్ధర=ఉద్ధరించుమూ, భవతః=నీకు,అద్య=ఇప్పుడు అధికం =మిక్కిలి యశః=కీర్తి స్యాత్=అగును.

చ. వనధిని మగ్నధాత్రినరకేపంటను మింటికి నెత్తి తచ్ఛ్రమన్
దునిమినయట్టులిప్డుభవకేతో యధిమధ్యనిమగ్నమానను౦
డనగుటచేఁగడుంబడలుకేనన్ దరియింపఁగఁజేసిమేల్సుఖం
బునొసఁగి బ్రోవుమయ్యపరికేపూర్ణయశంబగుఁబోత్రినాయకా.

తా. ఓ వరాహపతిరూప విష్ణుదేవా! పాతాళంబున మునింగిన భూతలంబు నెత్తి దానిశ్రమం దునుమాడినట్లు సంసార సముద్రమున మునింగి శ్రమఁజెందునన్ను వేగమ్ముగా నుద్ధరించుము. నీకెంతయు యశం బగును.

శ్లో. హిరణ్యాక్షా భిఖ్యాసురవరవధానంతర మహో
మహీముద్ధర్తుస్తే సురు చిరశరీరవ్యతికరాత్ ।
సుఖస్పర్శానందామృతజలధి మగ్నా మహీ రభూ
త్కథంయత్నః పోత్రిన్! కథయ ఫలితాంప్రాపభవతః ॥

టీ. హే పోత్రిన్=ఓ వరాహరూప విష్ణుదేవా! హిర ... తరం, హిరణ్యాక్ష=హిరణ్యాక్షుడని, అభిఖ్య=పేరుగల, అసుర వర=రాక్షస శ్రేష్ఠునియొక్క, వధ=సంహారముయొక్క, అనంతరం=పిమ్మట, మహీం=భూమిని, ఉద్ధర్తుః=లేవనెత్తిన, తే=నీయొక్క, సురు ... రాత్, సురుచిర=మిక్కిలి ప్రకాశించుచున్న శరీర=మేనియొక్క, వ్యతికరాత్=కలిసికొనుటవలన, మహీః= భూదేవి. సుఖ ... మగ్నా, సుఖస్పర్శ=సుఖస్పర్శవలన జనించిన ఆనంద=సంతోషమను, అమృతజలధి = అమృతసముద్రమందు, మగ్నా=మునిఁగినది, అభూత్=ఆయెను. అహో=ఆశ్చర్యము, భవతః=నీయొక్క, యత్నః = ప్రయత్నము, కంథ=ఎట్లు. ఫలితాం=ఫలముగలుగుటను, ప్రాప=పొందెను, కథయ=చెప్పుమా॥

మ. నతులేపారి హిరణ్యనేత్ర దనుజశ్రేష్ఠున్ వ్రాఁడియామీఁద న
ద్భుతవృత్తిన్ ధరనుద్ధరించినను మేనల్లార్పారునీమేనిసం
గతి సుస్పర్శి మహాసుఖాబ్ధిముని గెంతగా దేబళీయింక నీ
యతనంబెట్లు ఫలించెనో తెలుపుమయ్యా నాకు ఘోణీశ్వరా.

తా. ఓ వరాహరూప విష్ణుదేవా! హిరణ్యాక్షుని సంహరించి యాపై భూమిని పాతాళమ్మునుండి యుద్ధరించుచున్న నీదివ్యసుందర విగ్రహ సంపర్కంబున నాదవు సుఖస్పర్శవలన

కలిగిన యానందసముద్రమ్ములో నాభూదేవి మునింగెను గదా నీయత్నం బెట్లు ఫలించెనో తెలుపుము.

శ్లో॥ భూదారకృత భూదారసదారక్షో విదారక ।
ఉదారశీతల హృదా ముదారక్షాదరేణ మాం॥

టీ. భూదారకృత భూదార, భూ=భూదేవియను దార=భార్య నిమిత్తము, కృత=చేయఁబడిన (స్వీకరింపఁబడిన) భూదార=వరాహరూపముఁ గలవాఁడా, సదా=ఎల్లప్పుడు, రక్షోవిదారక, రక్షః=రక్కసులను, విదారక=చీల్చువాఁడా, ఉదార శీతల హృదా, ఉదార = ఔదార్యముతోఁ గూడిన, లేక గొప్పదైన శీతల = చల్లని, హృదా=మనస్సుతోడను, ముదా=సంతోషము తోడను, ఆదరేణ=ఆదరముతోడను, ఉపలక్షితః=కూడినవాఁడ వగుచు (అధ్యాహారము) మాం=నన్ను రక్ష=రక్షించుమా.

క. భూదారార్థ స్వీకృత
భూదారోదారదివ్యకమూర్తి హృతారీ
మోదాతి శీతలపుహృది
నాదర మెసలారమముదకియం బ్రోవు హరీ.

తా. భూమియను భార్యకై ధరింపఁబడిన వరాహ రూపముగల యోవిష్ణుదేవా ! దయతోఁ జల్లని చూడ్కులు మాయెడం బ్రసరింపఁ జేసి బ్రోవుము.

శ్లో. భూదార రూపధారిన్
భూమ్యుద్ధారః కృతోంజసా భవతా
అఘటిత ఘటనాశక్తిం
ప్రకటయితుం సకలలోకస్య.

టీ. హేభూదారరూపధారిన్, భూదార = వరాహము యొక్క (భూమిని బ్రద్దలు చేయునది) రూప = ఆకారమును, ధారిన్ = ధరించినవాఁడా, అంజసా=శీఘ్రముగా, భవతా=నీచేత అఘటిత ఘటనాశక్తిం, అఘటిత=కూర్పఁబడనివాటియొక్క (చేయశక్యముకాని పనులయొక్క,) ఘటనా=కూర్చుటయందలి, శక్తిం=సామర్థ్యమును; సకలలోకస్య = సమస్తజనమునకు, ప్రకటయితుం= తెలియఁ జేయుటకొరకు, భూమ్యుద్ధారం=భూమిని పైకి వెడలించుట (అనఁగా రక్షించుట) కృతః=చేయఁబడినది.

క. భక్తప్రియ భూదార
వ్యక్తిన్ భువి నుద్ధరించుకొట ఘటిత ఘటనా
శక్తిని లోకముల కభి
వ్యక్తము సేయంగ నేగకొదా కమలాక్షా.

తా. ఓ దేవదేవా! నీవు నీ యఘటిత ఘటనా శక్తిని లోకులకు వెల్లడిసేయుటకే భూదారరూపముఁ దాల్చి భూమిని రక్షించితివి

శ్లో॥ స్తబ్ధరోమేశ భవతా పుణ్యాలోకావనేచ్ఛునా
నిహతో యత్పుణ్యజనో నాతశ్చిత్రం జగత్త్రయే. 8

టీ. హే స్తబ్ధరోమేశ = స్తబ్ధరోమ = వరాహములకు, ఈశ = ప్రభువా! (వరాహపతి రూపవిష్ణుదేవా) పుణ్యాలోకావనేచ్ఛునా పుణ్యా-పవిత్రులగు, లోక=జనులను, అవన=రక్షించుటయందు, ఇచ్ఛునా=కోరికగల, భవతా=నీచేత, పుణ్యజనః=రాక్షసుఁడు (పవిత్రజను డని స్ఫురణము) నిహతఇతియత్ = చంపఁబడె ననుటయేది కలదో, అతః = దానికంటె, చిత్రం = ఆశ్చర్యము, జగత్త్రయే=ముల్లోకమున, న=లేదు.

క. సన్నుతకిటి పుణ్యుల క
భ్యున్నతి నిడ నవతరించి పుణ్యాజనులనే
గ్రన్నన తున్మితి వీవని
కన్న విచిత్రంబు ముజ్జగంబునఁ గలదే.

తా. ఓ వరాహపతిరూప విష్ణుదేవా! నీవు పుణ్యాలోక
ములను రక్షింపఁ బుడమినవతరించి పుణ్యాజనులనే సంహరించితివి.
ఇంతకన్న ముల్లోకంబుల చిత్రంబుకలదే! రాక్షసుండగు హిర
ణ్యాక్షుఁదునుమాడి సజ్జనులను కాపాడితి వని తాత్పర్యము.

శ్లో॥ కోలంపాలితలోకం క్షోణ్యున్నమనే కృతోద్యమంవందే।
వందారుభక్తలోకావనలోలంవాంఛితార్థదం దేవం ॥ 9

టీ. పాలితలోకం, పాలిత=రక్షింపఁబడిన, లోకం=సర్వజన
ములు గలిగినట్టియు, క్షోణ్యున్నమనే, క్షోణి=భూమియొక్క
ఉన్నమనే=పైకివెడలించుటయందు, కృతోద్యమం,కృత=చేయఁ
బడిన, ఉద్యమం=ప్రయత్నము గలిగినట్టియు,వందా ... లోలం,
వందారు=మ్రొక్కునట్టి, భక్తలోక=భక్తజనులను, అవన=
రక్షించుటయందు, లోలం=అసక్తి కలిగినట్టియు, వాంఛితార్థ
దం, వాంఛిత=కోరఁబడినట్టి, అర్థ=ప్రయోజనములను, దం=
ఇచ్చునట్టి, దేవం=దైవమును, కోలం=వరాహమును, వందే=
నమస్కరించుచున్నాను.

ఉ. పాలిత సర్వలోకునకు భక్తజనాదృతిశాలికిన్ గృపా
శాలికి వాంఛితార్థ ఫలసిద్ధివిధాయికి నుద్ధృతోర్వికిం
గోలమహోరు విగ్రహునకున్ వనమాలికి ఫాలమందు నేఁ
గేలు మొగిడ్చి ప్రోవుమని కేవల భక్తి నమస్కరించెదన్.

తా. ఎల్లలోకముల రక్షించినట్టియుఁ బాతాళంబున మునింగిన భూమి నుద్ధరించినట్టియు, మ్రొక్కునట్టి భక్తజనులఁ బ్రోవ వేడుకగలట్టియు, నెల్లకోర్కెలఁ దీర్చునట్టియు వరాహదేవునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఘృష్టీశత్వాం నిత్యతుష్టస్సేవతేయస్త్వదీక్షణాత్
ఉష్ణాంశుమండలం భిత్త్వా సభవేద్విష్టరశ్రవాః॥ 10

టీ. హేఘృష్టీశ, ఘృష్టి=వరాహములకు, ఈశ=ప్రభువా, (వరాహపతిరూప విష్ణుదేవా) నిత్యతుష్టః, నిత్య=ఎల్లప్పుడు, తుష్టః=సంతుష్టుఁడగు (విరాగియగు) యః=ఏజనుఁడు, త్వాం=నిన్ను, సేవతే=భజించుచున్నాఁడో, సః ఆజనుఁడు, త్వదీక్షణాత్, త్వత్=నీయొక్క, ఈక్షణాత్=దర్శనమువలన, ఉష్ణాంశుమండలం=సూర్యమండలమును, భిత్త్వా=బ్రద్దలుచేసి, విష్టరశ్రవాః=విష్ణువు, భవేత్=అగును.

ఉ. ఘృష్టివరేణ్య దేవనుత! యేమహనీయుఁడు సంతతంబు సం
తుష్టి గలట్టియోగివిబుధుండయి గొల్చునో వాఁడు నీకృపా
శ్లిష్టుఁడుగావుటం దగవిశిష్టజనస్తవనీయుఁడై రహిన్
స్పష్టముగాఁ బగిల్చియల భాస్కరమండలినీ వయయ్యెడున్.

తా. ఓ వరాహపతిరూప విష్ణుదేవా. నిత్యతుష్టుఁడగు నే మహనీయుఁడు నిన్ను భజించునో యాతండు నీకటాక్షవీక్షణంబునం జేసి సూర్యమండలమును ఛేదించి నీస్వరూపము నొందును.

ఇతికిట్యవతారః.

వరాహావతార వర్ణనము సమాప్తము.

---

# దశావతార నుతిశతకే నృసింహావతారః.

శ్లో॥ హిరణ్యదానా త్సుమనో వతంస
ప్రహ్లాదవృద్ధింజనయన్ నృసింహః ।
లక్ష్మీసమేతోఽవతుసర్వలోకం
సర్వజ్ఞవాగీశ ముఖాభినంద్యః ॥ 1

టీ. హిరణ్యదానాత్. హిరణ్య = హిరణ్యకశిపుని యొక్క-దానాత్ = ఖండించుటవలన, అని నృసింహదేవపరము. హిరణ్య=బంగారముయొక్క, దానాత్=ఇచ్చుటవలన, అని పురుషశ్రేష్ఠపరము. సుమ... ...వృద్ధిం, సుమన=మంచిమనస్సు కలవారలకు, అవతంస=అలంకారమైన, ప్రహ్లాద=ప్రహ్లాదుని యొక్క, వృద్ధిం=అభివృద్ధిని, జనయన్=కలిగించుచున్న, అని నృసింహదేవపరము, సుమనః=మంచి మనస్సు గలవారలకు అవతంస=అలంకారములగు జనులయొక్క (సజ్జనులయొక్క) ప్రహ్లాద=సంతోషముయొక్క; వృద్ధిం=అభివృద్ధిని, జనయన్=కలిగించుచున్న, అని పురుషశ్రేష్ఠపరము. లక్ష్మీసమేతః, లక్ష్మి=శ్రీదేవితో, సమేతః=కూడుకొనిన, అని నృసింహదేవపరము. లక్ష్మి=ఐశ్వర్యముతో, సమేతః=కూడికొనిన అని పురుషశ్రేష్ఠపరము. సర్వ... ...నంద్యః, సర్వజ్ఞ=శివుఁడు, వాగీశ=బ్రహ్మ, ముఖ=మున్నగు వారిచే, అభినంద్యః=కొనియాడఁదగిన అని నృసింహదేవ పరము, సర్వజ్ఞ=సమస్తము నెఱింగిన, వాగీశ=వాక్కులకు ప్రభువులగు, పండితులయొక్క, ముఖ=వదనములచేత, అభినంద్యః=కొనియాడఁదగిన అని పురుషశ్రేష్ఠ పరము, నృసింహః

=నరసింహదేవుఁడు అని ప్రకృతార్థము. పురుషశ్రేష్ఠుఁడు అని అన్యార్థము. సర్వలోకం=ఎల్లలోకములను. అవతు=రక్షించుఁ గాక (ఎల్ల జనులను రక్షించుగావుత.)

ఉ. ఆదిరమాసమన్వితుఁడు కనాథ్యుఁడు వాక్పతి సర్వవిన్నుతా
పాదితదివ్యభవ్యనుతిపాత్ర విచిత్రచరిత్రుఁ డుల్లస
న్మోదహిరణ్యదానమునఁ బొల్పెసఁగన్ సుమనోవతంసప్ర
హ్లాదసమృద్ధిఁ గూరుచు మహానరసింహుఁడు లోకమేలుతన్

తా. హిరణ్యకశిపుంజీల్చి సజ్జనశ్రేష్ఠుఁడగు ప్రహ్లాదునకు నభివృద్ధి కలిగించినట్టియు, బ్రహ్మేశ్వరాది సంస్తుత్యుండయినట్టియు, శ్రీదేవీసమేతుండయినట్టియు, నృసింహదేవుఁ డెల్ల లోకముల నేలుఁగావుతమని ప్రకృతార్థము. సువర్ణదానముచే సజ్జనులకానందముఁ గూర్చునట్టియు నైశ్వర్యవంతుఁడైనట్టియుఁ బండితులచేఁ గొనియాడఁ దగినపురుషశ్రేష్ఠుండు జనుల నేలుఁ గావుతమని యప్రకృతార్థము ఇటఁ బ్రకృతాప్రకృతశ్లేషాలంకారము. మతాంతరంబున ధ్వని.

శ్లో॥ హిరణ్యహరణా జ్జనో విబుధపుంగవైర్గర్హితో
భవేదితి విదన్నపి స్వయమహో నృసింహో భవాన్ ।
హిరణ్యహరణా దభూద్విబుధపుంగవైస్సంస్తుతః
పథిచ్యుత మహీశ్వరం నియమితుం జనా స్సంతి కే॥ 2

టీ. హిరణ్య హరణాత్, హిరణ్య=బంగారము యొక్క, హరణాత్=హరించుటవలన, జనః=జనుఁడు, విబుధపుంగవైః= పండితవర్యులచేత, గర్హితః=నిందింపఁబడిన వాఁడు, భవేత్= అగును, ఇతి = ఈ లాగున, విదన్ = తెలిసిన, నృసింహోపి= నృసింహుఁడవైనను, భవాన్ = నీవు, స్వయం = స్వయముగా,

హిరణ్యా హరణాత్ = హిరణ్యాహరణమువలన (హిరణ్యాకశిపుని చంపుటవలననని యు బంగారము హరించుటవలననని యు) విబుధ పుంగవైః = విబుధశ్రేష్ఠులచేత, సంస్తుతః = కొనియాడఁబడినవాఁడవు, అభూత్ = ఐతివి, అహో = ఆశ్చర్యము పథిచ్యుతమపి, పథి = మార్గమువలన, చ్యుతమపి = తప్పినవాఁడైనను, (అధర్మముగాఁ బ్రవర్తించు వాఁడైనను) ఈశ్వరం = ప్రభువును, నియమితుం = అరికట్టుటకొరకు, కే = ఏ, జనాః = జనులు, సంతి = కలరు.

చ. నరుఁడు హిరణ్యహారియయి
 నన్ విబుధేంద్ర విగర్హ్యుఁడౌనటం
 చరసిన యానృసింహుఁడ వె
 యయ్యును నీవు హిరణ్యహారివై
 పొరి విబుధాళి సన్నుతులు
 పొందితి వెట్లొనరించుఁగాక యీ
 శ్వరుమతివృత్తి నాపఁగల
 వారు గలారె! ధరామనోహరా! 3

తా. లోకమున జనుఁడు హిరణ్యము హరించిన, పండితనింద్యుఁడగునని యెఱింగిన నృసింహుఁడ వయ్యును, నీవు హిరణ్యహరణం బొనరించి పండితులచేఁ గొనియాడఁబడితివి. ఏలయన అధర్మముగా నడచుచుండినను ప్రభువును నియమించు జనులు లేరు. శ్లేషానుప్రాణితార్థాంతర న్యాసాలంకారము. (హిరణ్యకశిపుని సంహరించి దేవతలచేఁ గొనియాడఁబడితి వని వాస్తవార్థము).

శ్లో॥ ఆమోదిత విబుధాళిం మధుదానాదింది రేతమధిహృదయం।
 ప్రహ్లాద జనకదానాచ్చాద్భుతతర కే సరీశ్వరం వందే॥ 3

టీ మధుదానాత్, మధు = మధ్వసురునియొక్క, దానాత్ = ఖండించుటవలన అని నృసింహరూప విష్ణు పరము. మధు=మకరందముయొక్క, దానాత్ = దానమువలన. అని నాగకేసర వృక్షపరము. ప్రహ్లాద జనక = హిరణ్య కశిపుని యొక్క, దానాచ్చ = ఖండించుటవలనను అని నృసింహ పరము. ప్రహ్లాద = ఆనందమును, జనక = కలిగించు, దానాత్ = పుష్పదానమువలన, అని నాగకేసర, వృక్షపరము ఆమోదిత విబుధాళిం, ఆమోదిత = సంతోషపెట్టఁబడిన, విబుధాళిం=దేవతా సమూహముకల అని నృసింహదేవపరము. ఆమోదిత = సంతోషపెట్టఁబడిన, విబుధాళిం వి=పక్షులున్ను, బుధ=నేర్పుగల, అళిం=తుమ్మెదలు కల అని నాగకేసర, వృక్షపరము, ఇందిరేతం, ఇందిరా = లక్ష్మీదేవితో, ఇతం = కూడిన, అని నృసింహదేవపరము, ఇందిరా = కాంతితో, ఇతం = కూడిన (ఇచ్చట ఇందిరా శబ్దమునకు లక్షిత లక్షణచే కాంత్యర్థము, గ్రహించునది) అని నాగకేసర వృక్షపరము. అద్భుత తర కేసరీశ్వరం, అద్భుత తర = మిక్కిలి యాశ్చర్యకరమగు, కేసరీశ్వరం = సింహ ప్రభువును, అనఁగా నరసింహ దేవుని అని యర్థము, శ్రేష్ఠమైన నాగకేసర వృక్షమును అని యప్రకృతార్థము, అధిహృదయం = హృదయమందు వందే = నమస్కరించుచున్నాను. రెండవ యర్థమున స్తుతించుచున్నానని భావము.

తా. మధ్వసురుని సంహరించుటవలనను, హిరణ్యకశిపుని జెండుటవలనను, దేవతలకు సంతోషమును, గూర్చినట్టియు, శ్రీ దేవితో విరాజిల్లునట్టియు నరసింహదేవుని నా హృద

యమందు నిలిపి భజింతునని ప్రకృతార్థము. మకరందదానము వలనను ఆనందమునుకలిగించు ఫలములు నున్నగువాని నొసంగుటవలనను తృప్తి నొందింపఁ బడిన తుమ్మెదలు, పక్షులు గలిగినట్టియు, మిక్కిలి శోభతోఁ గూడినట్టియు నాగకేసర వృక్షమును స్తుతించుచున్నా నని యప్రకృతార్థము. ప్రకృతా ప్రకృత శ్లేష. పూర్వమువలెనే మతాంతరమున ధ్వని.

క. శ్రీమహిమోన్నతతనుని స
దామధుప్రహ్లాద జనకదానవిధా నా
త్మామోదిత విబుధాళిన్
ధామాద్భుత కేసరీశుఁ దగభజియింతున్.

శ్లో॥ ప్రహ్లాద మానసవిశేష మతిస్ఫురంత
మచ్ఛస్మితం దధత మీశ మశేషసేవ్యం ।
కోపా ద్వ్యపేత మఖిలేశవిధుస్వసాక్షీ
స్త్వా మాలిలింగ నృహరే మిషతాంసురాణాం ॥ 4

టీ. అఖిలేశ, అఖిల = సమస్త లోకములకు, ఈశ = ప్రభువైనవాఁడా! నృహరే = నరసింహదేవా! ప్రహ్లా... ...రంతం, ప్రహ్లాద = ప్రహ్లాదునియొక్క, మానసవిశేష = పూజావిశేషమందైన, మతి=బుద్ధిచేత, స్ఫురంతం=ప్రకాశించుచున్నట్టియు, లేక ప్రహ్లాద మానసవిశేషం, ప్రహ్లాద = ప్రహ్లాదునియొక్క, మానన = గౌరవించుటయందలి, విశేషం = అతిశయము కలిగిన, అతి స్ఫురంతం = మిక్కిలి ప్రకాశించుచున్న, లేక ప్రహ్లాదం = అధికమైన సంతోషము కలిగినట్టియు. (బ్రహ్మానందస్వరూపుఁడ వైన) ఆననవిశేషం, ఆనన=ముఖమందు, విశేషం = విశేషముగల. (సింహాకారముగల) అతిస్ఫురం=మిక్కిలి ప్రకా

శించుచున్న (స్ఫురతీతిస్ఫూః, తం స్ఫురం క్విప్ ప్రత్యయాంతము) తం = అట్టి, అచ్ఛస్మితం, అచ్ఛ = స్వచ్ఛమైన, స్మితం = చిరునవ్వును, దధతం=ధరించుచున్నట్టియు, ఈశం=ఈశ్వరుఁడవైనట్టియు, అశేషసేవ్యం, అశేష = సమస్త జనులచేత సేవ్యం= సేవించఁదగినట్టియు, లేక (అశ్చ శేషశ్చ అశేషౌ) అ=బ్రహ్మచేతను, శేష = ఆదిశేషునిచేతను, సేవ్యం = సేవించఁదగినట్టి, లేక శేష=సేవ్యుఁడు కానట్టియు, అనఁగా శేషిభావముచే సేవించఁదగినట్టియు, భగవద్భిన్నము శేషమనియు భగవంతుఁడు శేషియనియు విశిష్టాద్వైత సంప్రదాయముకావున శేషిభావముచే సేవింపఁదగినవాఁడవు గాని శేషభావముచే సేవింపఁదగినవాఁడవు కావు.) కోపాత్ = కోపమువలన, వ్యపేతం = మరలినట్టియు, (కోపశూన్యుఁడవగు) త్వాం = నిన్ను, సురాణాం = దేవతలు, మిషతాంసతాం = చూచుచుండఁగా, విధుస్వసా = చంద్రుని చెల్లెలగు, శ్రీః = లక్ష్మీదేవి, ఆలిలింగ = కౌఁగిలించెను.

గీ. నరహరీశ ప్రహ్లాదమానసనవిశేష
మతివిభాసుర మచ్ఛసుస్మితమశేష
సేవ్య మపగత కోపభాసితుసైన
నీదు తనువాను ధాకరుసోదరియగు
సిరి కవుఁగిలించెనుసురలు రాజిల్లుచుండ.

తా. భక్తుండగు ప్రహ్లాదుని పూజా విశేషముచే మిక్కిలి యలరుచున్నట్టియు నెల్లరచే సేవింపఁదగినట్టియు కోపమ్మువీడి శాంతమ్ము నొందిన నిన్ను ఆ శ్రీదేవి దేవతల్లెల్ల గనుచుండ కౌఁగిలించెను.

శ్లో॥ కాంచనకశిపుచ్ఛేదా త్కాంచనకశిపోమరాధికప్రీతిం।
ప్రహ్లాదాహ్లాదజనిం జనయన్నజ భాసి దివ్య నరసింహః॥

టీ. హే కాంచనకశిపో; కాంచన = బంగారు వికారమైన, కశిపో=వస్త్రము కలవాఁడా, (కనకాంబరధరుఁడా), అజ=పుట్టుక లేనివాఁడా, దివ్యనరసింహః దివ్య=శ్రేష్ఠమైన, నరసింహః=నరసింహరూపము దాల్చిన నీవు, కాంచన కశిపుచ్ఛేదాత్, కాంచనకశిపు=హిరణ్యకశిపునియొక్క ఛేదాత్=సంహారించుట వలన, అమర=దేవతలకు, అధిక = మిక్కిలి, ప్రీతిం = సంతోషమును, ప్రహ్లాదాహ్లాదజనిం, ప్రహ్లాద=ప్రహ్లాదునకు, ఆహ్లాద= ఆనందముయొక్క, జనిం=ఉత్పత్తిని, జనయన్=కలిగించు, చున్నవాఁడవగుచు, భాసి=ప్రకాశించుచున్నావు.

గీ. అల్ల ప్రహ్లాదునకు తుష్టివెల్లి విరియ
నెల్ల వేల్పుల కేపు సంధిల్లఁ బసిడి
యసురి యసురెల్ల వెసకసిమసఁగి యుల్ల
సిల్లుచుంటివి నీవు నృసింహదేవ !

గీ అరయఁ గాంచనకశిపుఁడవయ్యునీవు
చెలఁగి కాంచనకశిపునిజీల్చి వేల్పు
లకును ప్రహ్లాదునకునునాహ్లాదమెసఁగఁ
జేవ మెరయుచునుంటివినృసింహదేవ॥

తా. ఓ కనకాంబరధరా! నీవు హిరణ్యకశిపుని సంహారించి దేవతలకును ప్రహ్లాదునకును మిక్కిలి యానందంబు సంధించి యలరుచు నుంటివి.

శ్లో. దానవంతానవంనీత్వా ఖరైర్నఖర శేఖరైః
ఉరోవిదార మకరో న్నరకేసరిరా డ్భవాన్॥

టీ. నరకేసరిరాట్ = నరసింహరూపుఁడవగు, భవాన్ =నీవు దానవం =హిరణ్యకశిపుని, తానవం = కృశత్వమును, నీత్వా= పొందించిన, ఖరైః = వాడిగల, నఖరశేఖరైః = ప్రశస్త నఖరములచేత, (గోళ్లచేత)ఉరోవిదారం=ఉరః=వక్షస్థలముయొక్క, విదారం=చీల్చుటను. అకరోత్ = చేసితివి.

క. మిక్కిలి యుక్కారెడు నీ
యెక్కుడు కొనగోళ్లనుక్కుకనింకించియువే
రక్కసునురముం జీలిచి
చీక్కాడితికోపమేపెకసఁగ నరసింహా !

తా. నరసింహరూప విష్ణుదేవా! నీవు ఆకారముచేతనే హిరణ్యకశిపుని వెరపంగఁజేసి, వాడిగల కొనగోళ్లచే నురమ్ము జీల్చి చెండాడితివి.

శ్లో॥ శరణవరణదక్షం సర్వగీర్వాణతత్యా
నరహరి మహమీడే పూర్వగీర్వాణ పఘ్నం
నిఖిల భువన భవ్యం, భార్గవీ భాసమానం
దనుజతనుజ రక్షాదక్ష మక్షీణశాంతిం॥ 7

టీ. సర్వగీర్వాణతత్యాః సర్వ = సమస్తమైన, గీర్వాణతత్యాః = దేవతా సమూహమునకు, శరణవరణదక్షం, శరణ = రక్షకుఁడుగా, వరణ = కోరుకొనుటకొరకు, దక్షం = సమర్థుఁడైనట్టియు,పూర్వగీర్వాణ పఘ్నం;పూర్వగీర్వాణ=రాక్షసులను, ప = పాలించు హిరణ్యకశిపుని, ఘ్నం = సంహరించినట్టియు, నిఖిలభువన భవ్యం, నిఖిల = సమస్తమైన, భువన = లోకములకు, భవ్యం = శుభప్రదుఁడైనట్టియు, భార్గ వీభాసమానం, భార్గవీ=లక్ష్మీదేవిచేత భాసమానం = ప్రకాశించుచున్నట్టియు

దనుజతనుజ రక్షాదక్షం. దనుజ = హిరణ్యకశిపునియొక్క తనుజ = కుమారుఁడగు ప్రహ్లాదునియొక్క, రక్షా = రక్షించు యందు దక్షం=సమర్థుఁ డగునట్టియు, అక్షీణశాంతిం, అక్షీణ= అధికమైన, శాంతిం = శాంతిగల, నరహరిం = నరసింహదేవుని అహం = నేను, ఈడే = స్తుతించుచున్నాను.

ఉ రూక్షణవీక్షణక్షపితక్రూర విచేష్టిత దుష్ట రాక్షసా
ధ్యక్షు సమస్తలోక తతికతక్షణరక్షణ దక్షు తద్ధర
ణ్యాక్షతనూజభద్రఘటకనక్షము సర్వవిచక్షణున్ నృహ
ర్యక్షురమాసదా స్ఫురదుకరస్థలు నిస్తులుఁ బ్రస్తుతించెదన్.

తా. ఎల్లదేవతల రక్షింపనోపునట్టియు, రాక్షసరాజగు హిరణ్యకశిపు సంహరించినట్టియు. సమస్తలోకములకు శుభం బుఁగూర్చునట్టియు, శ్రీమహాలక్ష్మితో నెల్లప్పుడు విరాజిల్లునట్టి యు, ప్రహ్లాదున కాపదలెల్ల దొలంగించి కాపాడినట్టియు నర సింహదేవుని గొనియాడుచుంటిని.

శ్లో॥ గిరీశ్వర శిరోంచితోహిత గజాధికారిష్టకృత్
విభూతివిశదో వ నేకృశమతి స్సటాభానురః ।
ముదా సదయయా హృదా దిశతు మేసదా సంపదం
ద్విజాధిపవిరాజితో ఝుడితి దివ్య పంచాననః ॥

టీ. గిరీ ... చితః, గిరి=కైలాసపర్వతమునకు, ఈశ్వర=ప్రభు వగు శివునిచేత, శిరః=శిరస్సుచేత, అంచితః=పూజింపఁబడు అని నరసింహ దేవపరము, గిరీశ్వర = పర్వతరాజమగు కైలాసము యొక్క, శిరః=శిఖరమందు, అంచితః = ఒప్పునట్టియుని శివపర ము, గిరీశ్వర = గొప్ప పర్వతములయొక్క శిరః=శిఖరముల యందు, అంచితః=సంచరించు అని సింహపరము,హిత ... కృత్,

హిత=ఇష్టమైన, గజ = గజమునకు (గజేంద్రమునకు) అధిక = మిక్కిలి, అరిష్ట=శుభమును, కృత్ =చేయునట్టి, అని నరసింహ రూప విష్ణు పరము, అహిత = శత్రువగు, గజ = గజాసురునకు, అధిక=మిక్కిలి, అరిష్ట=కీడును, కృత్ చేసినట్టి యని శివ పరము. అహిత=శత్రువులగు, గజ = ఏనుఁగులకు, అధిక = మిక్కిలి, అరిష్ట=కీడను,కృత్ =చేయునట్టి యని సింహ పరము. విభూతి= విశిష్టమైన జన్మచేత, (స్తంభమం దావిర్భవించుటచేత) విశదః= స్ఫుటమైన, (సర్వ దర్శన గోచరుఁడైన) యని నరసింహ దేవ పరము, విభూతి = భస్మమువలె, విశదః = స్వచ్ఛమైన, యని సింహపరము, విభూతి=భస్మముచేత, విశదః=తెల్లనగు అని శివ పరము, అవనే=రక్షించుటయందు, కృతమతిః, కృత = చేయఁ బడిన, మతిః=బుద్ధికలయని నరసింహదేవ, శివ, ఉభయపరము. వనే=అరణ్యమందు, కృత=చేయఁబడిన, మతిః=బుద్ధికల (అరణ్యమందు నివసించునది) అని సింహాపరము, సటాభాసురః, సటా= జూలుచేత, భాసురః=రమ్యమైనయని నరసింహదేవ, సింహ, ఉభయపరము, సటా=జటలచేత, భాసురః = ప్రకాశించు అని శివపరము. ద్విజా ... జితః ద్విజాధిప=గరుత్మంతునిచేత, విరాజితః=ప్రకాశింపఁజేయఁబడిన యని నరసింహరూప విష్ణుపరము, ద్విజాధిప = చంద్రునిచేత విరాజితః = ప్రకాశింపఁజేయఁబడిన, అని శివ పరము. ద్విజాధిప=శ్రేష్ఠమగు దంతములచేత, (కోరల చేత) విరాజితః=ప్రకాశింపఁ జేయఁబడిన, అని సింహపరము. ని॥ దంతవిప్రాండజాద్విజాః, ద్విజరాజశ్శశధరః, అనియు నమరము. దివ్య పంచాననః=నరసింహరూపవిష్ణువు అని ప్రస్తుతము. శివుఁడు, శ్రేష్ఠమైన సింహము అని యన్యార్థములు. ఘుడితి=

శీఘ్రముగా, సదయయా=దయతోఁగూడిన, ముదా=సంతోష
ముతో, ఉపలక్షితేన = కూడిన (అధ్యాహారము) హృదా =
మనస్సుతోఁ గూడిన వాఁడగుచు, సదా=ఎల్లప్పుడు, సంపదం=
సర్వ సంపదలను, దిశతు = ఇచ్చుఁగాక.

గీ. నుతగిరీశ శిరోంచితాహితగజాధి
పాధికారిష్టదము విభూతిత్యాతివిశదము
ప్రసుమనోవన మతిసటాభాసురంబు
తద్ద్విజాధి పవిత్రభాజితంబునగుచు.

గీ. తెలుపలేనంత మహిమతోఁ దేజరిల్లు
దివ్యపంచాస్య రూపంబు తెలువాఱు
నెనరు ముదమును హృదిలోనఁ బెనఁగొనంగ
సిరులు దలకొల్పి మమ్మురక్షించుఁగాత.

తా. శివునిచేఁబూజింపఁ బడునట్టియు, గజేంద్రుం గాపా
డినట్టియు, స్తంభంబునందావిర్భవించి హిరణ్యకశిపుని జెండా
డి ప్రహ్లాదునిఁ బ్రోచినట్టియు నెల్లర మనుప బద్ధకంకణుం డై
నట్టియు, నరసింహుండు ముదమ్ము వొదల దయార్ద్ర దృష్టిం
జూచి మ మ్మేలుఁగావుతమని ప్రస్తుతార్థము. కైలాస శిఖరం
బు నలంకరించునట్టియు, విరోధియగు గజాసురుం బరిమార్చి
నట్టియు, భస్మచేఁ దెల్లనగు మేనూనునట్టియు నెల్లరమనుపదీ
క్షితుండయి నట్టియు, జటలచే విరాజిల్లునట్టియు పరమేశ్వరుం
డు పేర్మితో మమ్ముం గాచుఁ గావుతమనియు, గొప్పపర్వతముల
శిఖరమ్ములపై నలరారునట్టియు, విరోధులగు నేనుంగులకు కీడుం
గూర్చునట్టియు, భస్మమువలె తెల్లని శరీరముతో నెసలారు
నట్టియు, వనమందు సంచరించు నట్టియు, జూలుచేత విరాజిల్లు

నట్టియు ప్రశస్తంబగు సింహంబు మాకైశ్వర్యంబు నొసగించుఁ
గావుతమనియు న ప్రకృతార్థములు. పూర్వమువలెనే ప్రకృతా
ప్రకృత శ్లేషము. మతాంతరంబున ధ్వని.

శ్లో. అంహస్సంహతి మాశుప్రహ్వ జనాభీలదాం నిరాకర్త్రీ
సింహాకృతిర్నృపూర్వాగహ్వరదహరే మమస్ఫురతాత్ .9

టీ. ప్రహ్వజనాభీలదాం, ప్రహ్వ = నమ్రులగు, జన=జనుల
కు (సజ్జనులకు) ఆభీలదాం=భయంకరమైనట్టి అంహస్సంహతిం,
అంహః = పాపములయొక్క, సంహతిం=సమూహమును, ఆశు=
శీఘ్రముగా, నిరాకర్త్రీ = నశింపఁజేయునట్టి, నృపూర్వా,
నృ=నృ అను పదము, పూర్వా = మొదటకల, సింహాకృతిః =
సింహ రూపము (నృసింహరూపము) మమ=నాయొక్క, గహ్వ
రదహరే, గహ్వర = గుహవంటి, దహరే = హృదయమందు.
(గహ్వరదహరయను పదమునందు బింబోష్ఠయను పదమునందు
వలె ఉపమాన పూర్వపద కర్మధారయము) లేక, గహ్వర =
అల్పమైన దహరే = హృదయాకాశమందు స్ఫురతాత్ =ప్రకా
శించుఁగాక.

గీ. ప్రణతులై భక్తిఁ గొల్చువారలకు ఘోర
పాపముల నెల్లఁ దున్మాడి ప్రాపొసంగి
ప్రబలు నరసింహరూపనాకరతము నాదు
హృదయ గహ్వరమునఁ దేజరిల్లుఁగాత.

తా. భక్తజనుల పాపంబులనెల్ల మొదలంటం దునిమి
మనుచు నరసింహమూర్తి నాహృదయ గహ్వరంబు నెలవు
పట్టుగా నొనర్చు గావుత.

తి బ్రహ్మప్రభృతి విబుధామంజులతర
మయ్యావాచాతవ నుతిమతన్వన్నరహరే
త్రైస్తేషాం నముదమధిగచ్ఛన్నపిభవాన్
ం ప్రహ్లాదం వచనమశృణోద్వాత్సలతయా.

హరే = ఓ నరసింహదేవా, పురా ... బుధాః,
ము, బ్రహ్మ=నలువ, ప్రభృతి = మున్నగు, విబు
మంజు ... మయ్యా, మంజులతర=మిక్కిలి మనో
గామయ్యా=వేదత్రయ వికారమైన, వాచా =
=సిరియొక్క, నుతిం=స్తోత్రమును, అతన్వన్ =
ర్చిరి, బత = ఏమి (సంతోషద్యోతకము లేక
కము, తేషాం = వారలయొక్క. స్తోత్రైః =
దం=సంతోషమును (శాంతమును) నాధిగచ్ఛ
ండవైనను, భవాన్=నీవు ప్రముగ్ధం=ప్రౌఢ
దం=ప్రహ్లాదుని సంబంధమైన, వచనం=స్తుతి
లతయా=ప్రేమచేత, అశృణోత్=ఆలకించితివి.
తివి.)

ఇతో హిరణ్యకశిపుం
ోధమున్నసంజేర్చి బల్
ో వెలింగెడునినున్
క్షింపఁగానోడి ఁసూ

మారధ్వంసి విరించి ముఖ్యులు నుతిం
పన్ శాంతతం జెందకా
ప్రారంభం బుపసంహరించితిహరీ
ప్రహ్లాదు ముగ్ధోక్తులన్।

తా. హిరణ్యకశిపుం బరిమార్చి క్రోధావతారమున్నను
నొప్పుచున్న నిన్ను శాంతుని జేయు నా బ్రహ్మేశ్వరాదులు
వేదవాక్కులతో నుతించినను నా వాక్కులకుఁ బ్రసన్నుండ
వు కాక భక్తుండగు ప్రహ్లాదునిముగ్ధ వాక్కులచే శాంతముఁ
జెందితివి.

ఇతి నృసింహావతారః,

నృసింహావతార నుతి సమాప్తము.

——

# దశావతారస్తుతిశతకే వామనావతారః.

---

శ్లో. త్రివిక్రమపదక్రమ ప్రమితలోక లోకేశ్వర
ప్రభృత్యమరరాట్ఛిరో మకుట పూజితాంఘ్ర్యంబుజ।
వదాన్య దనుజేశ్వరార్పిత భవిష్య దింద్రత్వమాం
సుధాసదృశయా దృశేశ్వర విలోకయానారతం॥

టీ. పద . లోక, పద = అడుగులయొక్క, క్రమ = ఉం చుటచేత, ప్రమిత = మిక్కిలి కొలువఁబడిన, లోక = మూఁల్లో కములు కలవాఁడా, లోకే.. బుజ, లోకేశ్వర = ఇంద్రుఁడు, ప్రభృతి = మున్నగు, అమరరాట్ = దేవప్రభువులయొక్క, శిరః = తలలయందలి, మకుట = కిరీటములచేత, పూజిత= సే వింపఁ బడిన, అంఘ్ర్యంబుజ = పాదపద్మములు కలవాఁడా, వ దాన్య... ద్రత్వ, వదాన్య = దాతయగు, దనుజేశ్వర = రా క్షస పతికొఱకు, అర్పిత = ఈయఁబడిన, భవిష్యత్ = రాఁబో వు, (అనాగతమగు) ఇంద్రత్వ = స్వర్గాధిపత్యము కలవాఁడా, ఈశ్వర = సర్వనాయకా, త్రివిక్రమ = వామనుఁడా! (విష్ణుదే వా) మాం = నన్ను, సుధాసదృశయా = అమృతముతో స మానమైన, దృశా= నేత్రముతో అనారతం = ఎల్లప్పుడు, వి లోకయ = చూడుమా.

శా. శక్రాది త్రిదశేంద్ర మూర్ధమకుటా
ర్చాభా సురాంఘ్ర్యంబు జా

శుక్రచ్ఛాత్రవదాన్యతానుపమర
క్ష్మోనాథహస్తార్పితా
వక్రశ్రీప్రవిభాస్య నాగతమహా
స్వర్గాధిపత్యాత్రి పా
దాక్రాంతాఖిలలోక మమ్మమృతతు
ల్యాక్షిద్వయిం జూడుమీ.

తా. మూడడుగులచే నాక్రమింపఁబడిన ముల్లోకము
లు గలవాఁడా, ఎల్లదిక్పాలుర కిరీటములచే నలంకరింపఁబడిన
పాదపద్మములుగలవాఁడా బలిచక్రవర్తి కొసంగంబడిన
భవిష్యదింద్రత్వము కలవాఁడా, ఓ త్రివిక్రమదేవా, మమ్మ
మృతమ్మునకెత్తువచ్చు చల్లని చూడ్కులం జోచి, బ్రోవుము.

శ్లో. యద్వస్తు యద్గుణయుతేనకృతానుబంధం
తత్తత్స్వభావమయతీ త్యనురూపమేతత్ ।
యద్వామనాశ్రయజన స్సకలోన్నతో భూ
దేత త్తనోతి హృది విస్మయమస్మదీయే ॥ 2

టీ. యత్ =ఏ, వస్తు = వస్తువు, యద్గుణయుతేన, యత్ =
ఏ, గుణ = ధర్మముతో, యుతేన = కూడినదానితో, కృతా
నుబంధం, కృత = చేయఁబడిన, అనుబంధం = సంబంధము క
లదో, తత్ = ఆవస్తువు, తత్స్వభావం, తత్ = దానియొక్క
స్వభావం = ధర్మమును, అయతి = పొందుచున్నది, ఇట, కిట
కటీ, గతౌ, అనుచోట కటి, ఇ, అని ప్రశ్లిష్టంబైన ఇ ధాతువు
వలన, అయతియని నిష్పన్నంబయ్యెను. ఇత్యేతత్ =ఈలాగనునిది
అనురూపం=తగినది. వామనాశ్రయజనః, వామన = పొట్టివాని
యొక్క, ఆశ్రయ = ఆశ్రయముకల, లేక వామన = పొట్టివా

నిని, ఆశ్రయ = ఆశ్రయించిన, జనః = జనుఁడు, సకలో
న్నతః, సకల = సమస్తమైన వాటికంటెను, ఉన్నతః = ఉన్నతుఁ
డై (ఎత్తైనవాఁడు) అభూదితియత్ = అయెననుట యేదికల
దో, ఏతత్ = ఇది, అస్మదీయే = మాసంబంధమైన, హృది=
డెందమందు, విస్మయం = ఆశ్చర్యమును, తనోతి = విస్తరింపఁ
జేయుచున్నది.

చ. ఎనయునో యేపదార్థమిల
నెట్టి గుణమ్ముగ లట్టిదానితో
నొనరఁగఁ దద్గుణంబు నది
యొందుట డెందును యుక్తమాచు వా
సినిగను, వామనాశ్రయుఁడ
శేషస మున్నతుఁడౌట డెందగుం
దన నిది గాఢ విస్మయము
నున్నెలకొల్పెఁ ద్రివిక్రమేశ్వరా!

తా. ఓ త్రివిక్రమ దేవా, లోకములో నేవస్తువెట్టి ధర్మ
ముగలదానితో సంబంధము నొందునో యావస్తు వట్టిధర్మము
నొందుట యుక్తము. కావున వామను నాశ్రయించినవాఁడు
వామనత్వమునొందుటయుక్తము. దీనికి విరుద్ధముగా నున్నత
త్వమునొందుట యాశ్చర్యము. కపట వామనరూపముదాల్చిన
నిన్నాశ్రయించినజనుఁ డందరికంటె గొప్పస్థితిం బడయునని
తాత్పర్యము.

శ్లో. ప్రత్నాస్తే కవయస్స్వభావమధురాసారాస్స్తుతీశ్చక్రిరే
సోహం మందమతిస్తథాపి మితధీస్తోతుంప్రవృత్తోధునా ॥

శ్రీవర్ణీశ భవత్ప్రసాదవశతో వాచాంఝరీజృంభతాం
యాశ్లాఘ్యా విబుధై స్సువర్ణ మహితాశబ్దగ్రహానందదా॥

టీ. శ్రీవర్ణీశ, శ్రీ = శోభాయుక్తుఁడవగు, వర్ణీశ = వామనదేవా, ప్రత్నాగి = పురాతనులగు, తే = ఆప్రసిద్ధులైన, కవయః = వాల్మీకిమున్నగు మహాకవులు, స్వభావమధురాసారాః స్వభావ = సహజముగా మధుర = మధురవస్తువులయొక్క— ఆసారాః = జడివానలగు, (అతిమనోహరములగు) స్తుతీః = స్తోత్రములను, చక్రిరే = చేసిరి. సః = అట్టి (వారివలె స్తుతి చేయ నిచ్ఛగల) అహం = నేనైతే, మందమతిః = చురుకుతనములేని బుద్ధికలవాఁడనున్ను, మితధీః, మిత = స్వల్పమును గ్రహించు, ధీః = బుద్ధికలవాఁడనున్ను. తథాపి = అయినను, అధునా = ఇప్పుడు, స్తోతుం = స్తుతిసేయుటకొరకు, ప్రవృత్తః = ప్రారంభించితిని. భవత్ప్రసాదవశతః, భవత్ = నీయొక్క— ప్రసాదవశతః = అనుగ్రహవశమున, వాచాం = వాక్కులయొక్క, ఝరీ = ప్రవాహము, జృంభతాం = అధికముగా నుద్భవించుఁగాత. యా = ఏవాగ్ఝరి, విబుధైః = విద్వాంసులచేత, శ్లాఘ్యా = కొనియాడఁదగినదో, సువర్ణమహితా, సు=చక్కని, వర్ణ = అక్షరములతో, మహితా = ఒప్పుచున్నదో, శబ్దగ్రహానందదా, శబ్దగ్రహ = వీనులకు, ఆనందదా = సంతోషము కలిగించునదో, అట్టి వాగ్ఝరియని పూర్వముతో నన్వయము.

మ. ప్రవచస్కుల్ నుతియింపఁ బ్రోడలుగదా
ప్రాచీనులాతక్కవి

ప్రవరుల్, నేననమందబుద్ధినినుతిం
పం బూనితిన్ గావునన్
శ్రవణానంద పదార్థబంధము బుధ
శ్లాఘ్యమ్మదిస్యమ్మునౌ
కవితాధారభవత్కటాక్షమునవీఁ
కన్నాకుఁజేకూరుతన్.

తా. ఓ త్రివిక్రమదేవా! తొల్లింటి మహాకవులెల్లరు మాధుర్యరసము జాలుకొలుపు సహజవాక్కులుగల మహామతులు గావున నిన్ను చక్కఁగ నుతింపనోపిరి. నేనన స్వల్పమతిని. అయినను భక్తివశమ్మున నిన్నుం గొనియాడఁ బూనుకొంటిని. గావున నీవు వాత్సల్యమునఁ బండితులెల్లరచేఁ గొనియాడందగు నిరుపమాన వాక్ప్రవాహము నలవడఁ జేసి నాపూనిక కొనసాగింపుమని ప్రార్థనము.

శ్లో. త్రిపాద్విభూతి ప్రభురప్యనంత
స్త్రిపన్మితాం భూమి మహో సురాత్ ।
ప్రాప్తుం ద్విసప్తాంచితలోక ప్యోపి
హ్రస్వా కృతిం దేవ బిభర్షి వర్ణిన్॥ 4.

టీ. హేవర్ణిన్ = బ్రహ్మచారి రూపమును దాల్చినవాఁడా, దేవ=ప్రభువా, (వామనరూప విష్ణుదేవా) అనంతః=నాశనరహితుఁడవగు, త్వం=నీవు, త్రిపాద్విభూతి ప్రభురపి, త్రిపాద్విభూతి=వైకుంఠమునకు (త్రిపాద్విభూతియన వైకుంఠంబని విశిష్టాద్వైతసాంప్రదాయము) ప్రభురపి=పతివైనను, ద్విస ... ప్యోపి, ద్విసప్త=పదునాల్గు అగు అంచిత=ఒప్పుచున్న, లోక = జగములకు,

పోపి=రక్షకుఁడవైనను, సురారేః = రాక్షసునివలన, త్రిపన్మి
తాం, త్రి=మూఁడు, పత్ = అడుగులచేత, మితాం = కొలు
వఁబడిన(మూఁడడుగులంత) భూమిం=పుడమిని, ప్రాప్తుం=పొందు
టకొరకు, హ్రస్వాకృతిం, హ్రస్వ=పొట్టియగు, ఆకృతిం=ఆకార
మును, బిభర్షి=తాల్చుచున్నావు, అహో=ఆశ్చర్యము.

మ. పదునాల్గౌ భువనంబులేలు పతివై
భవ్యంపు వైకుంఠపున్
బదవిన్ భక్తుల కిచ్చు నేలికవునై
నన్ దైత్యు యాచించియుం
బదముల్ మూఁడిడు నంత భూమిఁ బడయన్
భావించి హ్రస్వంపురూ
పుడమిన్ దాల్చితి వీవు నచ్చెరువొరుల్
వొందంగ వర్ణీశ్వరా.

తా॥ ఓ వామనరూప విష్ణుదేవా! పదునాల్గు లోకము
లకు రక్షకుఁడవగు వైకుంఠాధిపుఁడవైనను నీవొక్క రక్కసుని
వలన మూఁడడుగులపుడమింబడయుటకు పొట్టిరూపమున్న=(తక్కు
వ వాని యాకారమువంటి యాకారము) నొందుట యాశ్చర్య
ము. కపటమున మూఁడడుగులపుడమి దానముఁగోరి ముల్లోక
మునాక్రమించి బలిచక్రవర్తిం బాతాళమునకుఁ ద్రొక్కుటకొ
రకుఁగపట వామన రూపముఁ దాల్చితి వని భావము.

శ్లో. కుదానతో దానవలోక నాథ
స్స్వాధస్థితిం ప్రాపయతో౽నురూపం।

కుదానమాదాయచ వా మనోపి
లోకత్రయే వర్ధత చిత్రమేతత్. 5.

టీ. హేత్రివిక్రమ = ఓ వామనదేవా,(అధ్యాహారము) దానవలోకనాథః, దానవలోక = రాక్షసజనులకు, లేక రాక్షసలోకమునకు, నాథః = ప్రభువగు బలిచక్రవర్తి కుదానతః, కు = కుత్సితమైన, దానతః=దానమువలన, (కు=భూమియొక్క, దానతః = దానమువలన) రెండర్థములకు నభేదము. స్వాధస్థితిం, స్వ=తనయొక్క, అధస్థితిం = అధోగతిని (అధః = పాతాళలోకమున, స్థితిం=నివాసమును) యతః=ఏకారణమువలన,(ప్రాప=పొందెనో, తత్ = అది, అనురూపం = తగినది, కుదానం=కుత్సితదానమును, (భూదానమును) పూర్వమువలె నభేదము, ఆదాయ=గ్రహించి, వామనోపి = పొట్టివాఁడవైనను, భవాన్ = నీవు, లోకత్రయే = ముల్లోకమందు, అవర్ధత = అభివృద్ధి నొందితివి, (పెరిగితివి.) ఏతత్ = ఇది, చిత్రం=ఆశ్చర్యము.

మ. కుతుకంబొంది కుదాతయౌటఁ దన ర
క్షోలోక నాథుండ ధ
స్థితి తాఁ గాంచియడంగియుండుటతగున్
దేవా యిఁకేమన్న నీ
వతులాసక్తి కుదానముం గొనియు భ
వ్యంబుల్ చెలంగన్ మహో
న్నతతం గాంచితి వామనుండవయినన్
ధాత్రిన్ విచిత్రం బిదే!

తా. ఓదేవా ! కుదానమొసఁగిన బలిచక్రవర్తి యధో గతి పొలగుట యుక్తము. కుదానము పరిగ్రహించిన నీవు ముల్లోకములో నభివృద్ధి గాంచితి వనునది మాత్రము మిక్కిలి యాశ్చర్యము! వామనరూపమున బలిచక్రవర్తి వలన మూడడుగుల భూదానము గైకొని త్రివిక్రమస్వరూపముతో ముల్లోకముల నాక్రమించిబలిచక్రవర్తిం బాతాళమునకుఁ ద్రొక్కివేసితివని తాత్పర్యము. విషమాలంకారము.

శ్లో. నివాసం తే వర్ణిన్ వద దనుజ నైకత్రవసతిః
కిమాకాంక్షా తే స్తి త్రిపదమిత భూమిం మమదిశ।
భవేచ్చైవం లోకత్రియ మివముదం యామ్యసుర రా
ట్ధృవం దాస్యామీదం భువనమిహ తేస్వీకురుముదా.

అవ — ఈ పై శ్లోకమ్మున బలి వామనుల ప్రశ్నోత్తరములు వర్ణింపం బడినవి.

టీ. హేవర్ణిన్=ఓవడుగా, తే=నీయొక్క, నివాసం=నివాసస్థలమును, వద = వచియింపుము, హేదనుజ = ఓదానవా, మే = నాకు, ఏకత్ర = ఒక్కయెడ, వసతిః = నివాసము, న = లేదు, తే = నీకు, కిమాకాంక్షా = ఎట్టికోరిక, అస్తి = కలదు? లేక, కిం = దేనినిగూర్చి, ఆకాంక్షా = కోరిక, అస్తి = కలదు అనిగాని, మమ = నాకు, త్రిపదమిత భూమిం. త్రి = మూడు, పద = అడుగులచేత, మిత = కొలువఁబడిన, భూమిం = పుడమిని, దిశ = ఇమ్ము. ఏవం = ఈవిధముగా, భవేచ్చ = అవుగాక, అసురరాట్ = ఓరాక్షసరాజా, లోకత్రయమివ = ముల్లోకమునువలె, ముదం = సంతోషమును, యామి =

పొందుచున్నాను. ధ్రువం = నిశ్చయముగా, ఇదం = ఈ, భువనం, లోకమెల్ల, ఇహ = ఇప్పుడు, తే = నీకు, దాస్యామి = ఈయఁగలను, ముదా = ఆనందముతో, స్వీకురు = కైకొనుము, లేక, ఇదం = ఈ, భువనం = ఉదకమును, స్వీకురు, స్వీకరింపుమా.

మ. అవని న్నీస్థలమేడ వర్ణి! దనుజే
శా! లేదు తా వొక్కెడన్
భువి నీకోరిక యేది? నాకొసఁగుమా
భూమిం ద్రిపత్సమ్మితన్
అవుఁగాకట్లయినన్ జగత్త్రయముగా
న్నట్లుందునట్లేల యీ
భువనంబుం గొనుమయ్య నేనొసఁగెదన్
మోదంబు సంధిల్లఁగన్.

తా. బలిచక్రవర్తి తన యజ్ఞశాలలోని కరుదెంచిన వామనుని తొలుదొల్త నో బ్రహ్మచారీ! నీ నివాసస్థలం బెక్కడ నని ప్రశ్నించెను. పిదప వామనరూపధారి యగు విష్ణుదేవుఁడు "ఓ దానవా! నాకొక్కయెడ నివాసంబులేదని సమాధానముఁ బలికెను. పిమ్మట బలి, యేకోరికచే నిచ్చ్యోడ కరుదెంచితి వని ప్రశ్నించె. దానికి వామన దేవుఁడు మూఁడడుగుల భూమి నొసంగు మని కోరెను. తరువాత బలిచక్రవర్తి యట్లే యొసంగెద దీన నేమగు ననియె. పదఁపడి వామనుండీ మూడడుగుల పుడమిచే జగత్త్రయము నొందిన ట్లుపొంగెద ననియె. తరువాత బలిచక్రవర్తి అట్లేల నీకిప్పుడీ లోకంబెల్ల

నిశ్చయంబుగా నోసంగు చుంటి ముదమునం గై కొనుమని ప్రార్థించెను.

శ్లో. బలివసుహరణేద్ధం సత్యలోక ప్రచారం
బుధనుత మఖిలారిక్షేపణేతి ప్రగల్భం ।
ధృతశతమఖ కార్యం రాజచూడో పసేవ్యం
కపటవటుమవేమో భూమినాథం శ్రియాఢ్యం. 7

టీ. హేత్రివిక్రమ=ఓ వామనరూప విష్ణుదేవా! బలివసుహరణేద్ధం, బలి=బలిచక్రవర్తియొక్క. వసు=ఐశ్వర్యముయొక్క (ఉచ్చస్థితి) హరణ = హరించుటచేత, ఇద్ధం = ప్రకాశించు చున్నట్టి, లేక, బలిచక్రవర్తియొక్క హరణము విషయమై విరాజిల్లినట్టియని ప్రస్తుతార్థము, బలి=కప్పముయొక్క, (పన్ను యొక్క,) వసు=ధనమును, హరణ=కైకొనుటచే, ఇద్ధం=ప్రకాశించినట్టియుని యప్రకృతార్థము. సత్యలోకప్రచారం. సత్య లోక=వైకుంఠమున్నగు నిక్కపు జగములయందు, ప్రచారం=సంచారముగల, యని వామనదేవపరము, సత్య=సత్యమైన (ధర్మయుక్తమైన) లోక=జనులయొక్క, ప్రచారం=నడతగల, (సత్యః, లోకప్రచారః, యస్యాసః, సత్యలోకప్రచారః, లేక, సత్యే, లోకప్రచారః, యస్మాత్సః సత్యలోకప్రచారః, అనిగాని సమాసము, లేక, సత్యేలోకాన్, ప్రచారయతీతి, సత్యలోక ప్రచారః, తం=సత్యమందుజనులను ప్రవర్తింపఁజేయువాఁడు.), అనిగాని, భూమి పతిపరము-బుధనుతం, బుధ=దేవతలచేత, నుతం=కొనియాడఁబడు, అని ప్రకృతము, బుధ=పండితులచేత, నుతం=కొనియాడఁబడు అని యప్రకృతము, అఖిలారిక్షేపణే, అఖిల=ఖిలముగాని మొరయుచున్న) అరి=చక్రముయొక్క,

క్షేపణే=ప్రయోగించుటయందు, అతి ప్రగల్భం=మిక్కిలి ప్రౌఢ యగు అని ప్రకృతము, అఖిల=సమస్త, అరి=శత్రువులయొక్క, క్షేపణే=చిమ్మివేయుటయందు, (నశింపఁజేయుటయందు) అతి ప్రగల్భం=మిక్కిలిప్రౌఢయగు అని యప్రకృతము (ఈయర్థము ప్రకృతమునకును సరిపడును) ధృతశత మఖ కార్యం,ధృత = పూనఁబడిన,శతమఖ=ఇంద్రునియొక్క, కార్యం = పనులుకల, అని వామన దేవపరము, ధృత = ధరింపఁబడిన, శతమఖ = నూరు యజ్ఞములను, కార్యం = పనులు గల, అని, భూపతి పరము, రాజచూడోపసేవ్యం, రాజచూడ = చంద్రశేఖరుని చేత (శివునిచేత) ఉపసేవ్యం = భజింపఁదగినయని, వామనదేవ పరము, రాజ = సామంతరాజులయొక్క, చూడా = శిరస్సు లచేత, ఉపసేవ్యం = సేవింపఁదగినయని, భూపతిపరము, శ్రియా = లక్ష్మీదేవితో, ఆఢ్యం = కూడికొనిన, యని వామన రూప విష్ణుదేవపరము. శ్రియా=సంపదతో ఆఢ్యం=కూడికొనిన, యని భూపతిపరము కపటవటుం, కపట = బ్రహ్మచారి రూప ధారి వగు నిన్ను భూమినాథం = భూదేవికి భర్తగా నని ప్రకృతము. మహారాజుగానని యప్రకృతము, అవేమః = తెలిసికొనుచున్నాము.

చ. స్తుతులనెసంగుటన్ బలివశీనుప్రసభాహృతిఁ దేజరిల్లుటన్
శతమఖకార్యధూర్వహాత ! సంతతసత్యజగత్ప్రచారతన్
ప్రతినుతరాజ మౌళిసము ! పాస్యతచే నఖిలారినోదితన్
గృతకవటూ! నినున్ దలఁతు శ్రీఁదనరారు వసుంధరేశుఁగా.

తా. ఓ వామనరూప విష్ణుదేవా! బలిచక్రవర్తియొక్క వైభవ మడంచినట్టియు, వైకుంఠాది సత్యలోకముల మెలంగు

నట్టియు దేవతలచేఁ గొనియాడఁబడునట్టియు, నెల్లవైరుల ని ర్మూలించునట్టియు, లేక మిక్కిలి మెరయుచక్రము ప్రయోగించుటయందు మిక్కిలి ప్రౌఢయగునట్టియు దేవేంద్రుని కార్యములనెల్ల నెరవేర్చునట్టియు శివునిచేఁ బూజింపఁబడునట్టియు, లక్ష్మిచే విరాజిల్లు నట్టియు నిన్ను భూదేవికిం బతినిగా దలంచుచుంటినని ప్రకృతార్థము. ఓదేవా ఎల్లరచేఁ గప్పంబుగొను నట్టియు, ప్రజలనెల్లసత్యమార్గమ్మున మెలంగఁ జేయునట్టియు, బండితులచేఁ గొనియాడఁ బడునట్టియు, నెల్లవైరుల నిర్మూలించునట్టియు, నూరుజన్నంబులో నర్వ దీక్షంబూనినట్టియు, సామంతరాజ శిరమ్ములచే సేవింపఁబడునట్టియు, నఖండైశ్వర్యమ్ముతో విరాజిల్లునట్టియు, నిన్ను నఖండ భూమండలాధిపతి యగు చక్రవర్తిఁగాఁ దలంచుచుంటిని అని యప్రకృతార్థము అలంకారము ప్రకృతా ప్రకృతశ్లేషము మతాంతరబున ధ్వని.

శ్లో. పుణ్యజననాథమనఘంయజమానేజ్యం వదాన్యమపిభక్తం
అవమానయన్నహల్యాజారప్రీతింకరోష్యహో వర్ణిన్॥ 8

టీ. హేవర్ణిన్ = ఓ వామనదేవా! అనఘం = పాపములు లేనట్టియు, యజమానేజ్యం. యజమాన = యాగముచేయువారలలో, ఇజ్యం = పూజ్యుఁడైనట్టియు, వదాన్యం = మిక్కిలి దాతయైనట్టియు, భక్తం = భక్తిగలిగినట్టియు, పుణ్యజననాథం = రాక్షసులకు నాథుఁడగు బలిచక్రవర్తిని, (పుణ్య = పవిత్రుఁడగు, జననాథం = రాజును, అనిస్ఫురణము) అవమానయన్ = అవమానించుచున్నవాఁడవగుచు (అణఁగద్రొక్కిన వాఁడవగుచు) అహల్యాజార = ఇంద్రునకు, ప్రీతిం = ఆనంద

మును, కరోషి = చేయుచున్నాఁడవు, అహో = ఆశ్చర్యము (అహల్యాజారప్రీతిం = ఒకానొకజారునకు సంతోషము. అన్ని స్ఫురణము.)

మ. యజమానేజ్య నతి ప్రభక్తునివదా
న్యాగ్రేసరున్ సర్వపు
ణ్యజనాధీశు నపాపవృత్తు నవమా
నంబొందఁగాఁ జేసి యా
యజముఖ్యుల్ వొగడంగఁగూర్చితివహా
ల్యాజారసంప్రీతి ధా
త్రిజనమ్ము చ్చెరుపాటునొందికన వ
ర్ణిగ్రామణీ నీవొగిన్.

తా. ఓ బ్రహ్మచారీ నీవు పాపరహితుఁడు, సోమయాజి, దాత, భక్తుఁడు నగు నొక్క పుణ్యాత్ము నవమానించి యొకా నొక జారునకు సంతోషము చేసితివని యాశ్చర్యము. ఓవామన దేవా! నీవు, దుఃఖము లేనివాఁడును. జన్నఁబొనర్చు చున్నవాఁడును మిక్కిలి యీవిగలవాఁడను, భక్తుఁడునగు రాక్షసరాజైన బలిచక్రవర్తిం బాతాళంబున కణఁగఁద్రొక్కి, దేవేంద్రునకు మహానందం బొసఁర్చితివని తాత్పర్యము.

శ్లో. గజానన ముదన్వితం ధృతతపస్విరత్నాంచితం
పదక్రమ విరాజితం కపటినం వటుం శంకరం ।
పటుం ఘనజటం శిలోచ్చ యజయోపయుక్తా దరం
స్మరాభ్యుదయదాశయం వృషనిషేవ్యమాణం భజే. 9

టీ. గజాననముదన్వితం, గజ=గజేంద్రునియొక్క, బ్రతికించుటయందు (అన ప్రాణనే, ఇతి ధాతోర్ల్యుటి భవతి, అనఁగా అనప్రాణనే అను ధాతువునకుల్యు ప్ర ముచేర్చినయెడల, అననమనియగును.) ముత్ = సంత తో=అన్వితం=కూడిన అని వామన దేవపరము. గజానన శ్వరునియందు, ముత్ = సంతోషముతో, అన్వితం = అని శివపరము. ధృత ... చితం, ధృత = ధరింపఁబడిన, మునులయొక్క, లేక దీనులయొక్క, రక్షా=రక్షణాతో, తం=ఒప్పుచున్న అని యుభయపరము. పదక్రమ పద=అడుగులయొక్క, క్రమ=విక్షేపముచేత (ఉంచు విరాజితం=ప్రకాశింపఁజేయఁబడిన (మూఁడడుగులచేత లెల్ల నాక్రమించిన)అని వామనదేవపరము. పద=పదము క్రమ=క్రమము చేతను (పదము, క్రమము, అనునవి, వేద లు) విరాజితం=ప్రకాశింపఁజేయఁబడిన, లేక పద=ప యొక్క, క్రమ = ఉంచుటచేత (అనఁగా సంధ్యాసమం నాట్యముచేత శివుఁడు సంధ్యాసమయమున నాట్యము నుప్రసిద్ధము) విరాజితం = ప్రకాశింపఁ జేయఁబడిన శివపరము. పటుం = సమర్థుఁడైన, ఉభయాపరము. ఘ ఘన = గొప్ప, జటం = జడలుకల, ఇదియునుభయా లేక. ఘన = ఘనయు, జటం=జటయుకల (ఘన, జటయ పరిభాషలు) అని గాని లేక ఘన = మేఘములు, జటం లుగాఁగల, అనఁగాఁద్రి విక్రమరూపమున మేఘములు జ యములుగాఁగల అనిగాని వామ=దేవపరము. శిలో .. శిలోచ్చయ = పర్వతములను, జయ = జయించిన క

ండు, ఉపయుక్త = కూడికొనిన, ఆదరం=గౌరవముకలవాఁడు
వామనపరము. శిలోచ్చయజయా (వ్యస్తపదము) పార్వతీదే
తో, ఉపయుక్త=కూడికొనిన, ఆదరం = ఆదరముకలవాఁడు.
క పార్వతీదేవితో కూడుకొనుటయం దాదరము కలవాఁడు
గాని, స్మరా ... శయం, స్మర = మన్మథునకు, అభ్యుదయ =
భివృద్ధిని,ద=ఇచ్చునట్టి,ఆశయం=మనస్సుకలవాఁడు; లేక స్మరా
్యదయ=కామోద్రేకమును, ద=ఖండించు, ఆశయం=మనస్సు
వాఁడు. (వటురూపధారి గావున కామవికారములేనివాఁడు)
గాని వామనదేవపరము. స్మర = మన్మథునియొక్క,అభ్యు
ము = అభివృద్ధిని, ద = ఖండించు, ఆశయం = అభిప్రాయము
వాఁడు (స్మరహరుఁడు) వృష నిషేవ్యమాణం, వృష = ఇం
నిచేత, వాసవో, వృత్రహా, వృషా అని యమరము
షేవ్యమాణం = సేవింపఁబడువాఁడు అని వామనరూప
ష్ణుదేవపరము. వృష = వృషభముచే, నిషేవ్యమాణం =
ంపఁబడువాఁడు (వృషభవాహనుఁడు) అని శివపరము. శం
ం, శం = సుఖమును, కరం = చేయునట్టి, కపటినం = కప
ముగల, వటుం = బ్రహ్మచారిని (కపటవటురూపధారి
గు విష్ణుదేవుని అని వామనపరమున, శంకరం అనునది
శేషణము. వటుం అనునది విశేష్యము) కపటినం = కపటము
, వటుం = బ్రహ్మచారియగు (శివుఁడు, పార్వతి తపమ్ము
యుచుండఁగా నామె హృదయమ్ము నెఱుంగుటకు, కపట
హ్మచారి రూపమ్ముఁ దాల్చెను) శంకరం=శివుని (అని శివ
రమున వటుం అనునది విశేషణము, శంకరం అనునది విశే
్యము) భజే=సేవించుచున్నాను.

మ. అతిభక్తిన్ సతమున్ గజాననసము
ద్యత్ప్రీతి, మోదాభిర
క్షితమునోర్ర్యఘుఁ బదక్రమాధికవిరా
జిత్ వ్యాజవర్ణిం బటున్
రతినాథోదయదాన మానసువృషేం
ద్రభ్రాజదాకారుఁ బ
ర్వతజాతాధికవర్ధనాధృతి జటిం
ద్రార్థిం చెదన్ శంకరున్. 9

తా. గజేంద్రుని రక్షించుటయందు మిక్కిలి సంతో
షము గలట్టియు తపస్వి రక్షణంబునందు దీక్షంబూనినట్టియు
మూఁడడుగులచే భువనమ్ములనెల్లనాక్రమించి బలిచక్రవర్తి నణఁ
గఁ ద్రొక్కినట్టియు, నెల్లరకు సుఖంబు నిచ్చునట్టియు, వటు
రూప ధారిగావున మన్మథవికార దూరుండైనట్టియు, దేవ
దేవుండు గావున నింద్రాదులచే భజింపం బడునట్టియు, కపట
వామన రూపధారియగు విష్ణుదేవుని భజించుచున్నానని ప్రకృ
తార్థము. విఘ్నేశ్వరునియం దెక్కుడు ప్రేమఁ గలిగినట్టియు,
తపస్విరక్షణమునందు దీక్షంబూనినట్టియు, సంధ్యాకాలమ్మున
తాండవంబుచే విరాజిల్లునట్టియు, జటలను ధరించునట్టియు
పార్వతియెడ నెంతయుం బ్రేమ గలిగినట్టియు, మన్మథుని
దహించినట్టియు, వృషభవాహనుఁ డైనట్టియు కపట వటు
రూపమును దాల్చినట్టియు, శివుని సేవించుచున్నానని యప్రకృ
తార్థము, అలంకారము పూర్వంబువలెనే యెఱుంగునది.

శ్లో. అరుణాబ్జ విరాజమాన నేత్రం
కరుణాలంక్రియమాణ చిత్రగాత్రం

వరుణాలయజాశ్రితోరువత్సం
తరణాయాన్వహ మచ్యుతంభజేహం

టీ. అరు ... .. నేత్రం, అరుణ=సూర్యుఁడు, అబ్జ=చంద్రుఁడు, అను విరాజమాన = మిక్కిలి ప్రకాశించుచున్న, నేత్రం= కన్నులు గలిగినట్టియు, కరు .. గాత్రం,కరుణా=దయచేత. అలంక్రియమాణ = అలంకరింపఁబడిన, చిత్ర = చిత్రమైన, గాత్రం= శరీరముగల, వరు ... వత్సం వరుణాలయ=సముద్రుని వలన, జా=పుట్టినలక్ష్మీ దేవిచేత, ఆశ్రిత = ఆశ్రయింపఁబడిన, ఉరు= గొప్ప, (విశాలమగు) వత్సం=వక్షస్థలము కలిగిన, అచ్యుతం = వామనరూప విష్ణుదేవుని, తరణాయ=తరించుటకొరకు, అహం= నేను, అన్వహం=ప్రతిదినమందు, భజే = సేవించుచున్నాఁడను.

మ. అరుణాబ్జాతివిరాజమానకమనీయాక్షుఁ బ్రముఖప్రభుం
గరుణాభూషితదివ్యచిత్రవిలసద్గాత్రుం బవిత్రాఖ్యసా
గరకన్యామణిసంశ్రితోరుతరవక్షఃపీఠు నైకుంఠు దు
స్తరసంసారమహాబ్ధిపూరతరణార్థం బాశ్రయింతుం దగన్.

తా. సూర్యచంద్రులు నేత్రములుగాఁ గలిగినట్టియు, దయామయవిగ్రహుండైనట్టియు, లక్ష్మీదేవిని, వక్షంబునం దాల్చినట్టియు వామనరూప విష్ణుదేవుని, సంసార సాగరంబు దరింపఁ జేయుటకొరకు నిచ్చలు డెందమ్మునను బొందుపరచి భజియించుచుంటిని.

ఇతి వామనావతారః.

వామనావతారనుతి సమాప్తము.

---

# దశావతారనుతిశతకేపరశురామావతారః.

---

శ్లో. కార్తవీర్యం కృత్తవీర్యం రామోరామంనయన్నయీ
జ్యేద్ధధర్మ్మ జ్యేద్ధధర్మ్మ శ్రేయసే భూయసే స్తునః. 1

టీ. కృత్త వీర్యం, కృత్త = ఛేదింపఁబడిన, వీర్యం = పరాక్రమము కలిగిన, కృత్తం, వీర్యం, యస్యతం, కృత్తవీర్యం, అని సమాసము. కార్త వీర్యం=కార్తవీర్యార్జునుని, రామం= విరామమును (నాశనమును) నయన్=పొందించుచున్న, నయీ= నీతిగల, జ్యేద్ధధర్మ్మ జ్యా=నారిచేత, (అల్లెత్రాడు) ఇద్ధ=ప్రకాశింపఁజేయఁబడిన ధర్మ్మ=ధనస్సుకల, ఇజ్యేద్ధ ధర్మ్మ, ఇజ్యా = యాగములచేత ఇద్ధ, ప్రకాశింపఁ జేయఁబడిన, ధర్మ్మ = ధర్మ్మములుకల, లేక, జ్యా=భూమియందు=ఇద్ధ=ప్రకాశింపఁజేయఁబడిన, ధర్మ్మ=ధర్మ్మముగల; రామః=పరశురాముడు నః = మాకు, భూయసే=అధికమైన, శ్రేయసే=శుభము కొరకు, అస్తు=అగుఁగాక.

గీ. సజ్యమగు దివ్యధనువు హాస్తమున మెరయఁ
గార్తవీర్యునిబాహు వర్గంబులీల
వెలయఁదునుమాడి యమునికిఁవిందొనర్చి
ధర్మ్మ మిలలోన నాల్గు పాదముల నడపి
వరలు రాముఁడు మమ్ముఁ గాపాడుఁగాత.

తా. కార్తవీర్యార్జునుని, బాహుసహస్రంబు నరికి సంహారించినట్టియు, దివ్యధనుర్ధరుఁడై లోకమ్మున, యజ్ఞాది ధర్మ్మ

ములు వెలయించినట్టియు, పరశురాముఁడు మా కభీష్టసుఖంబు లొడఁగూర్చుఁ గావుతమని ప్రార్థనము.

శ్లో. జంభ ప్రత్యర్థి దంభోళ్యధిక శితకుఠా రాగ్రనిష్కృ [త్తభూభృ
ద్వర్యగ్రీవాగ్ర నిర్యద్రుధిరరసఝరై రార్చిచత్ స్వా [న్పితౄ న్యః
స్కందాత్యంతే ర్గిరీంద్రే బిల మకురుత యః క్రౌంచ [సంజ్ఞే పృషత్కా
ద్యోదాత్సర్వంసహాం చ ప్రకటితతపసే కశ్య పాయావ [తాన్నః.2

టీ. యః = ఎవ్వఁడు, జంభ ..ఝరైః, జంభప్రత్యర్థి= దేవేంద్రునియొక్క. దంభోళి = వజ్రాయుధముకంటె, అధిక =మిక్కిలి, శిత = వాఁడిగల. కుఠార = గండ్రగొడ్డలియొక్క, అగ్ర = కొనచేత, నిష్కృత్త=నరకఁబడిన, భూభృద్వర్య = గొప్పరాజులయొక్క, గ్రీవా = కంఠములయొక్క, అగ్ర = అగ్రభాగమువలన, నిర్యత్ =కారుచున్న, [నిర్పూర్వకాదిణ్, గతావిత్యాదికధాతోర్లటశ్శతరి, నిర్యదితిరూపంసిద్ధం] రుధిర=రక్తంబను, రస=ఉదకముయొక్క, ఝరైః =ప్రవాహముచేత, స్వాన్ =తన సంబంధులైన, పితౄన్ =పితృదేవతలను, ఆర్చిచత్ =పూజించెనో, అర్చ, పూజనే, ఇతిచౌరాదికధాతోర్లుఙ్ప్రథమ పురుషైకవచనరూపం, ఆర్చిచదితి భవతి, (తృప్తినొందించెనో) యః = ఎవఁడు, స్కందాత్యంతేః, స్కంద = కుమారస్వామియందు, అత్యంతేః=ఈర్ష్యవలన, పృషత్కాత్ = ఒక్కబాణమువలన, క్రౌంచసంజ్ఞే = క్రౌంచమను పేరుగల, గిరేంద్రే = పర్వతశ్రేష్ఠ

మందు, బిలం=రంధ్రమును, అకురుత=చేసెనో, యః=ఎవ్వఁడు, సర్వంసహాం=భూమిని, ప్రకటితతపసే, ప్రకటిత = ప్రకటము చే యఁబడిన, తపసే=తపస్సుగల, కశ్యపాయ = కశ్యపునికొఱకు, అదాచ్చ = దానముఁ జేసెనో, సః=అటువంటి, పరశురాముఁడు, నః = మమ్ములను, అవతాత్ = రక్షించుఁ గాత.

మ. పృతనాషాట్కులిశాతిశాతపరశూత్కృత్తావనీభృద్గళో
త్సృతతచ్ఛోణితధారలం బితరులం దృప్తాత్ములం జేసియు
ద్ధతుఁడై యాగుహునందుఁ బేరలుకఁ దక్రౌంచాద్రి భేదించి ధా
త్రి తగన్ గశ్యపమౌని కిచ్చినకృతిన్ భృగ్వాత్మజుం గొల్చెదన్.

తా. వజ్రాయుధముకన్న వాఁడిగల గండ్రగొడ్డలిచే రాజుల నెల్ల నరికి వారి రక్తముచేఁ బితృతర్పణం బొనర్చినట్టియు, కుమారస్వామియం దీర్ష్యచేఁ గ్రౌంచపర్వతమధ్యంబున నొక్క బాణంబుచే రంధ్రం బొనర్చినట్టియు, తపోనిధియగు కశ్యపునకుఁ బుడమి నెల్ల దానం బొసంగినట్టియు, పరశురాముఁడు మమ్ముం బ్రోవుఁగావుత మని ప్రార్థనము.

శ్లో. ప్రకటపటుకుఠారఘోరకోటి
త్రుటిత కిరీటవిశిష్ట శత్రు కోటిః ।
అనవరతవివర్ధమాన కామప్రము
ఖరిపు ప్రశమాయ మేస్తు రామః॥ 3

టీ. ప్రకట ... కోటిః = ప్రకట=ప్రకటముగా, పటు = సమర్థమైన, కుఠార = గండ్రగొడ్డలియొక్క, ఘోర = భయంకర

మైన, కోటి = అంచుచేత, త్రుటిత = భేదింపఁబడిన, కిరీట = కిరీటములతో, విశిష్ట = కూడికొనిన, శత్రు=శత్రువులయొక్క (రాజులయొక్క) కోటిః = సంఘముకల, రామః = పరశురాముఁడు, మే = నాయొక్క, అన .. మాయ, అనవరత = ఎల్లపుడు, వివర్ధమాన = మిక్కిలి వృద్ధిపొందుచున్న, కామప్రముఖ = కామము మొదలైన, రిపు = అంతశ్శత్రువులయొక్క (కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఇవియారును అంతశ్శత్రువు లనఁబడును ఇవియే యరిషడ్వర్గం బనియుఁ జెప్పంబడును.) ప్రశమాయ=నాశనము కొరకు, అస్తు = అగుఁగాక.

మ. వరమాణిక్యరుగుల్లసన్మకుటదీవ్యత్సర్వవైరోఘముం
గరకుంగొడ్డలిధారఁ దున్మిధర నిఃక్షాత్రమ్ముగావించి ది
వ్యరుచిన్ మీరెడు రాముసంతత మెదన్ వర్ధిల్లు కామప్రభృ
త్యరిషడ్వర్గముఁదున్మిమమ్ములను గాపాడంగఁ బ్రార్థించెదన్

తా. ముయ్యేడుమారులు కరకుం గుఠారంబుచే వైరులనెల్ల రూపుమాపిన పరశురాముఁడు నామనమ్మున మాటిమాటికి నీటు మీరు నంతశ్శత్రువుల గీటడంచి జ్ఞానంబొసంగుఁ గావుత మని ప్రార్థనము.

శ్లో. భూమిభృద్దళనభాసురహేతిం
మన్యువృద్ధికలితం విబుధేంద్రం ।
రాజశేఖరని బద్ధము దేద్ధం
రేణుకాసుతభవంతమవైమి॥ 4

టీ. హే రేణుకానుతి = ఓ పరశురామ దేవ, భూమి... హే తిం, భూమిభృత్ = రాజులయొక్క, దళన = ఛేదించుటచే. భాసుర = ప్రకాశించుచున్న, హేతిం = ఆయుధముకల (గం డ్రగొడ్డలి గల) అని పరశురామపరము. భూమిభృత్ = పర్వ తములయొక్క, దళన = ఛేదించుటచేత. భాసుర = ప్రకాశిం చుచున్న, హేతిం=వజ్రాయుధముకల యని దేవేంద్రపరము, మన్యువృద్ధికలితం, మన్యు = కోపముయొక్క వృద్ధి = ఆధిక్య ముతో, కలితం=కూడికొనిన, అని పరశురామపరము. మన్యు= యజ్ఞములయొక్క, వృద్ధి = ఆధిక్యముతో, కలితం = కూడి కొనిన (శతక్రతుత్వముతో కూడికొనిన) లేక, మన్యు = యజ్ఞ ములచేత, వృద్ధి = పోషణతో, కలితం = కూడికొనిన, (క్రతుభు క్కు గావున) అనిగాని దేవేంద్రపరము ॥ని॥ "మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి") రాజశేఖరనిబద్ధముదా, రాజశేఖర = చంద్రమౌళి యందు (శివునియందు), నిబద్ధ = కూర్పఁబడిన, ముదా = ఆ నందము చేత (భక్తిచేత) ఇద్ధం = ప్రకాశించుచున్న (గురువు గావున) అని పరశురామ పరము, రాజశేఖర - రాజశ్రేష్ఠుల యందు (అనఁగా వీరస్వర్గము నొందిన రాజతల్లజులయందు, నిబద్ధ=కూర్పఁబడిన, ముదా=ఆనందము చేత, ఇద్ధం=ప్రకాశించు చున్న అని దేవేంద్రపరము. భవంతం=నిన్ను, విబుధేంద్రం=దేవ దేవునిఁగా, అనియర్థము. వేల్పురేనిగానని యర్థాంతరము. అ వైమి= తెలిసికొనుచున్నాను.

మ. అని శోద్వృత్త మహీభృదుద్దళనకాశ్యార్యానంతసారేద్ధహే
 తిని భాసిల్లుట మన్యువృద్ధిని తగన్ దీపించుటన్ రాజమౌ

ళిని బద్ధాదృతి శాలివాటరుచిహేళిన్ మీరుటన్ రేణుకా
తనయానిన్విబుధేంద్రుఁగా నెలమిడెందంబందు భావించెదన్

తా. ఓ పరశురామదేవా, క్షత్త్రలోకంబునెల్ల దరిగి వేసిన గండ్రగొడ్డలి యాయుధంబుగా గలిగినట్టియు, వైరుల యెడ మిక్కిలి కోపంబుచే నెసంగునట్టియు, గురువు గావున నీశ్వరుని యెడ నెంతయుభక్తిచే విరాజిల్లునట్టియు నిన్ను దేవదేవునిఁగా నెఱుంగుచుంటి ననియు, పర్వతముల రెక్కలఁ జక్కాడిన యుక్కుమిగులు వజ్రాయుధమ్ముచే మెరయునట్టియు, నూరుజన్నంబు లొనర్చినట్టియుః, వీరస్వర్గము నొందిన రాజవరులయందు మిక్కిలి యాదరమ్ము గలిగినట్టియు వేల్పు రేనిఁగా దలంచుచుంటి ననియుఁ దాత్పర్యము.

శ్లో. సహస్ర దోషం తమరిం గురుద్రుహం
స్మయోద్ధురం పుణ్య జనేశ్వరద్విషం ।
శుభోరిపుఘ్నో గురు భక్తిమాన్ గత
స్మయో మహాత్మా జమదగ్ని జోవధీత్ ॥ 5

టీ. హే పరశురామ = ఓ పరశురాముఁడా, (అధ్యాహారము.) సహస్రదోషం, సహస్ర = వేయి, దోషం = బాహువులు, గలిగినట్టియు, (అనేక దోషములు కలిగినట్టి యని వ్యంగ్యము) అరిం = శత్రు వైనట్టియు. గురు ద్రుహం, గురు=తండ్రియగు జమదగ్నికొరకు, ద్రుహం = ద్రోహము చేసినట్టియు, (గురుద్రోహి యని వ్యంగ్యము) స్మయోద్ధురం, స్మయ=గర్వము చేత, ఉద్ధురం = అతిశయించినట్టియు, (అధికగర్వముకలిగి

నట్టియు) పుణ్యజనేశ్వరద్విషం, పుణ్యజన = రాక్షసులకు, ఈ
శ్వర = ప్రభువైన రావణాసురునికి, ద్విషం=శత్రుఁడైనట్టియు,
(పవిత్ర జనపతులకు శత్రువని వ్యంగ్యము.) తం=ప్రసిద్ధుఁడైన
కార్త వీర్యార్జునుని, శుభః = మంగళ ప్రదుఁడవైనట్టియు,
రిపుఘ్నః = శత్రుసంహారకుఁడవైనట్టియు, గురుభక్తిమాన్ =
గురునియందు భక్తిఁగలిగినట్టియు, గతస్మయః-గత=పోయిన,
స్మయః = గర్వము గలిగినట్టియు, (గర్వములేనట్టి) మహాత్మా,
మహాత్ = గొప్ప, ఆత్మా = అంతఃకరణము, గలిగినట్టియు,
జమదగ్నిజః = జమదగ్నినందనుఁడవైనట్టి, భవాన్ = నీవు,
అవధీత్ = చంపితివి,

మ. దురితున్ వైరి సహస్రదోషుని గురు
ద్రోహాపరాధున్ స్మయో
ద్ధురునిం బుణ్యజనేశ్వరద్విషు, శుభే
ద్ధుండున్ రిపుఘ్నుండు త
ద్గురు భక్తుండు గతస్మయుండును మహా
త్ముండున్ బుధేష్యుండు నాఁ
గర మొప్పారెడు భార్గవుండవయి వీ
కన్ జెండు బెండాడితే.

తా. ఓ పరశురామదేవా! వేయికరమ్ములతో మెరయు
నట్టియు, నీతండ్రికపకారం బొనరించినట్టియు, మిక్కిలి గర్వి
యయినట్టియు, రావణునకు పరాభవమ్మొనర్చినట్టియు, కార్త
వీర్యార్జునుని, కళ్యాణమూర్తివైనట్టియు, వైరివర్గంబు నెల్ల
నిర్మూలంబుగాఁ బరిమార్చినట్టియు గురుభక్తి యుక్తుండవై
వరలునట్టియు, గర్వ విదూరుండవైనట్టి నీవు సంహారించితివి.

(ఇట్టి నీకు సహస్రదోషుండు, గురుద్రోహి, పవిత్రజన పతి శత్రువు నగువానిని సంహరించుట మిక్కిలి యనురూపంబని వ్యంగ్యము.)

శ్లో. శాంత్యేకసారా క్వ తపస్వితా హరే
హింసాప్రధానా క్వచ హేతిధారితా।
తథాపి తత్తత్సమయానుసారిణీం
భూదేవతాం పార్థివతాం బిభర్ష్యహో! 6

టీ. హేహరే = ఓ పరశురామరూప విష్ణుదేవా! శాంత్యేకసారా = ఒక్కశాంతియే ప్రధానముగాఁగల, తపస్వితా = మునిత్వము, క్వ = ఎక్కడ, హింసా ప్రధానా = హింసా ప్రధానమగు, హేతి ధారితా, హేతి=ఆయుధమును, ధారితా= ధరించు స్వభావముకలుగుట (క్షాత్రము) క్వ = ఎక్కడ, తథాపి = అయినను, తత్తత్సమయానుసారిణీం, తత్తత్ = ఆయా సమయ=కాలములను, అనుసారిణీం = అనుసరించుచున్న, భూదేవతాం = బ్రాహ్మణత్వమును, పార్థివతాం = క్షాత్రమును, బిభర్షి=భరించుచున్నావు. అహో! = ఆశ్చర్యము.

శా. భూమిన్ శాంతిగుణ ప్రధానమగు
చుంకొబాల్పారుభూదేవతా
ధామంబేడ? విహింసచే నె
సఁగుక్షాత్రంబేడ? నీరెంటికిన్
సామానాధికరణ్య మొప్పద
యినకొన్గాలాను సారమ్మునన్
భూమీశత్వము బ్రాహ్మణత్వము
భయమ్మొందాల్చితీవచ్యుతా

తా. ఓ పరశురామదేవా! బ్రాహ్మ్యము శాంతి ప్రధానమైనది. క్షాత్రము హింసా ప్రధానమైనది ఈ రెండును విరుద్ధ ధర్మంబులు గావున నొక్కచో నుండవు అయినను అఘటనఘటనా సామర్థ్యముగల నీ మాయా సమయంబులకు తగునట్లు భయంబుఁ దాల్చితివి గావున నీమహిమం బవాఙ్మానసవేద్యము.

శ్లో. రామోపి తీక్ష్ణపరశునికృత్తక్షత్రియేంధనః ।
విప్రోపి సాయుధకరో వ్యలసద్భార్గవ్రోభవాన్ః 7

టీ. హేహరే = ఓ పరశురామ రూప విష్ణుదేవా, భార్గవః= భృగునందనుఁడవైన, భవాన్ = నీవు, రామోపి = మనోహరుఁడ వైనను, అనఁగా సుకుమారుఁడవైనను (రాముఁడను నామముకల వాఁడవు) తీక్ష్ణ ... ధనః, తీక్ష్ణ=వాడిగల, పరశు= గండ్ర గొడ్డలిచేత, నికృత్త = నరుకఁబడిన, క్షత్రియేంధనః, క్షత్రియ=రాజులను, ఇంధనః=కట్టెలుకలవాఁడవగుచు. విప్రోపి= బ్రాహ్మణుఁడవైనను, సాయుధ కరః, సాయుధ = ఆయుధముతో, కూడిన, కరః = హస్తముకలవాఁడ వగుచు వ్యలసత్ = విరాజిల్లితివి.

క. ధర రాముఁడ వయ్యున్ స్ఫుర
దురు పరశునికృత్త భూధవోర్వింధనతన్
ధరణిసురుఁడవయి యాయుధ
కరతం దగి మెరయుచుంటివిగద భృగువర్యా!

తా. సౌకుమార్యము, గలవాఁడు కట్టెలు కొట్టుటయు బ్రాహ్మణుఁడు శస్త్రధారియగుటయు విరుద్ధములు కావున వి-

ధను. ఓవిష్ణుదేవా, నీవు ధరపై విప్రరూపమ్మున నవతరించి రాముఁడను నామముధరించి, ఆయుధమ్ముదాల్చి కరకుంగొడ్డలిచే క్షత్రియులనెల్ల కట్టెలకై వడితెగనరికి లోకమ్ము రక్షించి విరాజిల్లితివని పరిహారము. విరోధాభాసాలంకారము.

శ్లో. ధృతస్వధితిధర్మకం గురుసమర్చనాత్యాదరం
స్వమన్యుపరిపోషకం సమితి భాసమానంసదా ।
క్షమాగకృతసౌహృదం సతతయోగినంభార్గవం
వదామి విపులార్చణాధిక ముదంచితబ్రాహ్మణం ॥

టీ. ధృతస్వధితిధర్మకం, ధృత = ధరింపఁబడిన స్వధితి = గండ్రగొడ్డలియును, ధర్మకం = ధనస్సును కలిగినట్టియు, అని పరశురామపరము, ధృతస్వధితి = యజ్ఞము, ధర్మకం=ధర్మముగా గల(ధృతా, స్వధితిః, యేనసః, ధృతస్వధితిః, స్వధితియనఁగాయజ్ఞాంగవిశేషము) అని బ్రాహ్మణ పరము. గురుసమర్చనాత్యాదరం; గురు = గురునియొక్క, (తండ్రియొక్క లేక గురువగు నీశ్వరునియొక్క) సమర్చనా = పూజయందు, అత్యాదరం = మిక్కిలి యాదరము కలిగినట్టియు అని పరశురామ పరము. గురు= గొప్ప, సమర్చనా = దేవతాదిపూజయందు, అత్యాదరం = మిక్కిలి యాదరముకల, అని బ్రాహ్మణపరము. స్వమన్యు పరిపోషకం, స్వ = తనయందు, మన్యు=కోపమును, పరిపోషకం= వృద్ధిపొందించునట్టి, లేక, సు=యోగ్యులయందు, అమన్యు=సంతోషమును, పరిపోషకం=వృద్ధిపొందించునట్టి లేక, సు=యోగ్యముగా, అమన్యు=సత్వమును, పరిపోషకం=వృద్ధి నొందించునట్టి అని పరశురామ పరము. స్వ = తనయొక్క, మన్యు = యజ్ఞమును, పరిపోషకం = వృద్ధిపొందించునట్టియని బ్రాహ్మణ

పరము. సదా=ఎల్లప్పుడు, సమితి = యుద్ధమందు, భాసమానం ప్రకాశించునట్టి, అని పరశురామ పరము. సమితి=సభయందు, భాసమానం = ప్రకాశించునట్టి, అని బ్రాహ్మణపరము కుమారకృత సౌహ్యదం, కుమార = కుమారస్వామియందు. కృత = చేయఁబడిన, సౌహృదం=స్నేహముకల, అని పరశురామ పరము కుమార = పిల్లలయందు, కృత = చేయఁబడిన, సౌహృదం ప్రేమకల, లేక (కుశ్చ మాచ, కుమే, కుమే రాతి, గృహ్ణాతీతి, కుమారః=భూదేవిని,లక్ష్మీ దేవి నిగ్రహించినవాఁడు అనఁగా విష్ణు దేవుఁడు కుమార=విష్ణుదేవునియందు,కృత=చేయఁబడిన, సౌహృదం భక్తికలవాఁడు, అనిగాని బ్రాహ్మణపరము. సతతయాగినం, సతత=అవిచ్ఛిన్నమైన,యాగినం=యాగములుకలవాఁడు, రెండర్థములయందు తుల్యము. భార్గవం = పరశురాముని, విప్రం బ్రాహ్మణం, విపులా=భూమియొక్క, అర్పణ = దానముచేత, అధిక = మిక్కిలి, ముత్ = ఆనందముతో, అంచిత = ఒప్పుచున్న, బ్రాహ్మణం = కశ్యపుఁడను బ్రాహ్మణుఁడు కలవానిని గా, అనియు, విపుల = అధికమైన, అర్పణ = దానముచేత, అధిక =మిక్కిలి, ముత్ = ఆనందముతో, అంచిత = ఒప్పుచున్న, బ్రాహ్మణం = బ్రాహ్మణునిగా, అనియు వదామి = వచించుచున్నాను.

చ. ధరణిని స్వీకృతస్వధితిశ్రీధర్ముఁడవై గురుభక్తి పూజనా
భిరుచివియై స్వమన్యుపరిశ్రీవృద్ధియుతుండవు నై సమిద్విభా
స్వరుఁడవు నై కుమారకృతసౌహృద బుద్ధివియై యనారత
ప్రరుచి మఖుండవై యెసఁగుశ్రీభార్గవుచిన్ విపులార్పణక్రియా
విరత ముదంచితార్యనుతశ్రీవిప్రవరేణ్యుఁడ వంచు నెంచెదన్.

తా. ఓ పరశురామదేవా, గండ్రగొడ్డలియు, విల్లును కరమ్ములఁబూనివిరాజిల్లునట్టియు తండ్రిని పూజించుటయందు లేక గురువగు నీశ్వరుని పూజించుటయం దెంతయు నాదరంబు కలిగి నట్టియు వైరులయెడ మిక్కిలి కోపభావమ్ము చూపునట్టియు, యుద్ధములయం దెల్లప్పుడు జయముతో విరాజిల్లునట్టియు, సహోధ్యాయి గావున కుమారస్వామియందు మిక్కిలి చెలిమి కలిగినట్టియు, నిరంతర యోగప్రవర్తకుఁడవైనట్టియు. భృగు నందనుఁడవగు నిన్ను సమస్త భూమియు దానం బొసంగుటచే నధికమగు సంతోషము నొందింపఁబడిన కశ్యపుఁడను విప్రుఁడు గలవానినిగా వచించుచుంటిననియు, అధికమగు దేవతాద్యర్చన మందు మిక్కిలి యాదరము కలిగినట్టియు తనయాగములను వృద్ధి నొందించునట్టియు, సభయం దెల్లప్పుడు విరాజిల్లునట్టియు, కుమారులయందు, లేక విష్ణుదేవునియందు మిక్కిలి సౌహార్దము గలిగి నట్టియు, నధికమగు దానముచే మిక్కిలి మోదమ్ముతో నొప్పుచున్న యొకానొక విప్రునిగా వచించుచుంటి ననియుఁ దాత్పర్యము.

శ్లో. మన్యే భార్గవవంశ్యో రామో
రామాంతు భార్గవీం నగతః
ఏకకులోద్భవ యో ర్భువి
పరిణీతి ర్నీతిదూ రేతి. 9

టి. భువి=భూమియందు, ఏకకులోద్భవయోః, ఏక=ఒక్క, కుల=వంశమందు, ఉద్భవయోః=పుట్టినవారికి, పరిణీతిః=పరిణయము (పెండ్లి) నీతి దూరా=నీతి బాహ్యమైనది, ఇతి = ఈ

హేతువుచేత, భార్గవవంశ్యః = భృగువంశమునందు పుట్టిన, రామః=పరశురాముఁడు భార్గవీం=భృగుపుత్రికయగు, రామాం =స్త్రీని (లక్ష్మిని) నగతః=పొందలేదు ఇతి=ఈలాగునని, మన్యే= తలంచుచున్నాను

క. మొగి నేకకులోద్భవులకుఁ
దగదు ధరంబెండ్లియనెడుధర్మము నెరపన్
భృగుకులుఁడ వగుట భార్గవి
యగు నిందిర పొందుమానితని దలఁతు విభూ !

తా. పుడమిలో నొక్క గోత్రమున జనించిన వారి| వివాహము శాస్త్ర విరుద్ధంబు గావున భృగు గోత్రంబున జనించిన పరశురాముఁడు భృగు పుత్రికయగు లక్ష్మిని పరిగ్రహింపలేదు. అట్లు కాదేని నిత్యానపాయినియగు నాలక్ష్మీదేవి నేలకైకొనఁడు ?

శ్లో. ఛేత్తాపి హైహయానాంభక్తానాంభార్గవోభవాన్ మృదుః
కాంచన కశిపోర్హర్తా ప్రహ్లాదస్యాభవద్ధరిర్మృదులః.

టీ. హేరామా=ఓ పరశురామ, భార్గవః = భృగువంశ్యుఁడవైన భవాన్=నీవు, హైహయానాం=హైహయవంశ్యులకు ఛేత్తాపి = సంహారకుఁడవైనను, భక్తానాం=భక్తజనులకు, మృదులః = మృదుస్వభావము కలవాఁడవు. కాంచన కశిపోః హిరణ్యకశిపునకు, హర్తా=సంహారకుఁడైన, హరిః = నరసింహుఁడు, ప్రహ్లాదస్య = భక్తుఁడగు ప్రహ్లాదునకు, మృదులః మృదు స్వభావముకలవాఁడు, అభవత్ = ఆయెను.

క. అని నీ పుత్రగత హైహయు
లను దున్మిన, భక్తుల మృదుశీలత మనుపుదు కాం
చనకశిపుఁ జీల్చినను వా
రని కనికర మిడఁడె నృహరి శ్రీప్రహ్లాదునిపై.

తా. ఓ పరశురామదేవా! నీ వాదుష్టులగు కార్తవీర్య వంశ్యులకు, మారకుఁడవైనను, భక్తజనులయెడ నెంతయు దయగలవాఁడవై విరాజిల్లుదువు. అతిఘోర రూపమ్మున హిరణ్యకశిపుం జీల్చి చెండాడిన నృసింహదేవుండు భక్తుండగు ప్రహ్లాదు నెంతయు వాత్సల్యముతో రక్షించెనుగదా.

ఇతి పరశురామావతారః.

పరశురామావతార స్తుతి సమాప్తము.



---

## శ్రీరామావతారస్తుతి ప్రారంభము.

శ్లో. దాశరధిం దాశరథం కరుణాశరధిం భజే శరణం.
ఆశ్రితజనవనచైత్రం దశముఖముఖలేఖశత్రుజైత్రమహం

టీ. దాశరథం=దాశ=పక్షిరాజగుగరుత్మంతుఁడు, రథం=రథముగా కలిగినట్టియు, (గరుడవాహనుండైనట్టి) కరుణాశరధిం, కరుణా=దయకు, శరధిం=సముద్రుండైనట్టియు, ఆశ్రితజనవనచైత్రం, ఆశ్రితజన = భక్తజనులను, వన = ఉద్యానవనమనకు, చైత్రం=వసంతుఁడైనట్టియు, దశ ... జైత్రం, దశముఖ=రావణుఁడు, ముఖ=మొదలగు, లేఖశత్రు=రాక్షసులకు, జైత్రం=జయించు స్వభావముకల, దాశరధిం = దశరథపుత్రుఁడగు శ్రీరాముని, అహం=నేను, శరణం=రక్షకునిగా భజే=పొందుచున్నాను.

క. శరణొందెద దాశరథి
స్వరదాశరథుం గృపాకరనచ్ఛరధిన్ భ
క్త రుచిరవనచైత్రు నఘా
కరదశముఖ ముఖసురారిగణబలజైత్రున్.

తా. గరుడవాహనుండును, దయాసముద్రుండును, దాసజనులకెంతయు, నానందమ్ము ఘటియించువాఁడును, రావణాదిదుష్టసంహారకుండు నగు దశరథనందనరూపుఁడైన విష్ణుదేవుని శరణొందుచున్నాను.

శ్లో. అజాత శరభంగోపి శరభంగం దదర్శ హా ।
ముక్తాంగదాదికో రామ యుక్తాంగద ముదస్యహో ! ॥

టీ. హేరామ=ఓ శ్రీరామా! త్వమ్=నీవు,అజాత శరభంగోపి,అజాత=పుట్టని, శర=బాణములయొక్క,భంగోపి=భంగము కలవాఁడవైనను (అప్రతిహత బాణుఁడవైనను) శరభంగం, శర = బాణములయొక్క, భంగం = భంగపాటును, దదర్శ = చూచితివి. హా = ఆశ్చర్యము, అనివిరోధము. శరభంగం = శరభంగ మహర్షిని, దదర్శ=చూచితివి అని పరిహారము, ముక్తాంగదాదికః, ముక్త=విడువఁబడిన, అంగద=భుజకీర్తులు, ఆదికః= మొదలగునవి కల, త్వం=నీవు, యుక్తాంగదముత్ , యుక్త=కూడికొనిన, అంగద=భుజకీర్తులవలన కలుగు, ముత్ =సంతోషము కలవాఁడవు, అసి=అయితివి. అహో=ఆశ్చర్యము అనివిరోధము. యుక్త=కూడికొనిన, అంగద=వాలినందనునియందైన, ముత్ =సంతోషము కలవాఁడవు. అసి=అయితివి. అని పరిహారము. విరోధాభాసాలంకారము.

క. ఒనరన శరభంగుఁడవై
నను నా శరభంగ దర్శనము నొంది తహో
యెనసియు ముక్తాంగదతన్
గుణయుక్తాంగద ముదమ్మునఁ గొంటివి రామా

తా. ఓ రామా! నీవు శరభంగము లేనివాఁడవైనను, శరభంగముం జూచితివి. ముక్తాంగదుఁడవైనను యుక్తాంగద మోదుండవైతివి. అని శబ్దమాత్రమ్మున విరోధము. అప్రతిహతబాణుండవగు నీవు శరభంగ మహర్షిని జూచితివనియు,

మునివేష ధరుఁడవు కావున కేయూరములు మున్నగు భూషణా మ్ములు పరిత్యజించితి వనియు, వాలినందనుఁ డగు నంగదుని యందు వాత్సల్యము కలవాఁడవై వానిం బ్రోచితివనియు భావము.

శ్లో. సగుణ శివధర్మపాతా రామ స్సగుణం బభంజ శివధర్మం।
ఏతత్కురుతేచిత్రం సహృదయ హృదయే వశిష్ఠశిష్యోపి॥ 3

టీ. వశిష్ఠశిష్యోపి, వశిష్ఠ=వశిష్ఠ మహర్షియొక్క, శిష్యోపి= శిష్యుఁడైనను, సగుణ శివధర్మపాతా, సగుణ=గుణ విశిష్టుల యొక్క, (సజ్జనులయొక్క) శివ=శుభప్రదమగు, ధర్మ=ధర్మము నకు, పాతా=రక్షకుఁడగు, రామః=శ్రీరాముఁడు, సగుణం=గుణ ముతోఁ గూడిన, శివధర్మం = శుభప్రదమగు ధర్మమును, బభంజ=భేదించెను అని విరోధము. సగుణం=నారితోఁగూడిన, శివధర్మం=ఈశ్వర ధనుస్సును, బభంజ=ఛేదించెను. అని పరిహా రము. ఏతత్ =ఇది, సహృదయ హృదయే, సహృదయ=సజ్జనుల యొక్క, హృదయే = డెందమందు, చిత్రం = ఆశ్చర్యమును కురుతే=చేయుచున్నది. విరోధాభాసాలంకారము.

మ. సగుణోద్యచ్ఛివధర్మ మెయ్యెడల సం
స్థాపించు పుణ్యాత్ముఁ డ
య్యు గురూత్తంమునకా వశిష్ఠునకు శి
ష్యుం డయ్యు రాముండిలన్
సగుణోద్యచ్ఛివ ధర్మ భంజనముతా
నల్పెంగదా యన్నుడుల్
సుగుణ స్వాంతుల మానసమ్ములకుఁ గూ
ర్చున్ దేవ యాశ్చర్యమున్.

తా. ధర్మశాస్త్రకర్తయు, అనంత మహిముఁడు నగు వశిష్ఠుని శిష్యుఁడును, సగుణశివధర్మ రక్షకుండు నగు శ్రీరాముఁడు సగుణ శివధర్మమును చ్ఛేదించెను. అనునియ్యది సజ్జనుల హృదయమ్ముల కెంతయు నాశ్చర్యము కలిగించుచుండెనని శబ్ద మాత్రమ్మున విరోధము. వశిష్ఠ శిష్యుండును, సజ్జనుల శుభ ప్రదమగు ధర్మమును రక్షించు శ్రీరాముఁడు అల్లెత్రాటి తోఁగూడిన మహేశ్వరుని ధనువు విరిచి యెల్లరకు నాశ్చర్యము గలిగించెనని తాత్పర్యము.

శ్లో. స్మృతి పారగోపిరామో జనకస్య సుతాంచకారజం భావే।
చిత్ర చరిత్ర స్సత్వం మిత్రకులాంభోధి చంద్రమా జయసి॥

టీ. రామః = రాముఁడవైన, యః = ఏ, భవాన్ = నీవు, (ఈ పదద్వయ మధ్యాహారము) స్మృతి = ధర్మశాస్త్రముల యొక్క, పార=అంతమును, గోపి=పొందిన వాఁడవైనను, జనకస్య = తండ్రియొక్క, సుతాం = కుమార్తెను (తోబుట్టువును) భావే=హృదయమందు, జం=భార్యనుగా, చకార=చేసితివో, అని విరోధము, జనకస్య = జనక చక్రవర్తియొక్క, సుతాం = కూతురగు సీతాదేవిని, అని పరిహారము, సః = అటువంటి, మిత్రకుల=సూర్యవంశంబను, అంభోధి=సముద్రమునకు, చంద్రమాః=చంద్రుఁడవగుత్వం=నీవు, చిత్ర చరిత్రః, చిత్ర=ఆశ్చర్యకరమగు, చరిత్రః=చరిత్రము కలవాఁడవై, జయసి = విరాజిల్లుచుంటివి. విరోధాభాసాలంకారము.

చ. క్షితితలమందధర్మమునుకెండ జనించిన నీవు రామ య
ప్రతిమమహత్త్వమొప్ప స్మృతిపారగతందనరారుచుండియుం

గుతుకముతోడుతన్ జనకుకూతు గ్రహించితి భార్యగాగ న
ద్భుతచరితుండ వీవన నభోమణివంశపయోధి చంద్రమా !

తా. ఓరామా! సమస్తధర్మశాస్త్రములు గడముట్టం
జదివినవాఁడవైనను, నీవు జనకసుతను (సోదరిని) భార్యగాఁ
గైకొంటివని విరోధము. సమస్త ధర్మశాస్త్రములు, సమస్త
విద్యలు గడముట్టంజదివిన నీవు జనకచక్రవర్తి కూతురగు సీతా
మహాలక్ష్మిని వివాహమాడి యాశ్చర్యకరములగు మహాకార్య
ము లొనర్చుచు సూర్యవంశ ప్రదీపకుండవై తనరారుచుంటి
వని తాత్పర్యము.

శ్లో. నిర్జరాధిపహితంస్త్వయ మిచ్ఛన్
తర్జితేంద్రతనయో నయసాంద్రః।
యాతుధానహననే ధృతదీక్షో
యాతుపాసిభగవన్ బత రామ ॥ 5

టీ. హేభగవన్ = ఓ దైవమా ! రామ = రాముఁడా,
నయసాంద్రః, నయ = నీతిచేత, సాంద్రః=అధికుఁడవగు, (అధి
క నీతిగల) త్వం = నీవు, నిర్జరాధిపహితం, నిర్జరాధిప=దేవేం
ద్రునియొక్క, హితం = ఇష్టమును, (సుఖమును) ఇచ్ఛన్ =
కోరుచున్న వాఁడ వగుచు, తర్జితేంద్రతనయః, తర్జిత = భయ
మును పొందింపఁబడిన (సంహరింపఁబడిన) ఇంద్ర = దేవేంద్రు
నియొక్క, తనయః = కొడుకులుకలవాఁడవు, అసి = అయితివి
అని విరోధము. నిర్జరాధిప = దేవతాశ్రేష్ఠులకు, హితం=శుభ
మును, ఇచ్ఛన్ = కోరుచున్నవాఁ డవగుచు, తర్జిత = సంహరిం
పఁబడిన, ఇంద్రతనయః = వాలిఁగలవాఁడవై, అసి=అయితివి
అని పరిహారము. యాతుధానహననే, యాతుధాన = రాక్షసు

లయొక్క, హననే = సంహరించుటయందు, ధృతదీక్షః, ధృత= ధరింపఁబడిన, దీక్షః = నియమముకలవాఁడ వగుచు. యాతు = రాక్షసుని, పాసి=రక్షించుచున్నావు. అని విరోధము. యాతు= రాక్షసుండగు విభీషణుని, పాసి = రక్షించుచున్నావు. అని పరిహారము. బత=విరోధమున ఖేదద్యోతకము. పరిహారార్థమున హర్షద్యోతకము.

చ. వినయవిరాజమానరఘు
వీరసురేంద్రునకున్ హితంబొగిన్
బొనరుప నెంచి తత్సుతుని
పొంచియుఁ ద్రుంచితి వీవు క్రవ్యభు
గ్ఘననమునందు దీక్షితుఁడ
వయ్యు విభీషణాదైత్యు సమ్మతిన్
మనిచితిగాదె నీదుమహి
మ మ్మతిచిత్ర మెరుంగ శక్యమే!

తా. ఓరాముఁడా! నీవు ఇంద్రునకు హితంబుసేయ నెంచి యింద్రతనయుల భయమ్ము నొందించితివి. రాక్షసుల సంహరింప దీక్షంబూని రాక్షసరక్షణం బొనర్చితి వనియు విరోధము. దిక్పాలాది దేవతలకెల్లరకు హితంబుసేయ నెంచినవాఁడవును, రాక్షస సంహారంబున దీక్షం బూనినవాఁడవును, శరణొందిన విభీషణుని రక్షించినవాఁడవు నై దుష్ట శిక్షణ దీక్షయు శిష్టరక్షణ తాత్పర్యంబు నెల్లరకు వెల్లడించితివని భావము.

శ్లో. కౌశికాధిగత సంవిదదంభః
కుంభసంభవవితీర్ణ మహాస్త్రః।

వాయునందనసహాయజితారీ
రాఘవ్రో విజయతి శ్రితధర్మా॥ **6**

టీ. కౌశి ... విత్, కౌశిక = విశ్వామిత్రునివలన, అధిగత = పొందఁబడిన, సంవిత్ = జ్ఞానము కలిగినట్టియు, అని రాఘవ పరము. కౌశిక=ఇంద్రునివలన, అధిగత=పొందఁబడిన, సంవిత్ = జ్ఞానముకలిగినట్టియు, లేక సంవిత్ = నామము (పేరు) కలిగి నట్టియు, (అనఁగా పుట్టుకకల అని తాత్పర్యము) అని అర్జునప రము. అదంభః = కపటము లేనట్టియు, అని యుభయపరము. కుంభ ... హాస్త్రః, కుంభసంభవ=అగస్త్యమహామునిచేత, వితీ ర్ణ = ఈయఁబడిన, మహాస్త్రః=దివ్యాస్త్రములు కలిగినట్టియు, అని రాఘవపరము. కుంభసంభవ = ద్రోణాచార్యులచేత, వితీర్ణ = ఈయఁబడిన, మహాస్త్రః = దివ్యాస్త్రములుకల, అని అర్జున పరము. వాయునందన = హనుమయను, సహాయ = సహాయునిచేత, (అనుచరునిచేత)జిత = జయింపఁబడిన, అరిః = శత్రువులు కలిగినట్టియు; అని రాఘవపరము. వాయునందన = భీముఁడను. సహాయ = సహాయునిచేత (అగ్రజునిచేత) జిత = జయింపఁబడిన, అరిః = శత్రువులు కలిగినట్టియు, అని అర్జున పరము, శ్రితధర్మా, శ్రిత = అవలంబింపంబడిన, ధర్మా = ధర్మ ముకలిగినట్టియు, అని రాఘవపరము. శ్రిత=ఆశ్రయింపఁబడిన ధర్మా=ధర్మరాజు (అగ్రజుఁడు కలిగినట్టియు, అని అర్జునపరము. సూ॥ ధర్మాదనిచ్ కేవలాత్, అను సూత్రముచేత శ్రితః, ధర్మః యేన, సః, అని, బహువ్రీహిసమాసమున అనిచ్, రాగా, శ్రిత ధర్మా అని నకారాంతంబయ్యెను. రాఘవః = దాశరథి, విజయ

తి = అర్జునుఁడువలె నాచరించుచున్నాఁడు. (విజయ, ఇవ, ఆచ
రతి విజయతి, అని ఆచారార్థక క్విబంతరూపము.

చ. అకపటవృత్తిమారుతి సహాయువినిర్జితసర్వవైరికో
టి కలశసంభవాగత పటిష్ఠమహాస్త్రుఁడు కౌశికోపల
బ్ధ కలితసంవిదాఢ్యుఁడు సదాశ్రిత ధర్ముఁడు నాఁట సుప్రసి
ద్ధక వినుతోల్ల సద్విజయతం దగు దాశరథిన్ భజించెదన్.

తా. కౌశికాధి గతంబగు సంవిత్తు గలిగినట్టియు, అక
పటవృత్తియగునట్టియు, కుంభ సంభవునిచే నొసంగఁబడిన
దివ్యాస్త్రములు కలిగినట్టియు. వాయునందనుని సాహాయ్యము
చే జయింపఁబడిన శత్రువులు కలిగినట్టియు, దాశరథి ఇట్టి
ధర్మములుగల అర్జునుండువలె నాచరించుచుండెనని తా
త్పర్యము.

శ్లో. యేనకీశమిజనోభవద్యతో జానకీశపథ వృత్తిరుద్ధృతా।
దీనకీశపతిపాతు రీదృశో జానకీశపద మాశ్రయే తవ ॥ 7

టీ. హేజానకీశ=ఓసీతాపతీ! యేన = ఏనీచేత, శమిజనః =
మునిసంఘము, కీ=సుఖముకలదై, అభవత్ =ఆయెనో, కంఅస్యా
స్తీతి కీఅనివృత్తి, యతః=ఏనీచేత, జానకీ=జనకచక్రవర్తిసంబం
ధమైన (జనకునిచే నొనర్పఁబడిన) శపథవృత్తిః=ప్రతిజ్ఞావ్యా
పారము, ఉద్ధృతా=నిర్వహింపఁబడెనో, ఈదృశః = ఇటువంటి,
దీనకీశపతిపాతుః, దీన=దీనుఁడగు, కీశపతి=వానరరాజైన సుగ్రీవు
నకు, పాతుః = రక్షకుఁడవైన, తవ=నీయొక్క, పదం = పాద
మును, అహం=నేను, ఆశ్రయే=ఆశ్రయించుచున్నాను.

ఉ. ఎవ్వఁడు మానివర్గమునకెంతయు సంతసముం ఘటించెనో
యెవ్వఁడు తా విదేహపృథివీశుప్రతిజ్ఞ భరంబుదీర్చెనో

యెవ్వఁడు దీనుఁడై నది వకసేశ్వరనందనుఁ గూర్మిఁగాచెనో
యవ్విభు జానకీశు హృదకయమ్మున నిల్పిభజింతునిచ్చలున్.

తా. ఓ సీతాపతీ దుష్టరాక్షస సంహారం బొనర్చి సంయములకెల్ల స్వాస్థ్యముఁ గలిగించినట్టియు, శివధనుర్భంగంబొనర్చి జనక చక్రవర్తి ప్రతిజ్ఞాభరంబు దీర్చి సుఖంబుగూర్చినట్టియు అన్నయగు వాలి పరిభవించుటచే మిక్కిలి దీనుఁడగుసుగ్రీవుని కభయంబొసంగి వాలిని సంహరించి, రక్షించినట్టియు నీయొక్క పాదములేను శరణొందుచుంటిని.

శ్లో॥ గుహాధికముదంచితో నిజసుమంత్రబద్ధాదరః
ప్రదానపరితోషకోఽఖిలశిలీముఖానాం ప్రభుః ।
ప్రమోదకవిరాజితో జనకనందనాసక్తధీ
ర్గణాధిపతిరాఘువస్సతతమామకాభీష్టదః ॥ 8

టీ. గుహాధికముదంచితః, గుహ=గుహునియందు, అధిక=మిక్కిలి, ముత్=సంతోషముచేత, అంచితః=ఒప్పుచున్నట్టియు, అనిరాఘవపరము. గుహ = కుమారస్వామియందు, అధిక= మిక్కిలి, ముత్=సంతోషముతో, అంచితః=ఒప్పుచున్న అని విఘ్నేశ్వరపరము, నిజసుమంత్రబద్ధాదరః, నిజ=స్వకీయుఁడైన, (మంత్రియైన) సుమంత్ర=సుమంత్రునియందు, బద్ధ = కూర్పఁ బడిన, ఆదరః=ఆదరముకల, అని రాఘవపరము. నిజ=స్వకీయ మైన, సు=యోగ్యమైన, మంత్ర=మంత్రము కలవారలయందు, బద్ధ = కూర్పఁబడిన, ఆదరః = ఆదరముకల, అని విఘ్నేశ్వర పరము. అఖిలశిలీముఖానాం, అఖిల=మాలిన్యములేని, శిలీము ఖానాం=బాణములకు, ప్రదానపరితోషకః, ప్రదాన=ప్రకృష్టమైన ఖండనచేత, (శత్రుసంహారముచేత) పరితోషకః=

సంతోషపరచునట్టి అని రాఘవపరము, అఖిలశిలీముఖానాం, అఖిల=సమస్తమైన, శిలీముఖానాం=తుమ్మెదలకు, ప్రదానపరితోషకః, ప్ర=ప్రకృష్టమైన, దాన=మదముచేత, పరితోషకః= సంతోషపెట్టువాఁడు. అని విఘ్నేశ్వరపరము, ప్రభుః=నిగ్రహాను గ్రహసమర్థుఁడైన,అని ఉభయపరము. ప్రమోదకవిరాజితః, ప్రమోద=మిక్కిలి సంతోషముకల, కవి=కవులచేత, (వాల్మీకిమున్నగువారిచే) విరాజితః=ప్రకాశింపఁజేయఁబడిన (వర్ణింపఁబడిన) అని రాఘవపరము. ప్ర=గొప్ప, మోదక=ఉండ్రములచేత, (భక్ష్యవిశేషములచేత) విరాజితః = ప్రకాశింపఁజేయఁబడిన, అని విఘ్నేశ్వరపరము. జనకనందనా సక్తధీః, జనకనందనా=సీతాదేవియందు, ఆసక్త=మిక్కిలి కలిసికొనిన, ధీః=మనస్సుగలవాఁడు, అని రాఘవపరము. (నందిగ్రహ, అను సూత్రముచే ల్యుప్రత్యయమురాగా నందనా అని యయ్యెను) జనక= తండ్రియొక్క, (ఈశ్వరునియొక్క) నందన = సంతోషపెట్టుటయందు, ఆసక్త=ఆసక్తిగల,ధీః=బుద్ధికలవాఁడు. అనివిఘ్నేశ్వరపరము. సతతమామకాభీష్టదః, సతత=ఎల్లప్పుడు, మామక= నాసంబంధమైన, అభీష్ట = కోరికలను, దః = ఇచ్చువాఁడునగు రాఘవః=శ్రీరాముఁడు గణాధిపతి = విఘ్నేశ్వరుఁడువలె నాచరించుచున్నాఁడు (గణాధిప ఇవ, ఆచరతీతి, గణాధిపతి, అని వృత్తి, ఆచారార్థక క్విబంతరూపము)

ఉ. ప్రాకటసత్ప్రమోదకవిరాజితుఁడున్ స్వసుమంత్రనిత్యయు
క్తాకలితాదరుండునుగ్రహాధికముద్యుతుఁడున్ శిలీముఖా
స్తోకలసత్ప్రదానపరితోషకుఁడున్ జనకేశ్వరాత్మజా
త్తైకముదంచితుం డయి గణాధిపతం దగు రాముఁ డేలుతన్

తా. గుహాధికముదంచితుఁడును, నిజసువుంత్రబద్ధాం ధుఁడును అఖిలశిలీముఖములకు ప్రదానపరితోషకుఁడును, ప్ర మోదకవిరాజితుఁడును జనకనందనా సక్తబుద్ధియునగుటంజేసి గణాధిపతుల్యుం డగు రాఘవుండెల్లప్పుడు మాకోర్కెలం దీర్చి మనుచుఁగాత.

శ్లో. సుగ్రీవాంచిత మీడే
సుగ్రీవాఢ్యం సులక్ష్మణాకలితం।
లక్ష్మణసహితం మహితం
సుహనూమంతం హనూమతా సేవ్యం॥ 9

టీ. హేరామ=ఓ శ్రీరాముఁడా! సుగ్రీవాంచితం, సుగ్రీవ= వానరరాజుచేత, అంచితం=సేవింపఁబడునట్టియు, సుగ్రీవాఢ్యం; సు=ప్రశస్తమగు, గ్రీవా=కంఠముచేత, ఆఢ్యం = ఒప్పుచున్నట్టి యు, సులక్ష్మణా=శుభలక్షణములతో, కలితం = ఒప్పుచున్నట్టి యు, లక్ష్మణసహితం, లక్ష్మణ=సౌమిత్రితో, సహితం=కూడి కొనినట్టియు, మహితం=పూజ్యుఁడవైనట్టియు, సుహనూమంతం సు=ప్రశస్తమగు, హనూమంతం = హనువులు కలిగినట్టియు, (హనువులనఁగా చెక్కిలికి మీఁదిభాగము) హనూమతా=ఆంజ నేయునిచేత, సేవ్యం=సేవించతగినట్టియు, భవంతం = నిన్ను, ఈడే=కొనియాడుచున్నాను.

మ. మనువంశాబ్ధినిశాకళత్రుని హనూ
మంతున్ హనూమత్ప్రభ
క్తినివిష్టాత్ము మహాయశోలసితు సు
గ్రీవాఢ్యుసుగ్రీవసే

వృనిలాపత్యమనోంబు జార్యము నమే
యోద్యన్ మహాత్ర్యన్ సల
క్ష్మణు సల్లక్షణు భక్తిసక్తులెసగం
గానం స్తుతింతున్ మదిన్.

తా. ఓ శ్రీరామా! సుగ్రీవునిచే సేవింపఁ బడునట్టియు, ప్రశస్తకంఠమును, కలిగినట్టియు,శుభలక్షణ సంపన్నుఁడవైనట్టియు, లక్ష్మణునితో నెయ్యెడలఁ గూడుకొని యుండునట్టియు నెల్లరకు పూజ్యుఁడ వైనట్టియు, ప్రశస్తహను యుక్తుఁడవైనట్టియు, నాంజనేయునిచే నెల్లప్పుడు భజింపఁ బడునట్టియు, నిన్ను నే నభీష్టసిద్ధికిం గొనియాడుచునుంటిని.

శ్లో. సకృచ్ఛరణయాయినా మభయదానశౌండస్స్వయం
వయంహిశృణుమో భవత్ప్రచురవాచమామ్నాయతః।
సదాప్రపదనస్పృశాం రఘుపతేద్యనః కాం దశాం
తనోషి నిఖిలప్రభో తవ దయాం ముదా ప్రార్థయే.

టీ. హేనిఖిలప్రభో=సమస్తలోకనాయకా! హేరఘుపతే= ఓ శ్రీరాముఁడా, సకృచ్ఛరణయాయినాం, సకృత్=ఒక్కసారి, శరణయాయినాం = శరణుఁ జొచ్చిన వారికి, స్వయం = స్వయముగా, అభయదాన శౌండః, అభయ = అభయముయొక్క, దాన=ఇచ్చుటయందు, శౌండః=శ్రేష్ఠుఁడు, ఇతి=ఈవిధముగా, భవత్ప్రచురవాచం, భవత్=నీసంబంధమైన, ప్రచుర=ప్రసిద్ధమైన, వాచం=వాక్కును,ఆమ్నాయతః=వేదమువలన, వయం= మేము, శృణుమోహి=వినుచున్నాముగదా. సదా=ఎల్లప్పుడు, ప్రపదనస్పృశాం=ప్రపత్తినిపొందిన, నః=మాకు,అద్య=ఇప్పుడు, కాం=ఏ దశాం = అవస్థను, తనోషి = చేయుచున్నావో, తవ=

నీయొక్క, దయాం=కరుణను, ముదా=ఆనందముచేత, ప్రార్థయే=ప్రార్థించుచున్నాను.

చ. ఒకరుఁగ నొక్కసారి శర
ణొందిన వారిని బ్రోతువీవు పం
బిన ధృతి నంచు బ్రాఁబలుకు
వేయిముఖమ్ముల వక్కణించుఁగా
వున ననిశంబు డెందమునఁ బొం
దుగనిల్పి ప్రపత్తిసేయుమా
కు వనువుమీరనేపదవి
గూర్చెదొ రామ, యనుగ్రహింపవే

తా. సర్వ జగత్పతి వగునో శ్రీరామచంద్రా! ఒక్క సారి నిన్ను శరణుచొచ్చిన వారలకే స్వయమ్ముగా నభయంబొసంగి రక్షించు మహాదాతవని వేదమ్ముల వలన వినుచుంటిని గావున నెల్లప్పుడు నిన్నేనమ్మి ప్రపత్తిసేయు మాకెట్టి మహోన్నత పదవి నొసంగెదవో యని ముదమ్మున నీదయను ప్రార్థించుచుంటిని.

శ్లో॥ ప్రౌఢామ్నాయసరస్వతీ స్వతఇయంముగ్ధాపిమద్భారతీ
శ్రీమద్భానుకులాబ్ధిచంద్రభవత శ్శ్రావ్యాభవత్యాదరాత్
ప్రౌఢావాస్ఖలితాస్వకీయశిశువాగ్జాతా పితుస్తోషిణీ
రేఖాచంద్రమసోయథాసుమనసాంవంద్యాచనంద్యాస్తునా॥

టీ. స్వతః=స్వభావమువలన, ప్రౌఢా=ప్రౌఢమైన, ఆమ్నాయసరస్వతీ=వేదవాక్కుయున్ను, ముగ్ధాపి=ప్రౌఢముకానిదైన

ను, ఇయం=ఈ, మద్భారతీ, మత్ = నాయొక్క, భారతీ=వాక్కుయున్న ప్రౌఢా వా = ప్రౌఢమైనదైనను, స్ఖలితా వా=తొట్రుపాటుకలదైనను, స్వకీయశిశువాక్, స్వకీయ = తనసంబంధులగు, శిశు=పిల్లలయొక్క, వాక్=పలుకు, యథా=ఏవిధముగా, పితుః=తండ్రికి, తోషిణీ=సంతోషపెట్టు, స్వభావముకలది, జాతా=అగుచున్నదో, చంద్రమసః = చంద్రునియొక్క సా=ఆప్రసిద్ధమైన, రేఖా=కళ, యథా = ఏవిధముగా, సుమనసాం = విద్వాంసులకు, వంద్యా = నమస్కరించఁదగినదియు, నంద్యాచ=సంతోషించఁదగినదియు, అస్తు = అగునో, తథా=ఆవిధముగా, హేశ్రీమద్భానుకు లాబ్ధిచంద్ర, శ్రీమత్=శోభాయుక్తమైన, భానుకుల=సూర్యవంశంబను, అబ్ధి=సముద్రమునకు, చంద్ర=పూర్ణచంద్రుఁడా! భవతః=నీకు, ఆదరాత్=ఆదరమువలన, శ్రవ్యా=వినఁదగినది, భవతి=అగుచున్నది.

చ. అలతొలిపల్కుదెంతయును
ప్రౌఢతమీరును నాదుపల్కునన్
గలుమత నొంది యుండు నయి
నన్దమబాలురపల్కుదెంతయున్
స్ఖలితమదైనఁ బ్రౌఢతనె
సంగినమోదముగూర్చునట్లు గ్లౌ
కళ సుమనోభినంద్య యగు
నై వడి నీకును శ్రావ్య మయ్యెడిన్.

తా. ఓసూర్యవంశప్రదీపకుండవగునో శ్రీరామచంద్రా! స్వభావమువలన ప్రౌఢమగు వేదవాక్కు వలె ప్రౌఢము కాని

దైనను భక్తుఁడనగు నావాక్కున్ను తనపిల్లవారల మాటలు ప్రౌఢమైనవైనను, ప్రౌఢముకానివైనను తండ్రికెట్లానందము కలిగించునో చంద్రకళ విద్వాంసుల కెట్లు మొక్కఁదగినదియు, సంతోషింపఁదగినదియు నగుచున్నదో యట్లే నీకు నాదరమ్మున వినఁదగినదియే యగును,

శ్లో. రామం మహితనయేతం మహితన
యాఢ్యం నమామివినయాఢ్యం ।
మిత్రకుల మండనం త్వాం
సౌమిత్రీడ్యంచ మిత్రకులసేవ్యం ॥ 12

టీ. మహితన ఏతం=మహితనయా = భూపుత్రియగు సీతా మహాలక్ష్మితో, ఇతం = కూడికొనినట్టియు, మహితన యాఢ్యం, మహిత=పూజింపఁబడు, నయ=నీతిచేత, ఆఢ్యం=ఒప్పుచున్నట్టియు, వినయాఢ్యం, వినయ = వినయముతో, ఆఢ్యం = విరాజిల్లుచున్నట్టియు, మిత్రకుల మండనం. మిత్రకుల=సూర్య కులమునకు, మండనం=అలంకారమైనట్టియు, మిత్రకుల సేవ్యం, మిత్ర = స్నేహితులయొక్క, కుల = సమూహముచేత, సేవ్యం= సేవించఁదగినట్టియు, సౌమిత్రీడ్యంచ, సౌమిత్రి = లక్ష్మణునిచేత, ఈడ్యంచ=కొనియాడఁ దగినట్టియు, రామం = రాముఁడవగు, త్వాం = నిన్ను, నమామి = నమస్కరించుచున్నాను.

క. మహి తనయా మహి తనయా
సహితా వినయాఢ్య మిత్ర సంసత్సేవ్యా
మహిమిత్ర వంశమండన
రహి సౌమిత్రీడ్య, గొల్తు రఘురామ నినున్.

తా. ఓరామా! సీతామహాలక్ష్మితోఁ గూడికొనినట్టియు, పూజ్యమగునీతిచేతఁ బ్రకాశించుచున్నట్టియు. మిక్కిలి వినయ సంపన్నుఁడ వైనట్టియు, సూర్యవంశంబున కలంకార మైనట్టియు, స్నేహం బొనర్చుటకు మిక్కిలి తగినవాఁడవైనట్టియు, శేషావతారంబగు లక్ష్మణునిచే నెల్లప్పుడు కొనియాడఁబడునట్టియు నీకు నే నెల్లప్పుడు నభీష్టసిద్ధికొరకు కైమోడ్పు లొనర్చుచుంటిని.

ఇతి శ్రీరామావతారః.

శ్రీ రామావతార స్తుతి సమాప్తము.

---

# దశావతారనుతిశతకే-బలరామావతారః

---

బలరామావతారస్తుతి ప్రారంభము.

శ్లో. శశధరవంశకరీరం శ్రితమిత్రం రౌహిణేయపదవాచ్యం
నీలాంబరకమనీయం గురుకౌతుకవర్ధకం బుధం కలయే. 1

టీ. శశధర వంశకరీరం, శశధర=చంద్రునియొక్క, వంశ = వంశమనే వెదురునకు, (శ్లిష్టరూపకము) కరీరం=అంకురమైనట్టి యు, అని యుభయపరము, శ్రితమిత్రం శ్రిత=ఆశ్రయింపఁబడిన, మిత్రం=స్నేహితులుకల, అని బలరామదేవపరము, శ్రిత= ఆశ్రయింపఁబడిన, మిత్రం=సూర్యుఁడుకల, అని బుధుని పరము.(సూర్యబుధులకు మైత్రి జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధము) రౌహిణేయ పదవాచ్యం,రౌహిణేయ=రౌహిణేయయను, పద=పదము చేత, వాచ్యం=చెప్పఁదగిన, అని యుభయపరము. నందుని భార్యయగు రోహిణికిం గొడుకు గావున బలరాముఁడు రౌహిణేయుఁ డయ్యెను. బుధుఁడు చంద్రునికిఁ గొడుకు గావున చంద్రుని భార్యలగు నిరువదియేడు నక్షత్రములలో నొక్కటి యగు రోహిణికినిఁ గొడుకేయగుటంజేసి రౌహిణేయుండని చెప్పఁదగినవాఁడయ్యె. నీలాంబరకమనీయం, నీల=నల్లని, అంబర=వస్త్రముచేత, కమనీయం=మనోహరుఁడైన అని బలరామ పరము నీల=నల్లని, అంబర=ఆకాశమందు, కమనీయం=ప్రకాశించు, అని బుధపరము. ని. అంబరం వ్యోమ్ని వాససి. గురు

కౌతుకవర్ధకం, గురు=తండ్రి యగువసుదేవునకు, కౌతుక =
సంతోషమును, వర్ధకం = వృద్ధినిపొందించునట్టి, అని బల
రామ పరము. గురు=తండ్రియగు చంద్రునకు, కౌతుక=సంతో
షమును, వర్ధకం=వృద్ధిపొందించునట్టి; లేక గురు=బృహస్పతికి,
కౌతుక=సంతోషమును వర్ధకం=వృద్ధిపొందించునట్టి, అని బుధ
పరము. బుధం=దేవుని (బలరాముని) కలయే=ధ్యానించుచున్నా
ను. బుధం=చంద్రసుతుని, కలయే=తలఁచుచున్నాను. అని
యన్వార్థము. ప్రకృతా=ప్రకృత శ్లేషాలంకారము మతాంతరం
బున శబ్దశక్తిమూలకమగుధ్వని.

ఉ. శ్రీతుహినాంశువంశసుకరీరుని సంశ్రితమిత్రుఁ గాంతివి
ఖ్యాతుని రౌహిణేయు గురుకౌతుకవర్ధను నీలభాసమ
న్వీత మహాంబరాతిరమణీయుని నాబుధు నెప్డు మాకు సం,
ప్రీతి ఘటించిబ్రోవమదిరెక్కొను భక్తి నమస్కరించెదన్.

తా. చంద్రవంశమునం దావిర్భవించినట్టియు, స్నేహితు
లచే నాశ్రయింపఁ బడునట్టియు, రోహిణీదేవికిం గుమారుఁడై
నట్టియు. నల్లనివస్త్రముఁ దాల్చునట్టియు, వసుదేవునకానందము
వెల్లివిరియించునట్టియు, బలరామదేవు నిష్టసిద్ధికిఁ దలంచుచుంటి
ననియును, చంద్రుని కుమారుఁడైనట్టియు, సూర్యునితో కలసి
కొనునట్టియు, రోహిణీ నక్షత్రమునకుం గుమారుఁ డనఁదగినట్టి
యు, నల్లని యాకసంబున నుల్లసిల్లునట్టియు, తన తండ్రికానంద
మునొదవించునట్టియు,బుధునిదలంచుచుంటిననియును భావము.

శ్లో. వసుదేవ తుష్టిజనకో నిఖిలకలాపోద్య రేవతీరమణః
అంకగతకృష్ణపాహిత్వంకువలయమిత్రమాంస్వయంస్వజనం॥

టీ. హేఅంకగతకృష్ణ, అంక=సమీపమును, గత=పొందిన, కృష్ణ=కృష్ణుఁడుఁగలవాఁడా! అని బలరామ దేవపరము, అంక= చిహ్నమును, గత=పొందిన, కృష్ణ=ఇఱ్ఱిగలవాఁడా, లేక నలుపు గలవాఁడా అనిచంద్రపరము,కువలయమిత్ర, కువలయ=భూమండలమునకు,మిత్ర=స్నేహితుఁడా,అని బలరామ దేవపరము. కువలయ=కలువలకు,మిత్ర=చెలికాఁడా,అని చంద్రపరము. వసుదేవతుష్టిజనకః, వసుదేవ=తండ్రియగువసుదేవునకు, తుష్టి=సంతోషమును,జనకః=కలిగించునట్టి, అని బలరామదేవపరము; వసు=కిరణములచేత, దేవ=వేల్పులకు,తుష్టి=సంతృప్తిని, జనకః=కలిగించునట్టి, అని చంద్రపరము, నిఖిలకలాపః, నిఖిల=సమస్తమైన, కలాపః=భూషణములు కలవాఁడు అనిబలరామపరము. నిఖిల= సమస్తమైన, కలా=కళలను, పః=పరిపాలించునట్టి, (కళానాథుఁడు) అని చంద్రపరము, రేవతీరమణః, రేవతీ = రేవతీదేవికి, రమణః=భర్తయని బలరామదేవపరము. రేవతీ=రేవతీనక్షత్రమునకు, రమణః=పతియగు అని చంద్రపరము; త్వం=నీవు, అద్య= ఇప్పుడు, స్వజనం=నీవాఁడనగు, (నీపోష్యవర్గములోనివాఁడ నగు అనఁగా భక్తుఁడ నగు) మాం=నన్ను స్వయం=స్వయముగా, పాహి=రక్షింపుమా.

తే.గీ. రేవతీరమణా వసుదేవ తుష్టి
జనక కువలయబాంధవ సత్సకల క
లాపమేదురసితకాంతి లసితరూప
అంకగతకృష్ణ మమ్ముఁ గాపాడుమయ్య.

తా. ఎల్లప్పుడు కృష్ణునితోఁ గూడికొని యుండువాఁడా! భూమండలమున కెల్ల స్నేహితుఁడైనవాఁడా, (భూమండలమున కెల్ల హితంబుసేయు వాఁడా) బలరామదేవా, వసుదేవున కెంతయు నానందము సంధించునట్టియు, సమస్త మహా భూషణములతో విరాజిల్లునట్టియు, రేవతీదేవికిం బతియైనట్టియు, నీవు నీ భక్తులమగు మమ్ముఁగాపాడుము అనియును, చిహ్నముగఁ దాల్పంబడిన లేడి గలవాఁడా, కలువలకుం జెలికాఁడా, ఓ చంద్రా, అమృతరూపంబగు కిరణతతిచే దేవతలకుం దృప్తిసేయునట్టియు, షోడశకలాభాసమానుండవైనట్టియు, రేవతీ నక్షత్రంబునకుం బతివైనట్టియు,నీ వెప్పుడు మమ్ముం గాపాడు మనియు ప్రార్థనము. అలంకారము పూర్వంబువలెనే యెఱుంగునది.

శ్లో॥ ధార్తరాష్ట్ర పరితోషణ దక్షం
కీర్తిభూషిత మహాం కవిసేవ్యం,
మత్స్యలాంఛనయుతం బలరామం
త్వాం నమామి శుచిమాన సమేతం. 3

టీ. హేదేవ=ఓ దైవమా, (అధ్యాహార్యము) ధార్త...దక్షం, ధార్తరాష్ట్ర=ధృతరాష్ట్ర సుతుఁడగు ధుర్యోధనుని యొక్క, పరితోషణ = సంతోష పెట్టుటయందు, దక్షం = సమర్థుఁడైనట్టి, అని బలరామ దేవపరము. ధార్తరాష్ట్ర = హంస విశేషములయొక్క, పరితోషణ = సంతోష పెట్టుటయందు, దక్షం = సమర్థమైనది అని మానససరఃపరము. కీర్తి భూషితం, కీర్తి = యశస్సుచేత, భూషితం = అలంకరింపఁ బడిన అని బలరామదేవ పరము, కీర్తి = బురదచేత, భూషితం =

అలంకరింపఁబడినది (అనఁగా అడుగున నడుసుతోఁగూడినదను ట) కవి సేవ్యం=కవీశ్వరులచేత సేవించఁదగిన, అని బలరామ దేవ పరము. కవి = నీటిపక్షులచేత, సేవ్యం = ఆశ్రయింపఁదగిన, అని మానససరః పరము. మత్స్యలాంఛనయుతం, మత్స్యలాం ఛన = ప్రద్యుమ్నునితో, యుతం = కూడికొనిన అని బలరా మదేవ పరము, మత్స్య = చేఁపలను, లాంఛన=చిహ్నముతో, యుతం = కూడికొనిన, అని మానససరః పరము. ఏతం = ఇటు వంటి, శుచిమానసం, శుచి = పరిశుద్ధమైన, మానసం = మన స్సుగల, శుచి=పరిశుద్ధమైన, మానసం=మానససరస్సైన, బల రామం = బలరామ రూపమును ధరించిన, త్వాం=నిన్ను, నమామి = నమస్కరించుచున్నాను.

చ. ద్రుతముగ ధార్తరాష్ట్ర పరితోషణదక్షతకీర్తి సంయుతా
త్మత కవిసేవ్యమానత సకత మ్మతిభాసురమత్స్యలాంఛనాం
చితతయు నొప్పియుండుట సుశీతలమానసతం దలిర్చునిన్
గుతుకముతోమదింగుదురుకొల్పి భజించెదనచ్యుతాగ్రజా.

తా ఓదేవా! ధార్తరాష్ట్ర పరితోషణ దక్షత్వముచే తను, కీర్తి భూషితత్వము చేతను, కవిసేవ్యత్వము చేతను మత్స్య లాంఛన యుతత్వముచేతను, నిర్మలమాన సత్వమునొంది యల రారు బలరామస్వరూపముం దాల్చిననీకు నమస్కారంబు లొ నర్చుచుంటిని.

శ్లో. కూలంకషాఘకాషంకరోతు సంకర్షణోద్య మమశీఘ్రం
త్రికరణశోధన నిపుణః కృపణస్య సదా ప్రపన్నస్య, 4

టీ. త్రికరణ శోధన నిపుణః, త్రికరణ = త్రికరణములయొక్క, శోధన = పవిత్రము చేయుటయందు, నిపుణః = నేర్పరియగు, సంకర్షణః = బలరాముఁడు, అద్య = ఇప్పుడు, శీఘ్రం= శీఘ్రముగా, కృపణస్య = దీనుఁడనైనట్టియు, సదా=ఎల్లప్పుడు, ప్రపన్నస్య = ప్రపత్తి నొందినట్టియు, మమ = నాయొక్క, కూలంకషాఘకాపం, కూలంకష = మిక్కుటమైన, అఘ = పాపములయొక్క, కాపం=నాశనమును, కరోతు=చేయుఁగాత.

చ. త్రికరణశోధనమ్ము పొన
    రింపఁగ నెంతయు దక్షుఁడై నయా
ప్రకటగుణుండు రాముఁడు ప్ర
    పన్నుఁడనుం గృపణుండ నైననా
దుకలుషరాశి నెంతయును
    దున్నికదుంగడు కూర్మి నాకు భా
వుకములు పెంపెలర్ప నుడి
    వ్రోనిసిరుల్ ఘటియించుఁగావుతన్.

తా. మనోవాక్కాయమ్ములను త్రికరణముల పరిశుద్ధి నొనర్ప దక్షుండగుబలరామ దేవుండిప్పుడు వేగంబ దీనుఁడనై నీవే దిక్కు, వేరొండు దిక్కులేదు, నాకు సర్వము నీవేయని ప్రపత్తిసేయుచున్న నాదు పాపమ్ములనెల్ల రూపడంచి త్రికరణ శుద్ధిం గూర్చి రక్షించుఁగాత.

శ్లో. పురుషోత్తమాగ్రగణ్యః
    స్వచ్ఛాత్మా ప్రబలభద్రదానాఢ్యః ।

శ్రేయః కురుష్వ రామో
వేంకటగురు రుచ్చకైస్సదా నస్త్వం ॥

టీ పురుషోత్తమాగ్రగణ్యః, పురుషోత్తమ = శ్రీకృష్ణుని యొక్క, అగ్రగణ్యః= అగ్రజుండవైనట్టియు. (భ్రాతయైన) అని బలరామదేవ పరము (పురుషోత్తమ = పురుషశ్రేష్ఠులలో, అగ్ర = ముందు, గణ్యః = గణనసేయఁదగినట్టియు అని వేంకట గురు పరము. స్వచ్ఛాత్మా, స్వచ్ఛ = తెల్లని, ఆత్మా = శరీరము గల, అని బలరామదేవ పరము; స్వచ్ఛ=నిర్మలమైన, ఆత్మా= మనస్సుగల,అని గురుపరము. ప్రబలభద్ర దానాఢ్యః. ప్ర= ప్రకృష్టమైన, బలభద్ర = బలభద్రుఁడవైనట్టియు, దానాఢ్యః దాన = ఈవిచేత, ఆఢ్యః = ఒప్పుచున్నట్టియు, [ప్రకృష్టః, బలభద్రః, ప్రబలభద్రః ప్రబలభద్రశ్చాసౌ, దానాఢ్యశ్చ, ప్రబల భద్ర దానాఢ్యః, అనిసమాసము] అని బలరామదేవ పరము. ప్రబల = గొప్ప, భద్ర = శుభములయొక్క, దాన = కలిగించుటయందు, ఆఢ్యః = సమర్థుఁడైన, అనిగురు పరము. వేంకట గురుః, వేంకట=వేంకటాద్రియందు,గురుః=పూజ్యుఁడైనట్టియు, లేక వేంకట = కృష్ణునకు, గురుః = పూజ్యుఁడవైనట్టియు, అని బల రామపరము. వేంకట=వేంకట అను పేరుగల గురుః = దేశికుఁ డవైనట్టియు అని గురుపరము. రామః = బలరాముఁడవైన త్వం = నీవు అని బలరామపరము. రామః = మనోహరుఁడవైన త్వం = నీవు, అని గురుపరము. సదా = ఎల్లప్పుడు, నః = మాకు, ఉచ్చకైః=గొప్ప,శ్రేయః=శుభములను,కురుష్వ=చేయుము. ప్రకృతాప్రకృతశ్లేషాలంకారము. మతాంతరంబునధ్వని.

క. పటుతరవిశదాత్మా ప్రా
    కటగుణ పురుషోత్తమా గ్రగణనీయా వేం
    కటగురురామ యొసఁగు ము
    త్కటశుభములు ప్రబలభద్ర దానవిద్రా!

తా. ఓ దేవ దేవా! శ్రీకృష్ణున కగ్రజుఁడవైనట్టియు, తెల్లని శరీరము గలిగినట్టియు బలముచేత శుభప్రదుఁడవు కావున బలభద్రుఁడను నామంబు గలిగినట్టియు, భక్తుల కోర్కెలం దీర్చుటయందు మిక్కిలి సమర్థుఁడవైనట్టియు, కృష్ణునకుం బూజ్యుఁడవైనట్టియు, రాముఁడవగు నీవు మాకెల్ల శుభంబుల నొసంగుమనియుఁ బురుషశ్రేష్ఠులలోఁ బొలుదొల్త పరిగణింపఁదగినట్టియు, నిర్మలమైన మనస్సుగలిగినట్టియు, ఆశ్రితులకు గొప్పశుభంబులుఁగూర్ప సమర్థుఁడవైనట్టియు వేంకటఅను గురువైన నీవు మాకెల్ల శుభంబులు సంధింపుమనియుఁదాత్పర్యము.

శ్లో. ప్రకృతి పదగుణోపి ప్రత్యయీ సాధువృత్తిః
    ప్రబలతరతమశ్శ్రీ రప్యనంతాత్మతత్వః।
    అపిబుధమధుపస్త్వం స్వచ్ఛవర్ణో నకృష్ణః
    కలయ ముసలపాణే పూత మాత్మీయచేతః ॥

టీ. ప్రకృతిపద = ప్రకృతి పదముయొక్క, గుణోపి=గుణములు కలిగినప్పటికిని, ప్రత్యయీ = ప్రత్యయము కలదియు. సాధువృత్తిః, సాధు=యోగ్యమైన (లౌకిక ప్రయోగార్హమైన) వృత్తిః = వృత్తిగలది, అనివిరోధము. ప్ర = ప్రకృష్టమైన, కృతి = కార్యములకు, పద = స్థానమైన, గుణోపి = గుణములు కలవాఁడవును, ప్రత్యయీ = జ్ఞానముకలవాఁడవును, సాధువృత్తిః, సాధు = యోగ్యమైన, వృత్తిః = వ్యాపారము కల

వాఁడవును, అని పరిహారము: లేక, అగుణోపి = నిర్గుణ బ్రహ్మ వైనను ప్రకృతిపత్, ప్రకృతి =మాయాసంబంధమును, పత్ = పొందినవాఁడవును, ప్రత్యయీ = హేతువుకలవాఁడవును, సాధువృత్తిః, సాధు = యోగ్యమైన, వృత్తిః = వృత్తులుకల వాఁడవును, అని విరోధము, ప్రకృతిపదగుణోపి, ప్రకృతి = త్రిగుణాత్మక ప్రకృతికి, పద = స్థానమైన, గుణోపి = గుణము లుకలవాఁడవును, ప్రత్యయీ = జ్ఞానము కలవాఁడవును, సాధువృత్తిః=యోగ్యమైన వ్యాపారముకలవాఁడవును, అని పరిహారము, అనంతాత్మతత్వః, అనంత = ఆద్యంతములులేని, ఆత్మతత్వోపి = పరమాత్మతత్వముగలవాఁడ వైనప్పటికిని, ప్రబలతర = అధికమైన, తమశ్శ్రీః=తమోగుణ సంపదకలవాఁడవు, అని విరోధము, అనంత=ఆదిశేషునియొక్క, ఆత్మతత్వః= ఆత్మస్వరూపుఁడవును, ప్రబలతరతమశ్శ్రీః, ప్రబలతర=మిక్కిలి అధికమైన, తమశ్శ్రీః = తమోగుణ సంపద కలవాఁడవును అని పరిహారము. బుధమధుపోపి, బుధ = నేర్పుగల, మధుపోపి తుమ్మెదవైనను, లేక బుధ = సర్వము తెలిసినవాఁడా, మధుపోపి = తుమ్మెదవైనను, స్వచ్ఛవర్ణః, స్వచ్ఛ = తెల్లని, వర్ణః = కాంతి, గలవాఁడవు. న కృష్ణః=నల్లనివాఁడవు కానట్టియు అని విరోధము. మధుపోపి = సురాపానము సేయు వాఁడవును, నకృష్ణః = కృష్ణభిన్నుఁడవు (బలరామరూపమున కృష్ణునికంటె వేరుగా నవతరించినవాఁడవు అని పరిహారము.) హే ముసలపాణే ! = ఓ బలరామదేవా ! ఇన, త్వం = నీవు, ఆత్మీయచేతః, ఆత్మీయ = నాసంబంధమైన, చేతః= మనస్సును, పూతం=పవిత్రమైనదానినిగా, కలయ=చేయుమా.

గీ. ప్రకృతిపదగుణాతఁదగియుఁ బ్రత్యయిత్వ
సాధువృత్తిత్వములతో నెసఁగి మరియు
నయ్యనంతాత్మతత్వుండవయ్యుఁ బ్రబల
తరతమశ్రీయుతుఁడవయి తద్దయు మధు
పత్వమున నొప్పియును స్వచ్ఛవర్ణయుక్తిఁ
జెంది కృష్ణేతరత్వమ్ము నొందిమిగుల
వసుధ నెసలారునట్టియో మునులపాణి
మమ్మ భవ్యాత్ములం జేసి మనుపుమయ్య.

తా. ప్రకృతి పదముయొక్క గుణము కలిగియుఁ బ్రత్యయ విశిష్టమైనదియు, లౌకిక ప్రయోగార్హమైన యర్థముకలదియునని విరోధము. (అనఁగాఁ గేవల ప్రకృతికినిఁ గేవల ప్రత్యయమునకును శాస్త్ర ప్రక్రియార్థంబై కల్పింపఁబడిన యర్థమే కాని సరియైన అనఁగా లౌకిక ప్రయోగార్హమైన యర్థంబు లేదు. ప్రకృతికిఁ బరముగా ప్రత్యయ ముండును గాని ప్రకృతియందు ప్రత్యయ ముండదు.) ప్రకృష్టమైన పనులకు స్థానమైన గుణములు కలవాఁడ వనియు, మంచి వ్యాపారము కలవాఁడవనియుఁ బరిహారము. లేక, నిర్గుణబ్రహ్మవైనను మాయాసంబంధము కలవాఁడవనియును, కారణవిశిష్టుఁడవనియును, వృత్తులు కలవాఁడవనియు విరోధము బలరామరూపంబునఁ బుడమిలో నవతరించిన వాఁడవనియు, జ్ఞానసాధుచరితములుగలవాఁడ వనియుఁ బరిహారము. ఆత్మరూపుఁడవయ్యు దమోగుణము కలవాఁడవని విరోధము. శేషావతారంబవనియుఁ దమోగుణప్రధానుఁడ వనియు పరిహారము. తుమ్మెదవయ్యుఁ దెల్లనికాంతి కలవాఁడవనియు, నల్లనికాంతి లేనివాఁడ

వనియు విరోధము సురాప్రియుఁడవనియుఁ దెల్లని కాంతి కలవాఁడవనియు, కృష్ణాగ్రజుఁడవై యవతరించితివనియును పరిహాసము. ఇట్టి బలరామదేవా! నీవు మమ్ము పరిశుద్ధచిత్తులం జేసి సంతతంబుం గాపాడుము.

శ్లో. ఆకాశ దేహభాసోనంతాత్మా త్వం నభోన్వితో నాకః
పుష్కరనయనో రామస్సుఖాంచితో దేవ దేహి నస్సౌఖ్యం

టీ. హే దేవ=ఓదైవమా! ఆకాశ దేహభాసః, ఆ=అంతటను, కాశ = రెల్లుపుష్పమువలె తెల్లనైన, దేహ = శరీరముయొక్క, భాసః=కాంతిఁ గలిగినట్టియు, అనంతాత్మా, అనంత=ఆదిశేషుని యొక్క, ఆత్మ=స్వరూపమైనట్టియు, నభోన్వితః, నభః=శ్రావణ మాసముతో, అన్వితః=కూడికొనినట్టియును (జన్మ చేత శ్రావణ మాసముతోఁ గూడికొనిన, అనఁగా శ్రావణ మాసమునందు జన్మించిన) నాకః=దుఃఖము లేనట్టియు, పుష్కరనయనః, పుష్కర=పద్మములవంటి, నయనః=నేత్రములు గలిగినట్టియు, సుఖాంచితః, సుఖ=నిత్యసుఖములతో, అంచితః=ఒప్పుచున్నట్టియు, రామః=బలరాముఁడవైన, త్వం=నీవు, నః=మాకు, సౌఖ్యం=సుఖమును, దేహి=ఒసఁగుము.

శా. ఆకాశాధికహృద్య దివ్యతనుభాసా నిత్యరాజత్సుఖా
నీకా పుష్కరనేత్రభాస్వరనభోన్వీతా మహానంతరూ
పా కారుణ్యగుణాబ్ధి సర్వవిభు దేవా నాకవర్యస్తుతా
మాకున్ దివ్యసుఖమ్ము గూర్చి బలరామా వేగ గాపాడుమీ.

తా. ఓ దేవదేవా! రెల్లుపువ్వువలె తెల్లనిమైచాయఁ గలిగినట్టియు, ఆదిశేషావతారంబైనట్టియు, శ్రావణమాసంబున

బుడమిపై నవతరించినట్టియు, దుఃఖదూరుఁడ వైనట్టియు, పద్మాత్ముఁడవైనట్టియు, శాశ్వతసుఖయుతుఁడవైనట్టియు, బలరామ రూపమ్మున విరాజిల్లుచున్న నీవు మాకెల్లసుఖమ్ములు సంధించి రక్షించుము ఇందు ఆకాశ, అనంత, నభః, నాక, పుష్కర, ఖ, అని ఆకాశపర్యాయ పదమ్ములువచ్చునట్లు కూర్చుట చమత్కారము.

శ్లో. ఆత్మభూభరితభావుకభావం ధీరసస్యపృథువృద్ధిలసంతం
ధేనుకోద్ధరణమిద్ధమనంతంనౌమిరామశుభశాలివసుంత్వాం.

టీ. హేరామ=ఓ బలరామదేవా! ఆత్మ... భావం, ఆత్మభూ=ప్రద్యుమ్నరూపమన్మథునియందు, భరిత=పరిపూర్ణమైన, భావుక=శుభప్రదమైన, భావం=అభిప్రాయము గలిగినట్టియు అని బలరామపరము. ఆత్మ=తనయొక్క, భూ=భూమియందు, భరిత=నిండిన, భావుకభావం, భావుక=శుభప్రదమైన, భావం=భావముగలది (సత్తు) అని శాలివసుపరము. ధీరసస్య... సంతం ధీర=పండితులనే, సస్య=సస్యములయొక్క, లేక సస్యమువలె సర్వానందప్రదులగు పండితులయొక్క, పృథు=గొప్ప, వృద్ధి=వృద్ధిచేత, లసంతం = ప్రకాశించుచున్న, అని బలరామదేవ పరము. ధీర=మనోహరములగు, సస్య=సస్యములలో, పృథు=గొప్ప, వృద్ధి=వృద్ధిచేత, లసంతం = ప్రకాశించుచున్న అని శాలివసుపరము. ధేనుకోద్ధరణం, ధేనుక=ధేనుకాసురుని, ఉద్ధరణం=సంహరించినటువంటి అని బలరామదేవపరము. ధేనుక=ధేనువులను (స్వార్థమున కప్రత్యయము) ఉద్ధరణం=పోషించునది అని శాలివసుపరము. ఇద్ధం=ప్రకాశించుచున్న అని యుభయపరము,

అనంతం=శేషావతారమైనట్టి అని బలరామదేవపరము, అనం తం=విశాలమైనట్టి, అని శాలివసుపరము, శుభ శాలివసుం, శుభ =శుభములచేత, శాలి=ప్రకాశించుచున్న, వసుం=వసువులుకల, (వసుపదము దేవతలకుపలక్షణము) లేక శుభ=శుభములచేత, శాలి=ఒప్పుచున్న, వసుం=వసుదేవుడుకల, త్వాం=నిన్ను, నౌమి =నుతియించుచున్నాను అని బలరామదేవపరము. శుభశాలి వసుం, శుభ=శుభప్రదమైన శాలి=వరియను, వసు=ధనమైన త్వాం=నిన్ను, నౌమి=నుతియించుచున్నాను అని శాలివసు పర ము. ఈయర్థమున రామ పదమునకు మనోహరమైనదానా, అని యర్థము.

తే గీ. ధీరవరసస్యసత్పృథుల వృద్ధియుతు నాత్మ
భూభరిత భావుకస్వభావు నలధేను
కోద్ధరణు నిత్యజలలసద్ద్యుతి ననంతు
నిరతశుభశాలిను రాము నిను నుతింతు.

తా. ఓ బలరామదేవా! ప్రద్యుమ్న రూపమన్మథుని యందు, శుభప్రదమగు భావముకలిగినట్టియు, పండితులయొ క్క వృద్ధిచేత, అనగా బండితులకభివృద్ధి నొసంగుటచే నెంత యు విరాజిల్లుచున్నట్టియు, ధేనుకాసురుని సంహరించినట్టియు, మిక్కిలి ప్రకాశించుచున్నట్టియు, ఆదిశేషావతారంబైనట్టియు, రాక్షస సంహారముచే నెల్ల దేవతలకు మిక్కిలి సౌఖ్యమును, గూర్చినట్టియు, లేక శుభములచే విరాజిల్లుచున్న వసుదేవుడు కలిగినట్టియు, నిన్నుంగొని యాడుచుంటిని అనియును, ఓ మనో హరమైనదానా! స్వాశ్రయమగు భూమికిం గూర్పబడిన శుభ

భావము కలిగినట్టియు మనోహరములగు సస్యములలో మిక్కిలి వృద్ధిచేత ప్రకాశించుచున్నట్టియు, ధేనువులఁ బోషించునట్టియు, విశాలమైనట్టియు, శాలిరూప ధనమైన నిన్నుం గొని యాడుచుంటి ననియునుఁ దాత్పర్యము.

శ్లో. మిత్రాపత్య ద్వేష్యపి, మిత్రాపత్యప్రియో మధుపః
అపిమధు కాలముదాఢ్య, శ్శేష స్త్వం దేహ్యా శేషభద్రాణి.

టీ. హేరామ = ఓబలరామదేవా! మిత్రా పత్య ద్వేష్యపి, మిత్ర = సూర్యునియొక్క, అపత్య = కొడుకగు కర్ణునకు, ద్వేష్యపి = వైరివైనను. మిత్రాపత్య = కర్ణునకు, ప్రియః = ప్రియమైన వాఁడవు అని విరోధము. మిత్రా పత్య ప్రియః = ప్రియమైన మిత్రులు, అపత్యములుఁ గలవాఁడవు, లేక ప్రియమైన మిత్రవింద సంతానము కల వాఁడవు అనిగాని పరిహారము. పరిహారార్థమున నెల్లెడ నపిశబ్దము సముచ్చయార్థకము. [వ్యా. "వా ప్రియస్య" అను సూత్రముచేత, విశేషణంబగు ప్రియశబ్దమునకు వికల్పముగా పరనిపాతము.] మధుపోపి=మధుపతివైనను, మధుకాలముదాఢ్యః, మధుకాల = మధుసంహారకుని యందు, ముత్ = సంతోషముచేత, ఆఢ్యః = ఒప్పుచున్న అని విరోధము, మధుపోపి = సురాపానము సేయువాఁడవును మధుకాల = మధ్వసురుని సంహారించిన కృష్ణునియందు, ముత్, ఆనందముచేత, ఆఢ్యః = ఒప్పుచున్న వాడవును అని పరిహారము. (విరోధార్థమున మధుంపాతీతి, మధుపః అనియుఁ బరిహారార్థమున మధు పిబతీతి, మధుపః, అనియును వృత్తి) శేషః= శేషుఁడ వైననీవు, అశేషభద్రాణి = శేషభిన్న భద్రములను,

దేహి = ఇమ్ము, అనియు విరోధము. శేషః=ఆది శేషుని య
తారమైనట్టియు, త్వం = నీవు, అశేష భద్రాణి అశేష = సమ
స్తమైన, భద్రాణి = శుభములను, దేహి = ఒసంగుము అ
పరిహారము. విరోధాభాసాలంకారము.

చ. స్థిరముగ మిత్రసంతతికి
ద్వేషివి యయ్యును మిత్రసంతతిం
గురించి ప్రియమ్ము నెంతయును
గూరుతు వామధుపుండవయ్యు న
బ్బురమయి యొప్పఁగా సతత
మున్ మధుకాలముఁ దన్వితుండ వై
వరలుదు వట్టి శేషతను
భాసి యొసంగు మశేషభద్రముల్.

తా. ఓ బలరామదేవా! మిత్రాపత్య ద్వేషివైనను మిత్రాపత్యప్రియుండ వనియును, మధుపుఁడవైనను, మధుకా ముఁదాఢ్యుఁడవనియును విరోధము. కర్ణుని యందు ద్వేషము గలవాఁడవును, కృష్ణుని యష్టమహిషులలో నొక్కతె యగు మిత్రవింద కుమారుని యందు ప్రేమకలవాఁడవును, సురాప్రి యుఁడవును, కృష్ణునియం దెంతయు సంతోషము కలవాఁడవున అని పరిహారము. ఆదిశేషుని యవతారంబునగు నీవు నాకుఁ శుభంబులు సమకూర్చి ప్రోవుము అని భావము.

శ్లో. సాంబశివ మస్తకాంచత్వాదో
నక్షత్రనాయకో యస్స్యాత్ ।

శశలక్ష్మలక్షితో మే

బలరామేందుః కరోతు కళ్యాణమ్॥

టీ. యః = ఎవఁడు, సాంబశివ మస్తకాంచత్పాదః, సాంబ = సాంబునియొక్క, శివ = శుభమైన, మస్తక = శిరస్సునందు, అంచత్ =ఒప్పుచున్న, పాదః=చరణములు గలవాఁడు (సాంబునిచే శిరసావహింపఁబడిన పాదములుగల) అని బలరామదేవ పరము. సాంబశివ = మహేశ్వరుని, మస్తక = శిరస్సునందు, అంచత్ =ఒప్పుచున్న, పాదః=కిరణములుగలవాఁడు, అని చంద్రపరము. నక్షత్రనాయకః నక్షత్ర = క్షత్రియభిన్నులగు యాదవులకు, నాయకః = ప్రభువు (నఞర్థస్య నశబ్దస్య సుప్సుపేతిసమాసః = నఞర్థముఁగల నశబ్దమునకు, సహసుపా అను సూత్రముచేత సమాసము) అని బలరామదేవ పరము. నక్షత్ర = చుక్కలకు, నాయకః = పతి అని చంద్రపరము. స్యాత్ = అగుచున్నాఁడో, సః = అట్టి, (అధ్యాహారము) శశలక్ష్మ=లక్షితః, శశలక్ష్మ=చంద్రుఁడువలె, లక్షితః=చూడఁబడుచున్న (చంద్రుఁడువలె తెల్లని కాంతిఁ గలవాఁడును, చంద్రుఁడువలె నెల్లరకు నాహ్లాదము కలిగించువాఁడును అనిభావము.) అని బలరామపరము. శశ=చెవులపిల్లియను, లక్ష్మ = చిహ్నముతో, లక్షితః = కూడికొనిన, అని చంద్రపరము. బలరామేందుః, చంద్రునివంటి బలభద్రుఁడు, మే=నాకు, కళ్యాణం= శుభమును, కరోతు = చేయుఁగాక అని బలరామపరము. బలరామునివంటి చంద్రుఁడు నాకు శుభములొసంగుఁ గాత మని చంద్రపరము.

మ. అలరారన్ సతతంబు సాంబశివమూ
ర్ధాంచత్ప్రపాదుండు మి
త్రలసత్సంగమ భాసురుండు సకల
ప్రహ్లాదదివ్యప్రభా
కలితుండున్ శశలక్ష్మ లక్షితుఁడు న
క్షత్రాధినాథుండు నా
బలరామామృతరశ్మి మా కఖిల
భవ్యంబుల్ ప్రసాదించుతన్.

తా. సాంబశివ మస్తకాంచత్పాదుండును, నక్షత్ర నాయకుండును శశలక్ష్మలక్షితుండు నగుబలరామచంద్రుఁడు మాకెల్ల శుభంబుల నొసఁగుఁగాక.

ఇతి బలరామావతారః.

బలరామావతార స్తుతి సమాప్తము.

---

# దశావతారనుతిశతకే శ్రీకృష్ణావతారః

---

శ్లో. మాధవో మాధవారాధ్యనందనందన సుందర
అవ మామవమానేభ్య స్సోగ్రసేనోగ్రసేనయుక్.

టీ. హే మాధవ=ఓ లక్ష్మీపతీ! ఉమాధవారాధ్య; ఉమాధవ=పార్వతీపతిచేత,ఆరాధ్య=పూజింపఁ దగినవాఁడా,నందనందన=నందునియొక్క కుమారుఁడా, సుందర=దివ్యసుందరశరీరుఁడా, సోగ్రసేన=భయంకరమైన సేనతోఁగూడినవాఁడా, (ఉగ్రాచసా సేనాచఉగ్రసేనా, ఉగ్రసేనయా సహ వర్తత ఇతి సోగ్రసేనః, తస్యసంబుద్ధిః సోగ్రసేన,) అని సమాసము ఉగ్రసేనయుక్ ఉగ్రసేన=ఉగ్రసేనునితో, యుక్=కూడికొనినవాఁడా, (ఉగ్రసేనుఁడనఁగాఁ గంసునితండ్రి కృష్ణునిమాతామహుఁడు) త్వం = నీవు మాం=నన్ను, అవమానేభ్యః=అవమానములవలన, సూ.ల్యబ్లోపే కర్మణ్యధికరణే చ, అను సూత్రముచేత పంచమి (అవమానములఁ దొలగించి) అవ=రక్షింపుమా.

మ. దురితాత్ముం డగుకంసు నుగ్రముగ వే
తునాన్మడి యవ్వానికిన్
గురుఁడై గుందెడునుగ్రసేనున కొగిన్
క్షోణీశ్వరత్వంబు నా

దర మొప్పార నొసంగి యాత్మపితృబం
ధంబున్ దొలంగించి యీ
శ్వరముఖ్యేడ్యుఁడ వై ధరన్ దనరు కృ
ష్ణా! మమ్ముఁ గాపాడుమీ.

తా. ఓలక్ష్మీనాయకా ! శివునిచే నారాధించఁదగిన వాఁడా! నందుని ముద్దుగొడుకా, దివ్యసుందరవిగ్రహా, శత్రు భీకరనారాయణబల సమన్వితా, కంసుని సంహరించినవాని తండ్రియగు నుగ్రసేనునకు రాజ్యంబొసంగిన వాఁడా, నీవు మాకెట్టి దుస్థితిలేకుండఁజేసి యెల్లప్పుడుం గాపాడుము.

శ్లో. మాధవోప్యవనదోహదదీక్షః
కృష్ణమూర్తిరపి భాసితకీర్తిః।
దేవదేవ సదసోప్యదరోరం
మంక్షుమామవసమోప్యసమస్త్వం॥

టీ. హేదేవదేవ=వేల్పులకు వేల్పైనవాఁడా, మాధవోపి= వసంతుఁడవైనను, అవనదోహదదీక్షః=వనమును పుష్పాదివృద్ధిచే ప్రకాశింపఁజేయుటయందు దీక్షకలవాఁడవు కావున (వనస్యదో హదం, వనదోహదం, వనదోహదే దీక్షాయస్య సః వనదోహద దీక్షః, న వనదోహదదీక్షః, అవనదోహదదీక్షః, లేక వనదో హదేదీక్షా, వనదోహదదీక్షా, నవిద్యతే వనదోహదదీక్షా, యస్య సః అవనదోహదదీక్షః, అని సమాసము) అని విరో ధము, మాధవోపి, మా = లక్ష్మీదేవికి, ధవోపి = భర్త వును, అవనదోహదదీక్షః, అవన = రక్షించుటయందైన,

దోహద=ఇచ్ఛయందు, దీక్షః=పూనికకలవాఁడవు లేక, అవన=రక్షించుటయను, దోహద=దోహదమందు, దీక్షః = దీక్షకల వాఁడవు అనిగాని పరిహారము. కృష్ణమూర్తిరపి, కృష్ణ=నల్లని, మూర్తిరపి=శరీరముకలవాఁడవైనను, భాసితకీర్తిః, భా=కాంతి చేత, సిత=తెల్లనివాఁడవని, కీర్తిః=ప్రఖ్యాతిగలవాఁడవు, అని విరోధము, భాసిత=ప్రకాశింపఁజేయఁబడిన, కీర్తిః=యశస్సుగల వాఁడవు, అని పరిహారము. సదరోపి=దరముతోఁగూడినవాఁడవైనను, అదరః=దరములేనివాఁడవు, అనివిరోధము. సదరోపి=(పాంచజన్యమను) శంఖముతోఁగూడిన వాఁడవును (దరేణ సహావర్తత ఇతి సదరః అని సమాసము) అదరః=భయములేని వాఁడవును (నవిద్యతే దరం యస్యసః అదరః అని సమాసము) అని పరిహారము. సమోపి=సముఁడవైనను, అసమః=సముఁడవు కావు. అని విరోధము. సమోపి=అందరియందు సమబుద్ధికల వాఁడవును, లేక సమః = లక్ష్మీదేవితోఁగూడిన వాఁడవును (మయాసహావర్తతతి సమః మయా, అనునది, మాశబ్దము యొక్క తృతీయైకవచనాంతరూపము, లక్ష్మితో, ననియర్థము) అసమః నిరుపమానుఁడవును (న విద్యతే సమః యస్యసః అసమః) అని పరిహారము. ఏవత్వం = నీవు, మంక్షు=శీఘ్రముగా, మాం=నన్ను, అలం=అత్యంతము, అవ=రక్షింపుమా! విరోధాభాసాలంకారము.

చ. ఇల సదగుండవయ్యునదరేడ్యత నొందియు మాధవుండవై
యలరెడువాఁడవయ్యునధికావనదోహదదీక్షితుండవై
నలువుగ కృష్ణమూర్తివయినన్ ఘనభాసితకీర్తివై సమ
త్వలలితమూర్తివై యసమతందగుశ్రీహరిమమ్ముఁబ్రోవుమా.

తా. ఓ దేవ దేవా! వసంతుఁడవైనను, వనమును పుష్పాదివృద్ధిచేఁ బ్రకాశింపఁజేయుటయందు దీక్ష లేని వాఁడవనియు నల్లనిమేను గలవాఁడవైనను కాంతిచేతఁ దెల్లనివాఁడ వను కీర్తిగలవాఁడవనియును, దరముతోఁ గూడినవాఁడ వైనను దరము లేనివాఁడ వనియును, సముఁడవైన నసముఁడ వనియును విరోధస్ఫురణము. లక్ష్మీదేవికిం బతివియు భక్తులనెల్లరను రక్షించుటయందు మిక్కిలి కోర్కెఁగలవాఁడవు నని యును, నీలమేఘశ్యామ విగ్రహుండవును, ఎల్లెడం బ్రకాశింపఁ జేయఁబడిన కీర్తిగలవాఁడవు ననియును, పాంచజన్యం బనుశంఖంబు దాల్చువాఁడవును, ఏవిధమైన భయము లేని వాఁడవుననియును, ఎల్లప్పుడు లక్ష్మీదేవితో విరాజిల్లువాఁడవును, నిరుపమానుఁడవు ననియును పరిహారము. ఇట్టి నీవు మమ్ము వేగంబ కోర్కెలందీర్చి రక్షింపవే యని ప్రార్థనము.

శ్లో. సాగమవ్రజ మనంగ సంగతం
మాధవాఢ్య ను మనస్సమన్వితం।
సోద్ధవం సవనమాల మన్వహం
త్వాం భజే ద్విజసుశర్మదాన్వహం॥

టీ. ద్విజసుశర్మద, ద్విజ = విప్రులకు, సు = యోగ్యమైన, శర్మ = సుఖమును, ద = ఇచ్చువాఁడా, అని కృష్ణపరము. ద్విజ = పక్షులకు, సు = యోగ్యమైన, శర్మ = సుఖమును,

ద = ఇచ్చువాఁడా, అని వసంతపరము, మాధవా = ఓ లక్ష్మీ పతీ! అని ప్రస్తుతార్థము, మాధవా=ఓ వసంతుఁడా, అని య ప్రస్తుతార్థము. సాగమవ్రజం = శాస్త్ర సమూహములతోఁ గూడిన (ఆగమానాంవ్రజః, ఆగమవ్రజః, ఆగమవ్రజేన సహ వర్తత ఇతి సాగమవ్రజః; తం సాగమవ్రజం, అని సమాసము) అని కృష్ణపరము, చెట్లయొక్క సమూహముతోఁ గూడిన (అగమానాంవ్రజః. అగమవ్రజః, అగమవ్రజేన సహవర్తత ఇతి, సాగమవ్రజః, తం సాగమవ్రజం అని సమాసము) అని వసంత పరము, అనంగసంగతం, అనంగ=ప్రద్యుమ్నునితో, సంగతం= కూడికొనిన అని కృష్ణపరము, అనంగ = మన్మథునితో, సంగతం = కూడికొనిన అని వసంతపరము, ఆఢ్యసుమనస్స మన్వితం, ఆఢ్య=సంపన్నులగు, సుమనః=పండితులతో, సమ న్వితం = కూడికొనిన లేక, ఆఢ్య = శ్రేష్ఠమైన, సు=యోగ్య మైన, మనః = మనస్సుతో సమన్వితం = కూడికొనిన అని గాని కృష్ణపరము. ఆఢ్య = ప్రశస్తమైన, సుమనః = పువ్వు లతో, సమన్వితం=కూడికొనిన, అని వసంతపరము, సోద్ధవం= ఉద్ధవునితోఁగూడిన (కృష్ణుని పిన తండ్రి ఉద్ధవుఁడు) అని కృష్ణ పరము. ఉత్సవములతోఁగూడిన (వసంతర్తువున, వసంతోత్స వము సేయుదురు. ని.మహ ఉద్ధవ ఉత్సవః అని అమరము.) లేక, సోద్ధవం=యజ్ఞములతోఁగూడిన (ఉత్ ఉద్గతాఃహవాః ఉద్ధవాః. ఉద్ధవైః సహవర్తత ఇతి సోద్ధవః తం సోద్ధవం అని సమాసము.

పావనము అనఁగా యజ్ఞముం) అని గాని వసంతపరము. సవనమాలం= వనమాలతోఁగూడిన (వైజయంతితోఁగూడిన) అని కృష్ణపరము. వనపఙ్క్తితోఁగూడిన అని వసంతపరము. త్వాం=నిన్ను, అను = అనుసరించి, అహం = నేను, అన్వహం=ప్రతిదినమందు, భజే = సేవించుచున్నాను.

చ. అవితవహాగమవ్రజు నకనంగసమన్వితు నిస్తులోల్లస
న్నవవనమాలునాఢ్యసుమనః ప్రవిరాజిత భవ్యమూర్తి సో
ద్ధవుఁ దదభీష్టదివ్యఫలకల్పిత సౌఖ్యయుత ద్విజాళి మా
ధవు నిను మోదమొప్పసతతమ్ము భజింతు నభీష్టసిద్ధికిన్.

తా. విప్రులకు మిక్కిలి సౌఖ్యమునిచ్చునట్టి యో లక్ష్మీనాయకా! సమస్త శాస్త్రపారంగతుఁడవైనట్టియు, పుత్రుండుగావున ప్రద్యుమ్నునితోఁ గూడినట్టియు, నెల్లప్పుడు మంచిహృదయముగల పండితులతోఁ గూడి యుండునట్టియు, పినతండ్రియగు నుద్ధవునితోఁ గూడుకొనునట్టియు, వనమాలను ధరించునట్టియు, నిన్నెల్లప్పుడు నేను సేవించుచుంటిననియు, పక్షులకు మిక్కిలి సౌఖ్యముఁ గూర్చునట్టియో వసంతుఁడా! వృక్షములకు వృద్ధి గలిగించునట్టియు, చెలికాఁడుగావున మన్మథునితోఁ గలసి యుండునట్టియుఁ బ్రశస్తమైన యలరులతో నలరారునట్టియు, నుత్సవములతోఁ గూడునట్టియు, లేక యజ్ఞములతోఁ గూడుకొనునట్టియు (వసంతర్తువులో యజ్ఞములు సేయుట వేద ప్రసిద్ధము) వృక్షపఙ్క్తులతోఁ గూడునట్టియు, నిన్నెల్లప్పుడు సేవించుచున్నా ననియును భావము.

శ్లో. కంసారే సంసారే నిస్సారే సార మద్య పశ్యామి।
కాసారజాక్ష శరణం సారసనిలయా ప్రియస్య తే స్మరణం॥

టీ. హేకంసారే = కంసుని సంహరించినవాఁడా! కాసార జాక్ష = పుండరీకాక్షుఁడా, (కృష్ణుఁడా) అద్య = ఇప్పుడు, నిస్సారే = సారములేని, సంసారే = సంసారమందు. సారస నిలయా ప్రియస్య, సారస = పద్మము, నిలయా = నివాసస్థానముగా గల, లక్ష్మీదేవియొక్క, ప్రియస్య = మనోహరుఁడవగు (భర్తవగు) తే = నీయొక్క, స్మరణం=స్మరించుటచే శరణం= రక్షకమునుగాను, సారం=శ్రేష్ఠమైనదానినిగాను, లేక శరణం= రక్షకమైన స్మరణం = స్మరించుటనే, సారం = శ్రేష్ఠమైనదాని నిగాను, పశ్యామి = చూచుచున్నాను.(తలఁచుచున్నాను)

చ. అనుపమకీర్తి పూరిత నిరంతజగత్పరిణాహ ఫుల్ల ప
ద్మనయన కంస దుష్టగుణ మారణ పుష్టసమస్తవిష్టపా
యనయము సారహీనమయినట్టి భవమ్మదియందు శ్రీనివా
సునినుస్మరించుటొక్కటియె సూశరణంబన సారమయ్యెడిన్.

తా. ఓ కృష్ణా ! నిస్సారంబగు నీ సంసారంబందు లక్ష్మీనాయకుఁడ వగు నిన్ను స్మరించు టొక్కటియే రక్షకంబుగావు న సారంబై తోఁచుచుండెనని భావము.

శ్లో. అబ్జాభిఖ్యావిధ్వభిఖ్యాపదైతా
రాధానాథ స్సత్సమాజోపసేవ్యః।
దోషోద్ధర్తా సోమతి శ్రీముకుందో
హంసస్వచ్ఛస్వస్వరూపామృతాత్మా॥

టీ. అబ్జా ... దైతా, అబ్జాభిఖ్యా,అబ్జ=శంఖముయొక్క,అభి ఖ్యా=కాంతిని, విధు=విధు, అను అభిఖ్యా=పేరుయొక్క. పద= పదమును,ఏతా=పొందినట్టి, అని కృష్ణపరము.అబ్జాభిఖ్యా-అబ్జ= అబ్జ, అను, అభిఖ్యా=నామముయొక్కయు విధ్వభిఖ్యా, విధు అను, అభిఖ్యా=నామముయొక్కయు పద=పదములను, ఏతా= పొందినట్టి,అనిచంద్రపరము. (ఏతా యనునది ఇణ్=గతౌ అను ధాతువునకు తృన్ ప్రత్యయముచేయఁగానైనరూపము) రాధా నాథః=రాధయనుగోపాంగనకు బతియైనట్టియు (రాధామనోహ రుఁడు) అనికృష్ణపరము. రాధా=విశాఖానక్షత్రమునకు, నాథః= పతియైనట్టి, అని చంద్రపరము, సత్సమాజోపసేవ్యః, సత్=సజ్జ నులయొక్క, సమాజ=సమూహముచేత, ఉపసేవ్యః=సేవించఁద గినట్టి అని కృష్ణపరము, సత్=నక్షత్రములయొక్క, సమాజ= సమూహముచేత, ఉపసేవ్యః=సేవించఁదగిన, అనిచంద్రపరము, దోషోద్ధర్తా, దోష=పాపములను, ఉద్ధర్తా=నశింపఁజేయునట్టి, అని కృష్ణపరము, దోషా=రాత్రిని, ఉద్ధర్తా=ఉద్ధరించునట్టి (ప్రకా శింపఁజేయునట్టి) అని చంద్రపరమ (కృష్ణపరమున ఉత్ హరతీతి, అనియును, చంద్రపరమున,ఉత్, ధరతీతి యనియువృత్తి) హం సస్వచ్ఛ స్వస్వరూపః, హంస=హంసవలె, స్వచ్ఛ=నిర్మలమైన, స్వ=తనయొక్క, స్వరూపః=స్వరూపముగల, లేక హంస=పరమ హంసలకు, (యోగివిశేషులు) స్వచ్ఛ=ప్రకాశించు, (గోచర మైన,) స్వ=తనయొక్క,స్వరూపః=రూపముగల (పరమహంసైక వేద్యస్వరూపుఁడు) లేక,హంస=సూర్యునియందు, స్వచ్ఛ=స్ఫుట మైన (ప్రకాశించు) స్వతనయొక్క, స్వరూపః = స్వరూపము గల (సూర్యమండలవర్తీనారాయణః, అను వాక్యముచే

సూర్యమండలమందు (ప్రకాశించువాఁడు) అని గాని కృష్ణునిప రము, హంస = హంసవలె, స్వచ్ఛ=తెల్లని, స్వ=తనయొక్క, స్వరూపః=ఆకారముగల, అని చంద్రపరము. అమృతాత్మా, అమృత=నాశనము లేని, ఆత్మా=స్వరూపముగల, అనిగాని, లేక అమృత=నశింపని, ఆత్మా=ఆత్మయైన (పరమాత్మయైన) అని గాని లేక, అమృతాత్మా=మోక్షస్వరూపుఁడైన అనిగానికృష్ణ పరము, అమృత=సుధామయమైన, ఆత్మా=దేహముగల, అని చంద్రపరము, శ్రీముకుందః=శ్రీకృష్ణుఁడు, సోమతి=చంద్రుఁడువలె నాచరించుచున్నాఁడు. శ్లేషసంకీర్ణమైన యుపమాలంకారము.

మ. కడలిం బొల్చెడువాఁడు నబ్జసదభి
ఖ్యా విధ్వభిఖ్యా పదా
ఢ్యుఁడు రాధావిభుఁడుం దమఃప్రచుర దో
షోద్ధర్త సత్సేవ్యుఁడున్
జడజాతాధిక తాపకారకుఁడు హం
సస్వచ్ఛ దివ్య స్వరూ
పుఁడు శుద్ధామృతమూర్తి శ్రీశుఁ డలసో,
ముం బోలి వర్ధిల్లెడున్.

తా. ఓకృష్ణా! అబ్జాభిఖ్యావిధ్వభిఖ్యాపదయుతుఁడవును, రా ధామనోహరుఁడవును, సత్సమాజసేవ్యుఁడవును, దోషోద్ధర్తవును, హంసస్వచ్ఛస్వస్వరూపుఁడవును నమృతాత్ముఁడవు నగునీవు ఏతాదృగ్గుణవిశిష్టుఁడగు చంద్రునింబోలి విరాజిల్లుచు, నెల్లర నానందింపఁజేయుచు నుంటివి.

శ్లో. నిర్జితార్జున సమృద్ధిరపి త్వం
నిర్జరేంద్రతనయార్జునమిత్రం।
గర్జితారి పరిహారనిసర్గో
ప్యార్జితారిరవ కేశవ మేశః॥ 6

టీ. హే కేశవ=ఓకృష్ణా! నిర్జి ... రపి, నిర్జిత=జయింపఁబడిన, అర్జున=అర్జునునియొక్క, సమృద్ధిరపి=సమృద్ధిఁగలవాఁడవై నను, నిర్జ ... మిత్రం, నిర్జరేంద్రతనయ=దేవేంద్రునికొడుకగు, అర్జునునకు, మిత్రం=స్నేహితుఁడవైన అని విరోధము, నిర్జిత=జయింపఁబడిన (కూల్చఁబడిన) అర్జున=మద్దిచెట్లయొక్క, సమృద్ధిరపి, ఔన్నత్యముఁగలవాఁడవును, నిర్జరేంద్రతనయ=దేవేంద్రుని కుమారుఁడగు, అర్జున=పార్థునకు, మిత్రం=చెలికాఁడవైనట్టియు, అని పరిహారము, గర్జి ... ర్గోపి, గర్జిత=సింహనాదము చేయునట్టి, అరి=శత్రులయొక్క, పరిహార=నశింపఁజేయుటయే, నిసర్గోపి= స్వభావముగాఁ గలవాఁడ వైనను, ఆర్జితారిః, ఆర్జిత=సంపాదింపఁబడిన, అరిః=శత్రువులుగలవాఁడవు, అని విరోధము, ఆర్జిత= సంపాదింపఁబడిన, అరిః=చక్రముగలవాఁడవు (సుదర్శనము) అని పరిహారము. మేశః=లక్ష్మీనాయకుఁడవైనట్టి, త్వం=నీవు, మాం= నన్ను అవ=రక్షింపుము. విరోధాభాసాలంకారము.

ఉ. అర్జునవృద్ధిభంజకుఁడ
వయ్యును ధారుణిసంతతంబున

య్యర్జుననందుఁగూర్చు చెలి
వై కడు నచ్చెరుపాటు సేయుచున్
గర్జదరిచ్ఛటాప్రసభ
కర్తనదీక్షితవృత్తివయ్యు ని
త్యార్జిత భూరి దీవ్య దరి
వై తగుశ్రీపతి మమ్ము బ్రోవుమీ!

తా. ఓశ్రీకృష్ణా! కూల్పంబడినయర్జున సమృద్ధిఁగలవాఁడవైనను, అర్జునమిత్రుఁడవనియు, అరిపరిహారస్వభావుఁడవైనను ఆర్జితారివనియు విరోధస్ఫురణము, కూల్చఁబడినమద్దిచెట్లయొక్కయౌన్నత్యముఁ గలిగినట్టియు, (తల్లిచే రోటంగట్టఁబడి రోటితోఁగూడ శాపవశంబుననట్లున్న మద్దిచెట్లమధ్యంబుననుండి పరుగిడి యాచెట్లంగూల్చినట్టియు) ఇంద్రతనయుండైన పార్థునకుం జెలియైనట్టియు, గర్వించినశత్రువుల నశింపఁజేయుస్వభావముఁ గలవాఁడవును, సుదర్శనంబను చక్రంబుఁదాల్చువాఁడవునైనట్టియు అని పరిహారము. లక్ష్మీనాయకుండ వైననీవు మమ్మెల్ల విధమ్ములను రక్షింపుమా యని భావము.

శ్లో. దేవసుఖోదయ మిచ్ఛన్
దేవక్యుదయం స్వయం గచ్ఛన్।
క్రూరాసురాంశజాతా
నక్రూరప్రియ పార్థివాన్ యమం నయసే॥ 7

టీ. హేఅక్రూరప్రియ = ప్రియమైన యక్రూరుఁడనుభక్తుఁడు గల శ్రీకృష్ణా! త్వం = నీవు, దేవసుఖోదయం, దేవ =

వేల్పులకు,సుఖ=సౌఖ్యముయొక్క,ఉదయం=అభివృద్ధిని,ఇచ్ఛన్= కోరుచున్నవాఁడవగుచు, స్వయం=స్వయముగ, దేవక్యుదయం, దేవకీ=దేవకీదేవివలన,ఉదయం=పుట్టుటను,గచ్ఛన్=పొందుచున్న వాఁడవగుచు,క్రూరాసురాంశజాతాన్ ,క్రూర=దుష్టులగు, అసుర=రాక్షసులయొక్క,అంశ=అంశలవలన, జాతాన్=పుట్టిన, పార్థివాన్=రాజులను, యమం=యముని,నయసే=పొందించుచుంటివి.

మ. అమరౌఘమ్మునకింపువెంపెసఁగు సౌఖ్యమ్ముంబ్రసాదింపఁగా
నమితోత్సాహముతోడు తన్ధరణిలో నాదేవకీదేవిగ
ర్భమునందుద్భవమొందిదైత్యగణదుర్వారాత్ములన్
యమునింబొందఁగఁ జేసియే వెసఁగుకృష్ణామమ్ముఁగాపాడుమీ.

తా. ఓశ్రీకృష్ణదేవా! నీవు వేల్పులకు నెంతయు సుఖమ్ముఁగూర్పందలంచి స్వయమ్ముగాఁ బుడమిలో దేవకీదేవిగర్భమ్మున నవతరించి క్రూరులగు రక్కసులయంశమ్ములవలనఁ బుట్టిన రాజులనెల్లఁజక్కాడితివి. అనఁగా నీకు దుష్టనిగ్రహము, శిష్టరక్షణము, నొనర్చుటయందుఁ దాత్పర్యము మిక్కుటమని భావము.

శ్లో. గదాదరవిరాజితం నిజసుమంత్రబద్ధాదరం।
గదాదరవిరాజితం నిజసుమంత్రబద్ధాదరం।
సదాశయశివప్రదం స్మరగురుం సుహృత్సౌఖ్యదం।
సదాశయశివప్రదం స్మరగురుం సుహృత్సౌఖ్యదం॥

టీ. హేసదాశయ = ఓమంచిమనంబా! లేక, హేఆశయ = ఓమనంబా, సదా = ఎల్లప్పుడు, గదా దరవిరాజితం,

గదా=(కౌమోదకియను) గదచేతను, దర = (పాంచజన్యంబను) శంఖంబుచేతను, విరాజితం=మిక్కిలి ప్రకాశింపఁజేయఁ బడిన ట్టియు, నిజ ... దరం నిజ=తనసంబంధమైన, సు = యోగ్యమైన మంత్ర=మంత్రముకలవారలయందు బద్ధ=కూర్చఁబడిన, ఆద రం=ఆదరము కలిగినట్టియు, గదా .. జితం, గద = గదుఁడను తమ్మునియందు, ఆదర=ప్రేమచేత, విరాజితం=మిక్కిలి ప్రకా శింపఁజేయఁబడినట్టియు (సౌభ్రాత్రముఁ గలిగినట్టియు) నిజ ... దరం, నిజ=తనయొక్క, సు=యోగ్యమైన, మంత్ర=ఆలోచ నతో, బద్ధ=కూడికొనిన పాండవులయందు ఆదగం=ఆదరముకల గినట్టియు, సదాశయ-శివప్రదం సత్=యోగ్యమైన, ఆశయ= మనస్సుకలవారలకు, శివ=మంగళమును దం=ఇచ్చునట్టియు, స్మర=మన్మథునకు, గురుం = తండ్రియైనట్టియు, సుహృత్సౌఖ్య దం, సుహృత్=స్నేహితులకు, సౌఖ్యదం=సౌఖ్యమునొసంగునట్టి యు, శివప్రదం=శివ = మోక్షమును, ప్రదం = ఇచ్చునట్టియు, సుహృత్=పండితులకు, సౌఖ్యదం = సౌఖ్యము నిచ్చునట్టియు, గురుం=సర్వోత్తరుఁడైనట్టియు, కృష్ణుని, స్మర=స్మరించుమూ.

తరల. మహింగదా దరరాజితున్ స్వసు
మంత్రబద్ధ కృతాదరున్
మహింగదా దగరాజితున్ స్వసు
మంత్రబద్ధ కృతాదరున్
మహింసదాశయ భద్రదున్ మతి
మద్రతున్ సుహృదన్వితున్

మహినదాశయమూ స్మరింపు మ
మందసౌఖ్యము లందఁగన్.

**తా.** ఓ మంచిమనసా! నీవు ఎల్లప్పుడు కౌమోదకియను గదను, పాంచజన్య మనుశంఖమునుఁ దాల్చునట్టియు, తనమంత్రము జపించువారలయెడ నెంతయును ప్రేమఁ గలిగినట్టియు గదుఁడను తమ్మునియం దెంతయు,వాత్సల్యముఁ గలిగినట్టియు తన యాలోచనతోఁ గూడిన పాండవులయం దెంతయు నాదరము కలిగినట్టియు, మన్మథునకుం దండ్రియైనట్టియు, స్నేహితుల కానందముఁ గూర్చునట్టియు, మోక్షము నొసంగ దక్షుడైనట్టియు విద్వాంసులకు సౌఖ్యము నొసంగునట్టియు, శ్రీకృష్ణుని సంస్మరింపుము.

శ్లో. ప్రత్యర్థిదాన చణబాణగణా సనేద్ధం
ప్రద్యుమ్నవంత మనిరుద్ధవిశేషభాసం
సత్యాంచితం సవిజయంచ సుదర్శనాగ్ర్య
మాఢ్యం నమామి నరకోద్ధర మాధవం త్వాం॥

**టీ.** హేనరకోద్ధర, నరక = నరకాసురుని, ఉద్ధర = సంహరించినవాఁడా, అని కృష్ణపరము. నరక=మనుష్యులను, ఉద్ధర ఉద్ధరించువాఁడా (పరిపాలించువాఁడా) అని ఒకానొక మహారాజపరము. (ఈయర్థమున నరశబ్దమునకు స్వార్థమున కప్రత్యయము చేయఁగా నరక అని యయ్యె.) ప్రత్య... నేద్ధం, ప్రత్యర్థి = శత్రువులను, దానచణ=ఖండించుటచేఁ ప్రసిద్ధుఁడై బాణ = బాణాసురునియొక్కయు, గణ = ప్రమథగణము యొక్కయు, అసన = చిమ్మివేయుటచే (జయించుటచే) ఇద్ధం

ప్రకాశించుచున్న, అని కృష్ణపరము. ప్రత్యర్థి = సమస్త యా
చకులనుగూర్చి, దానచణ = ఇచ్చుటచేఁ బ్రసిద్ధుఁడైనట్టియు,
బాణగణాసన = ధనుస్సుచేత, ఇద్ధం=ప్రకాశింపఁ జేయఁబడినట్టి
యు, అని రాజపరము, (అర్థినమర్థినం, ప్రత్యర్థి, వీప్సార్థంబున
నవ్యయీభావ సమాసము. దానేన విత్తః,దానచణః, ప్రత్యర్థి,
దానచణః,ప్రత్యర్థిదానచణః,బాణగణాసనేన ఇద్ధఃబాణగణాసనే
ద్ధః, (ప్రత్యర్థిదాన చణశ్చాసౌ, బాణగణాసనేద్ధశ్చ, ప్రత్యర్థిదాన
చణబాణగణాసనేద్ధః, తం,అని సమాసము) ప్రద్యుమ్నవంతం=
ప్రద్యుమ్నుఁడను కుమారుఁడు గలిగినట్టియు, అని కృష్ణపరము.
ప్రద్యుమ్నవంతం, ప్ర = ప్రకృష్టమైన, ద్యుమ్నవంతం=బలము
గలిగినట్టియు, లేక ప్రకృష్టమైన ధనముఁగలిగినట్టియు, అనిగాని
రాజపరము, అనిరుద్ధ = అనిరుద్ధుఁ డను మనుమనిచేత,
విశేష = విశేషమైన, భాసం = ప్రకాశమును గలిగినట్టియు
అని కృష్ణపరము, అనిరుద్ధ = అప్రతిహతమైన విశేష =
గొప్ప, భాసం = కాంతిగల, అని రాజపరము, సత్యాంచి
తం, సత్యా=సత్యభామతో, అంచితం = కూడికొనిన, అని కృ
ష్ణపరము సత్య=సత్యముచేత,అంచితంబప్పుచున్న (ప్రకాశింపఁ
జేయఁబడిన) అనిరాజపరము, సవిజయం = అర్జునునితోఁగూడి
న, అనికృష్ణపరము = సవిజయం = ఎల్లెడ జయముతోఁగూడిన
అనిరాజపరము. సుదర్శనాగ్ర్యం, సుదర్శన = చక్రముచేత,
అగ్ర్యం = శ్రేష్ఠుఁడైన అని కృష్ణపరము. సుదర్శన = మంచిద
ర్శనముగలవారలలో. అగ్ర్యం = శ్రేష్ఠుఁడగు, అనిరాజపరము,
ఆఢ్యం = సర్వసంపన్నుఁడైన, యుభయపరము. మాధవం =

లక్ష్మీపతివగు అనికృష్ణపరము, రాజ్యలక్ష్మికిఁ బతివగు అని రాజ పరము. త్వాం = నిన్ను, నమామి = నమస్కరించు చున్నాను.

సీ. ప్రత్యర్థిదానేద్ధ బాణగణాసన
ప్రద్యోతమాన ప్రభావయుక్త
ప్రద్యుమ్నసంతత ప్రస్తూయమానాని
రుద్ధాధి ప్రభాబద్ధమూర్తి
నిత్యసత్యాసక్తనిస్తులభావాఢ్య
దివ్యహృత్పద్మ దేదీప్యమాన
అతిదురితాచారయుత నరకోద్ధర
తతపుణ్యలభ్యసుదర్శనాగ్ర్య

గీ. శౌర్యధైర్యప్రభృతి సర్వసద్గుణాఢ్య
కీర్తిసంసక్త విజయజేగీయమాన
సతతభద్రాను షంగరాజితశుభాంగ
మాధవా! నీకు భక్తి నమస్కరింతు.

తా. నరకాసురుని సంహరించిన యోకృష్ణదేవా ! ఎల్ల శత్రువుల నుక్కడంచు బాణాసురుని ప్రమథ గణములను జయించినట్టియుఁ బ్రద్యుమ్నుఁడను పుత్రునితోఁ గూడినట్టియు, అనిరుద్ధుండను మనుమనిచే మిక్కిలి విరాజిల్లునట్టియు, సత్యభామచే నెంతయు నొప్పుచున్నట్టియు, అర్జునునితోఁ గూడినట్టియు, సుదర్శనముచే విరాజిల్లునట్టియు, సర్వసంపన్నుఁడవైనట్టియు, లక్ష్మీనాయకుండ వైననీకు మ్రొక్కుచుంటి ననియు, నరులం బరిపాలించు నోరాజా!ఎల్ల యాచకులఁ గోర్కెలు దీర్ప

నోపునట్టియు,ధనుస్సుచే విరాజిల్లునట్టియు, మిక్కిలి బలముఁగలిగినట్టియు, నప్రతిహతమైన తేజమ్ముఁగలిగినట్టియు సత్యసంధుండవైనట్టియు, ఎల్లెడ విజయమ్ముచే విరాజిల్లునట్టియు, సుందరులలో నగ్రగణ్యుండవైనట్టియు సర్వసంపన్నుఁడవైనట్టియు రాజ్యలక్ష్మిచే విరాజిల్లు నీకుం బ్రణమిల్లుచుంటిననియు భావము.

శ్లో. రామామోదదకామేజ్యాఢ్యంసకలాశ్రితంశార్ఙ్గిన్।
రామామోదదకామేజ్యాఢ్యం సకలాశ్రితంన్నరామిత్వాం॥

టీ. రామా... కామ, రామ = బలరామునకు, ఆమోద= సంతోషమును ద = ఇచ్చునట్టి, కామ = కోర్కిగలవాఁడా; లేక రామా=స్త్రీలకు, ఆమోద = ఉల్లాసమును, ద = ఇచ్చునట్టి, కామ = విలాసములు గలవాఁడా! శార్ఙిన్ = శార్ఙంబనుధనుస్సును దాల్చినశ్రీకృష్ణా! ఇజ్యాఢ్యం, ఇజ్యా = పూజచేత, ఆఢ్యం = అధికుఁడవైనట్టియు లేక, ఇజ్య = పూజ్యులలో, ఆఢ్యం=అధికుఁడవైనట్టియు లేక, ఇజ్యా=దానముచేత, ఆఢ్యం=ప్రకాశించుచున్నట్టియు, సకలాశ్రితం, సకల= ఎల్లరిచేత, ఆశ్రితం=ఆశ్రయింపఁబడినట్టియు, రామా... జ్యాఢ్యం, రామా=గోపికాస్త్రీలకు, ఆమోదద=ఆనందముఁ గలిగించు, కామేజ్యా=మన్మథక్రీడలతో, ఆఢ్యం=ఒప్పుచున్నట్టియు, సకలాశ్రితం, సకల=పండితులచేత, ఆశ్రితం = ఆశ్రయింపఁబడినట్టియు, (కలాభిస్సహా వర్తంతఇతి, సకలాః, అనిసమానము విద్యలతోఁగూడినవారు) లేక, సకల=శివునిచే, ఆశ్రితం=ఆశ్రయింపఁబడినట్టియు, అని గాని (కలయా సహా, వర్తత, ఇతి

సకలః, అని, సమాసము. చంద్రకళతోఁ గూడినవాఁడు)
త్వాం = నిన్ను, స్మరామి = స్మరించుచున్నాఁడను.

క. రామామోదదకామే
 జ్యామహితున్ శార్ఙ్గపాణి సకలాశ్రితు, నిన్
 రామామోదదకామే
 జ్యామహితున్ సంస్మరింతు సకలాశ్రితునిన్.

తా. బలరామున కానందముఁ గలిగించు కోర్కెలుగల
యో శార్ఙ్గపాణీ! పూజచే విరాజిల్లునట్టియు, లేక యీవితోఁగూ
డినట్టియు, లేక పూజ్యులలో నగ్రగణ్యుఁడవైనట్టియు, ఎల్లరచే
నాశ్రయింపఁబడునట్టియు, గోపికాస్త్రీలకు మిక్కిలి యానంద
మొదవించు విహారములచే నొప్పుచున్నట్టియు, పండితులచే
నాశ్రయింపఁబడు నట్టియు, లేక శివునిచేఁ బూజింపఁబడునట్టి
యు, నిన్ను స్మరించుచున్నాను. కావున నా కభీష్టప్రదుండ
వై ప్రోవుము.

ఇతి కృష్ణావతారః.

కృష్ణావతార నుతి సమాప్తము.

---

# దశావతారనుతిశతకే-బుద్ధావతారః.



శ్లో. స్కంధపంచకసనాథ జినస్త్వం
కోటిభి శ్చతసృభి ర్నిహతాభిః,
వాదినో మత మలం పరిలుంపన్
పంచబాణవిజయో జయ సీశ!

టీ. స్కంధపంచకసనాథ, స్కంధ - స్కంధములయొక్క, పంచక = అయిదింటితో. సనాథ=కూడికొనిన (రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా, సంస్కారములు, పంచస్కంధము లనంబడును. విషయప్రపంచము, రూపస్కంధమనియును, తజ్జ్ఞానప్రపంచము వేదనాస్కంధ మనియును, ఆలయవిజ్ఞానసంతానము, విజ్ఞానస్కంధమనియును, నామప్రపంచము, సంజ్ఞా స్కంధమనియును, వాసనా ప్రపంచము, సంస్కారస్కంధమనియును, బౌద్ధసంప్రదాయము) ఈశ = ఓదైవమా! పంచబాణవిజయః = మన్మథుని జయించినట్టియు, జినః = జినుఁడవైన, (సంసారమును జయించిన) త్వం = నీవు, నిహతాభిః = నిహతలనుపేరుగల, చతసృభిః = నాలుగైన, కోటిభిః = కోటులచేత (కోటీలచేత) వాదినః = ప్రతివాదియొక్క, మతం=మతమును, అలం = మిక్కిలి, పరిలుంపన్ = ఖండించుచున్నవాఁడ వగుచు, జయసి = జయించుచున్నావు.

చ. ఘనముగ స్కంధపంచకముఁ
గైకొని యానిహతాభిధానతం
దనరెడు నాల్గుకోటుల ద్రు
తంబుగ వైరిమతంబు నెల్ల ఖం
డన మొనరించి మారుని క
డంకనడంచి మహోన్నతత్వ మొం
దిన మహితానుభావ జిన
దేవ మముం గరుణించి బ్రోవవే !

తా. రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా, సంస్కారమ్ముల
ను నైదువిధములుగా నున్న జ్ఞానసంతానంబే ఆత్మయను మత
మ్మునఁ బ్రవర్తింపంజేసిన యోబుద్ధదేవా ! మారవికారమ్ము
రూపుమాపి సంసారమ్ము జయించిననీవు నిహతలనెడు నాలుగు
కోటీలచే ప్రతివాదుల మతమ్మును ఖండించి సర్వోత్కర్షముగాఁ
దనరుచుంటి వని తాత్పర్యము.

శ్లో. వినతానందద మధునా కలితవ్యాళం వినాయకం సోహం ।
కృతమారవర్ధనం త్వా మశరణశరణం శ్రయే శరణం ॥

టీ. వినతానందదం, వినత = నమ్రులగువారికి, ఆనంద=సం
తోషమును, దం = ఇచ్చునట్టి, అని బుద్ధదేవ, విఘ్ననాయక
పరము. వినతా = వినతకు, (వినతయనఁగా గరుత్మంతుని తల్లి)
ఆనంద = సంతోషమును, దం = కలిగించునట్టి, అని గరుడప
రము, వినత = గురుశిక్షితులకు, ఆనంద=సంతోషమును, బుద్ధి
వికాసమును) దం=ఇచ్చునట్టి, అని గురుపరము, కలితవ్యాళం,
కలిత = చిమ్మివేయఁబడిన, (దూరాపాస్తులగు) అనిగాని లేక,

అకలిత = కూడికొనని, వ్యాళం = క్రూరజనులుగల అనిగాని, బుద్ధదేవ గురుపరము. కలిత = ఒప్పుచున్న (భూషణములుగా ప్రకాశించుచున్న) వ్యాళం=సర్పములుగల, అని విఘ్ననాయకపరము, కలిత = చిమ్మివేయఁబడిన, (వ్యాళం = సర్పములుఁగల అని గరుడపరము.) కృతమారవర్ధనం, కృత=చేయఁబడిన, మార = మన్మథవికారముయొక్క, వర్ధనం = ఖండనముగల, (మన్మథవికారములేని) అని బుద్ధదేవ, విఘ్ననాయక గురుపరము. కృత = చేయఁబడిన, మార=మన్మథునియొక్క (ప్రద్యుమ్నునియొక్క) వర్ధనం = వృద్ధిగల, అని గరుడ పరము. (బుద్ధదేవ, వినాయక, గురుపరమున వర్ధిచ్ఛేదనే అను ధాతువుయొక్క, ల్యుడంతరూపము, వర్ధనం అని యగును] గరుడపరమ్మున వృధు, వృద్ధౌ, అనుధాతువునకు ల్యుడంతరూపము వర్ధనం అని యగును) అశరణ = దిక్కులేనివారికి, శరణం = రక్షకుఁడవైన అని అర్థచతుష్టయమునఁ దుల్యము. వినాయకం = బుద్ధదేవుఁడవగు, వినాయకుఁడవగు, పక్షినాయకుఁడవగు, గురుండవగు, త్వాం = నిన్ను, నః = అట్టి, భక్తుఁడనగు అహం = నేను, అధునా = ఇప్పుడు, శరణం = రక్షకునిగా, శ్రయే - ఆశ్రయించుచున్నాను.

క. వరవినతానందదు నా
  దగకలితవ్యాళునిన్ మదనవర్ధను ని
  త్తరినే నశరణశరణున్
  శరణొంది భజింతు శ్రీవిఘ్ననాయక నిన్నున్.

తా. ఓ దేవా! మ్రొక్కువారల కానందము నిచ్చునట్టియు, క్రూరులను దూరముగా త్రోసివేయునట్టియు, మార

వికారశూన్యుఁడవైనట్టియు దీనరక్షకుఁడవైనట్టియు, బుద్ధదేవ
డవైననిన్ను శరణొందుచుంటిననియు. ఓదేవా! (మొక్కువార
కానందప్రదుఁడవైనట్టియు, భూషణంబులుగాఁ బ్రకాశించుచు
న్న సర్పంబులు కలిగినట్టియు, మన్మథవికారము నడంచిన
యు, దీనరక్షకుఁడవైనట్టియు విఘ్ననాయకుఁడవైన నిన్ను శ
ణొందుచుంటి ననియు, ఓదేవ వినతకు (తల్లికి) సపత్ని దాస
మ్మఁ దొలఁగించి సంతోషముఁగూర్చినట్టియు, సర్పముల సంహ
రించునట్టియు, తండ్రియగు కృష్ణునికి వాహనమ్మగావున ప్ర
ద్యుమ్నున కభివృద్ధి గూర్చునట్టియు, దీనశరణ్యుఁడవైనట్టియు
పక్షినాయకుఁడవైన నిన్ను శరణొందుచుంటి ననియు, ఓదేవ
గురుశిక్షితులకు నానందముఁగూర్చునట్టియు, క్రూరసంసర్గదు
రుండవైనట్టియు, జ్ఞానోపదేశమ్మచే మన్మథవికారముల రూ
డంచునట్టియు, దీనులకు దిక్కువైనట్టియు, గురువైన నిన్నుశ
ణొందుచుంటి ననియుఁ దాత్పర్యము.

శ్లో. అజయ్యనిజసద్భుజాంచిత బలాన్ సురానర్థకాన్
 శ్రుతిస్మృతిధృతాదరాన్ దితసుతాన్ బత స్వోక్తిభిః ।
 ప్రతారితమతీన్ జితస్మర విధాయ తద్విద్విషః
 కృతాంతగృహిణో తనోరతిధితాంగతా సంగ తాన్॥

టీ. అంగ=ఓయీ! జితస్మర=జయింపఁబడినమన్మథవికారముక
బుద్ధదేవా! త్వం=నీవు, అజ ... లాన్, అజయ్య=జయింపశక్యమ
కాని, నిజ=స్వకీయమైన, సత్=యోగ్యమైన, భుజ=భుజములయ
దు, అంచిత = ఒప్పుచున్న, బలాన్=బలముకలిగినట్టియు సురా
కాన్, సురా=దేవతలకు, అనర్థకాన్ = కీడుఁగలిగించినట్టియ

(సురాణాం, అనర్థః యేభ్య స్తే సురానర్థకాః లేక, సురాః, అనర్థ కాః యేభ్య స్తే అనిగాని సమాసము. మొగటిపక్షమున, న, అర్థః అనర్థః, అని నఙ్ తత్పురుష, సురాణాం, అనర్థః, యేభ్య స్తే, సురానర్థకాః, శేషాద్విభాషా, అనుసూత్రముచేత వైకల్పికకప్ప్రత్యయాంతము, రెండవపక్షమున, నవిద్యతే, అర్థః, యేషాం తే, అనర్థకాః, అర్థాన్నఞః, అనుసూత్రముచేత, అనర్థశబ్దమునకే, నిత్యకప్ప్రత్యయము చేయఁగా, అనర్థకాః, అనియయ్యె, పిమ్మట సురాః, అనర్థకాః, యేభ్య స్తే, అని మరల బహు వ్రీహి,) శ్రుతి స్మృతి ధృతాదరాన్, శ్రుతి = వేదమ్ములయందును. స్మృతి = మన్వాదిస్మృతులందును, ధృత = ధరింపఁబడిన, ఆదరాన్ = ఆదరమ్ముఁగలిగినట్టియు, దితిసుతాన్ = రాక్షసులను, స్వోక్తిభిః స్వ=స్వకీయమైన, ఉక్తిభిః=వాక్కులచేత, ప్రతారితమతీన్, ప్రతారిత=వంచింపఁబడిన, మతీన్=బుద్ధులుకలవారినిఁగా, విధాయ=చేసి, తాన్=ప్రసిద్ధులైన తద్విద్విషః =ఆశత్రువులను, (రాక్షసులను) కృతాంతగృహిణః, కృతాంత= యముఁడను, గృహిణః=గృహస్థునకు, అతిధితాం=అతిథులగుటను, గతాన్ = పొందినవారినిగా, అతనోః=చేసితివి.

చ. అతిభుజవిక్రమాంచితబలాఢ్యుల సంతత నిర్జరాధికా
హితకరులన్ శ్రుతిస్మృతిధృతిద్ధమనస్కుల దైత్యులన్ విబి
త్రతరనిజోక్తియుక్తులఁ బ్రతారితచిత్తులఁ జేసి యాఖల
ప్రతతి కొగిన్యమాలయనికేవాసముఁ గూర్చితి సౌగతేశ్వరా!

తా. ఓబుద్ధదేవా! నీవు జయింపశక్యముఁగాని భుజ బలముఁ గలిగినట్టియు, వేల్పులకుఁగీడు సేయునట్టియు, శ్రుతి,

స్మృతులయందు బద్ధాదరులైనట్టియు, రక్కసులను, నీయుక్తి వాక్కులచేవంచించి,అనఁగా శ్రుతి స్మృతులయం దాదరముఁ గలవారలను శ్రుతిస్మృతుల నిందించి, శ్రుతిస్మృతులయందుఁ బ్రామాణ్యబుద్ధిలేనివారలనుగా నొనర్చి దుర్బలులం జేసి యమమందిరమ్మున కతిథుల నొనర్చితివి.

శ్లో. మాయా దేవీతనయం మాయాం దైవీంతితీర్షురహమీడే।
కామంక్రోధంలోభంమోహంమదమత్సరౌనునుత్సుస్త్వాం

టీ. హే దేవ=ఓబుద్ధదేవా ! దైవీం = భగవత్సంబంధమైన, మాయాం=మాయను, తితీర్షుః=దాటుటకొరకిచ్ఛగల అహం= నేను, కామం = మన్మథవికారమును, క్రోధం = కోపమును, లోభం=లుబ్ధత్వమును, మోహం = మోహమును, మదమత్సరౌ=మదమాత్సర్యములను, నునుత్సుః=నశింపఁజేయ నిచ్ఛగల వాఁడ నగుచు,మాయా దేవీతనయం=మాయా దేవియను నామె కొమరుండవై యవతరించిన, త్వాం=నిన్ను, ఈడే = నుతించు చున్నాఁడను.

క. ఆదైవికమాయన్ గా
మాదమనశ్శత్రువిక్రియన్ మొదలంటన్
ఛేదించి బ్రోవ నినుమా
యాదేవీతనయు నంతరాత్మ భజింతున్.

తా. ఓబుద్ధదేవా ! అవిద్యంగెలిచి మోక్షమునొందఁ గోర్కెగల నేను అంతశ్శత్రులగు కామక్రోధాదుల నశింపఁ జేయుట కొరకు మాయాదేవీపుత్రుఁడ వై పుడమిలో నవత రించిన నిన్నుం గొనియాడు చుంటినని భావము.

శ్లో. షడభిజ్ఞోద్వైతవాదీ సర్వజ్ఞోపివినాయకః ।
బుద్ధోవిబుధలుబ్ధో న స్సుగత స్త్వం సుఖంకురు ॥ 5

టీ. హేదేవ = ఓభగవంతుఁడా! షడభిజ్ఞః, షట్ = ఆరు, అభిజ్ఞః=అభిజ్ఞలుగలవాఁడవును ; (దివ్యదృష్టి, దివ్యశ్రోత్రము, పూర్వనివాసానుస్మృతి, పరచిత్తజ్ఞానము, అప్రత్యక్ష విషయ జ్ఞానము, వియద్గమనాగమన వ్యూహాదిలక్షణమైనబుద్ధి, అను నీయాఱు నభిజ్ఞలనంబడును) అద్వైతవాదీ, అద్వైత=అద్వయమును, జీవాత్మ, పరమాత్మల కభేదమును) వాదీ=వక్కాణించుఁ వాఁడవును, సర్వజ్ఞోపి=శివుఁడవైనను, వినాయకః=విఘ్నేశ్వరుండవు అని విరోధము, సర్వజ్ఞోపి = సమస్తము నెఱుంగు వాఁడవును, వినాయకః=సమస్తజీవులకు హితముబోధించు వాఁడవును అనిపరిహారము. (వినయతి, హితి మనుశాస్తీతి, వినాయకః, అనివ్యుత్పత్తి) బుద్ధః=సర్వమును క్షణికముగాఁ దలంచువాఁడవును, విబుధలుబ్ధః, విబుధ=పండితులయందు, లేక వేల్పులయందు, లుబ్ధః=ఆసక్తిఁగలవాఁడవును, సుగతః=మంచిజ్ఞానముకలవాఁడవును, లేక లెస్సగా పునరావృత్తిలేని మోక్షము నొందినవాఁడవని గాని (శోభనం గతం = జ్ఞానం, అస్యేతి, సుగతః, లేక సుష్టు=అపునరావృత్త్యా, మోక్షం, గతః, సుగతః, అనిగానివ్యుత్పత్తి) అగు, త్వం=నీవు నః=మాకు, సుఖం=సుఖమును, కురు= చేయుమా.

తే. గీ. వరద, షడభిజ్ఞ, యద్వైతవాది, సుగత
నాథ, సర్వజ్ఞ, దేవ, వినాయక, పరి
పోషితాఖిలవిబుధ, యోబుద్ధదేవ,
యెల్లసుఖములొసంగిమమ్మేలుకొనుము.

తా. ఓదేవదేవా! దివ్యదృష్టిమున్నగు షడభిజ్ఞలు గ
గినట్టియు, జీవాత్మపరమాత్మలక భేదము, నుడువునట్టియు
సమస్తము నెరింగినట్టియు నెల్లరకు హితమ్ముగరపునట్టియు, స
ము క్షణికమ్ముగా దలంచునట్టియు, విబుధులయెడ మిక్కి
లియాసక్తిగలట్టియు, మంచి జ్ఞానముఁబడసినట్టియు, బుద్ధరూ
మ్మున నవతరించిన నీవు మాకు నిత్యసుఖమ్మును గూర్పుమ
భావము.

శ్లో. శతానందతాత స్త్రయీపక్షపాతీ
విధుస్వచ్ఛరూపో మహాన్యాయవాదీ,
పలాశావహేచ్ఛ స్సునాసీరభీమ
శ్శివం గౌతమో న స్తనోతు ప్రసిద్ధః॥

టీ. శతానందతాతః, శతానంద=బ్రహ్మకు, తాతః=తండ్రియై
నట్టియు అని బుద్ధరూపవిష్ణుపరము, శతానంద=శతానందుఁడను
మానికి, తాతః=తండ్రియైనట్టియు (శతానందుఁడు గౌతము
కొడుకు) అని గౌతమమునిపరము. త్రయీపక్షపాతీ, త్రయీ
వేదత్రయముయొక్క పక్ష=బలమును, పాతీ=పడవేయునట్టియు
అని బుద్ధదేవపరము, త్రయీ=వేదత్రయమందు, పక్షపాతీ=
పక్షపాతముఁగలిగినట్టి,అనఁగా ఆసక్తివి, గలిగినట్టి,అని,గౌతమము
నిపరము. విధు స్వచ్ఛరూపః, విధు = విష్ణునియొక్క స్వచ్ఛ
నిర్మలమైన, రూపః. ఆకారముఁగల. అనఁగా, అంశముఁగల
అని బుద్ధదేవపరము, విధు = చంద్రుఁడువలె, స్వచ్ఛ
తెల్లని, రూపః = ఆకారముఁగల, అని గౌతమమునిపరము
మహాన్యాయవాదీ, మహత్ = గొప్ప, న్యాయ = ధర్మమున

వాదీ = నుడువు స్వభావముఁగల, అనిబుద్ధదేవపరము, మహాత్ = గొప్ప, న్యాయ = తర్కశాస్త్రమును, వాదీ = రచించి నట్టియు, అని గౌతమమునిపరము. పలాశావహేచ్ఛః. పలాశ= రాక్షసులను, అవహా = నశింపఁజేయు ఇచ్ఛః=ఇచ్ఛఁగలవాఁడు, అని బుద్ధదేవపరము, పలాశ = మోదుగ సమిధలయొక్క, ఆవహా = స్వీకరించుటయందు, ఇచ్ఛః = ఇచ్ఛఁగలవాఁడు, అని గౌతమమునిపరము. సునాసీరభీమః, సు=యోగ్యమైన, నాసీర= సేనాగ్రమందు, భీమః = భయంకరమైన వాఁడు అని గాని లేక, సు=మిక్కిలి, నాసీర = గర్వముగల వారలకు, భీమః = భయంకరమైన, అనిగాని బుద్ధదేవపరము, సునాసీర = దేవేంద్రునకు, భీమః = భయంకరుఁడైన, అని గౌతమముని పరము. ప్రసిద్ధః=ప్రఖ్యాతికెక్కిన, గౌతమః=బుద్ధదేవుఁడు (గౌతమస్య, శిష్యాః, శాక్యాః, గౌతమా, ఇత్యుచ్యంతే, తద్వంశావతీర్ణత్వాత్ బుద్ధోపి గౌతమ ఇత్యుచ్యతే = గౌతముని శిష్యులగు, శాక్యులు, గౌతములనఁబడుదురు. వారి వంశమునం దవతరించుటంజేసి బుద్ధుఁడును గౌతముఁడని చెప్పంబడుచుండెను) గౌతమః = గౌతమమహర్షి, అని రెండవయర్థము; నః=మాకు, శివం = శుభమును, తనోతు = అధికముగా నొసంగుఁగాత.

సీ. యతమతిగమ్య మహాన్యాయవాది శ
తానందజనకుండు తాపసేంద్ర
సంస్తుత్యుఁడున్ విధుస్వచ్ఛరూపుఁడు పలా
శావహేచ్ఛుఁడు వరస్వాంతభాసి
పరమత్రయీ పతఁపాతిసునాసీర
భీమస్వరూపుఁ డుద్దామమనువాఁడు

ప్రథమానకీ ర్తిరూపచ్ఛన్న విభ్రాజి
తాఖిలవిష్టపాశాంతరుండు.

గీ. గౌతముఁడు సంతతముకూర్మిగడలుకొనఁగ
ముదము దళుకొత్తు నిఖిలసంపదలు వొదల
కొల్లలుగ నెల్ల సౌఖ్యంబులుల్లసిల్ల
భద్రము లొసంగి మమ్ముఁగాపాడుఁగాత.

తా. బ్రహ్మకుఁ దండ్రి యైనట్టియు, వేదపథముఖండించి నట్టియు [బుద్ధదేవుఁడు వేదమందాసక్తిగలిగి తత్పరనాదికముచే నెక్కుడు మహిమఁ గలిగి సజ్జనులం బాధించు రక్కసుల బల మహిమలు నశింపఁజేయుటకు వేదమ్మును నిందించి యారక్కసుల వేదమం దనాసక్తులంజేసి పిదప నాకారణంబున మహిమంబుదొలఁగిన యారక్కసుల నవలీల నుక్కడంచెను. ఈ కతంబునంజేసి బుద్ధదేవుండు వేదనిందకుం డయ్యె] విష్ణుని యవతార మైనట్టియు, దుష్టుల నశింపఁజేయు స్వభావము గలిగినట్టియు సేనాముఖమందు శత్రులకు భయంకరుఁడైనట్టియు లేక మిక్కిలి గర్వముగల దుర్జనులకు భీకరుఁడైనట్టియు, ప్రసిద్ధుఁడైన బుద్ధదేవుఁడు మాకు శుభమ్ములం గూర్చి రక్షించుంగావుతమనియు, శతానందునకుం దండ్రియైనట్టియు, వేదములయందాసక్తుఁడైనట్టియు, చంద్రునికై వడి తెల్లని యాకారముఁ గలిగినటియును, తర్కశాస్త్రకర్తయైనట్టియు, హోమార్థమ్ము మోదుగు సమిధలు గైకొనునట్టియు, (తనభార్యయగు నహల్యంగామించిన దేవేంద్రుని శపించెం గావున) దేవేంద్రునకు భయంకరుఁడైనట్టియు, మహామహిముండని యెల్లెడం బ్రసిద్ధికెక్కిన

గౌతమమహర్షి మాకు శుభమ్ములు గూర్చుఁగావుత మనియు నుందాత్పర్యము.

శ్లో. మునీంద్రం కరుణాసాంద్రం జితేంద్రియమతంద్రిణం ।
ఇంద్రాదిబృందారకేశ బృందానందథుదాయకం ॥ 7

శ్లో. దితినందనసందోహ మేధాపథనిరోధకం ।
శౌద్ధోదని మహం వందే దేవం వేద వినిందకం (యుగ్మమ్) 8

అవ. ద్వయోర్యుగ్మమితిప్రోక్తం-రెండుశ్లోకంబు లేకాన్వయంబుగా నుడివినయెడల యుగ్మంబనం బడును ఇదియు గ్మము.

టీ. మునీంద్రం = మౌనిశ్రేష్ఠుఁడైనట్టియు, కరుణాసాంద్రం =మిక్కిలిదయ గలిగినట్టియు, జితేంద్రియం, జిత = జయింపఁబడిన, ఇంద్రియం = ఇంద్రియములు గలిగినట్టియు, అతంద్రిణం= మందుఁడుగానట్టియు, ఇంద్రా .. యకం, ఇంద్రాది = ఇంద్రుఁడుమున్నగు బృందారకేశ = దేవతాశ్రేష్ఠులయొక్క, బృంద = సమూహమునకు ఆనందథు=సంతోషమును. ని॥ [స్యాదానంద థురానంద, అని అమరము. ఆనందథుః, ఆనంద, యీరెండును సంతోషమునకు పర్యాయపదములు) దాయకం=ఇచ్చునట్టియు, దితి ... ధకం, దితినందన=రాక్షసులయొక్క,సందోహ=సమూహముయొక్క, మేధా=బుద్ధియొక్క,పథ=మార్గమునకు, నిరోధకం= నివారకుఁడైనట్టియు, వేదవినిందకం, వేద=వేదములను, వినిందకం=ఖండించినట్టియు, దేవం=దేవుఁడగు, శౌద్ధోదనిం=బుద్ధుని శుద్ధోదనస్యాపత్యంపుమాన్, శౌద్ధోదనిః, సూ. అతఇఞ్

శుద్ధోదనుని పుత్రుండుగావున శౌద్ధోదని యయ్యె. అహం= నేను వందే= మ్రొక్కుచున్నాను.

క. మందధిషణదితినందన
సందోహామందదురితచరితఘ్నున్ సం
క్రందనముఖబృందారక
బృందానందప్రదున్ మునీంద్రు నతంద్రున్.

క. పొందుగ నామ్నాయవిధివి
నిందకుని గృపాతిసాంద్రుఁ డనిజితేంద్రియు నా
నందమ్మున శౌద్ధోదని
డెందమునన్ వందనము లిడి భజింతుఁ దగన్.

తా. మునివరుఁ డైనట్టియు, నెల్లభూతములయెడ మిక్కిలి దయగలిగినట్టియు నెంతయు నింద్రియనిగ్రహంబు గలట్టియు కుశాగ్రబుద్ధియైనట్టియు, వేల్పులకెల్ల మిక్కిలి యానందమ్ముఁ గూర్చునట్టియు, దుష్టులగు రాక్షసులబుద్ధులను తనయుక్తులచే నిరోధించినట్టియు అందునకు వేదమతమ్ము ఖండించినట్టియు బుద్ధదేవున కేను త్రికరణశుద్ధిగా మ్రొక్కుచుంటిని.

శ్లో. ధర్మరాజ సఘృణం సశివం త్వా
మబ్జకాంతి మహితాననహాసం ।
శ్రీఘనాచల మహాశయ మీడే
శ్రీఘనాచల సమృద్ధి మభీప్సుః ॥

అవ. ఇందు శ్లేషమహిమచే బుద్ధదేవ పరముగాను శ్రీశైలేశ్వరపరముగాను నర్థద్వయంబు నుడువంబడియెను.

టీ. ధర్మరాజ, ధర్మ=సత్యము, అహింసమున్నగు ధర్మము
లకు రాజ = ప్రభువైనవాఁడా శ్రీఘన, శ్రీ = యోగభూతి
చేత, ఘన=పూర్ణుఁ డవైనవాఁడా (బుద్ధదేవా) సఘృణం =
అందరియందు దయఁగలిగినట్టియు, సశివం = శుభములతోఁ
గూడినట్టియు (సమంత భద్రుఁడవైనట్టి) అబ్జ... హాసం, అబ్జ=
పద్మముయొక్కయు, చంద్రునియొక్కయు, కాంతి=కాంతుల
వంటి కాంతులతో, మహిత=ఒప్పుచున్న, ఆనన = ముఖము
ను, హాసం=చిఱునగవునుగలిగినట్టియు, [అబ్జంచ,అబ్జశ్చ,అబ్జౌ
అబ్జయోః కాంతీ, అబ్జకాంతీ, అబ్జకాంతిభ్యాం, మ
హితౌ, అబ్జకాంతిమహితౌ. ఆననంచ, హాసశ్చ, ఆననహాసౌ,
అబ్జకాంతిమహితౌ, ఆననహాసౌ,యస్యసః, తం. అబ్జకాంతి మ
హితాననహాసం అని సమాసము.) అచలమహాశయం, అచ
ల = స్థిరమైన, మహత్ = పూజ్యమైన, ఆశయ=అంతఃకరణ
ముకలిగినట్టియు, త్వాం=నిన్ను అనిబుద్ధదేవపరము. హేశ్రీఘ
నాచల, శ్రీ=శ్రీయను ఘన=గొప్ప అచల=పర్వతమునివాసము
గాఁగలవాఁడా(ఓశ్రీశైలేశ్వరా!)ధర్మరాజసఘృణం,ధర్మరాజ=
యమధర్మరాజునందు, సఘృణం = నిందతోఁగూడినట్టియు,
(రోఁతతోఁగూడినట్టి) సశివం = పార్వతితోఁ గూడినట్టియు
(శివయా సహ వర్తతఇతి, సశివః తం సశివం, అని సమా
సము) అబ్జ... హాసం, అబ్జ = చంద్రునియొక్క, కాంతి =
కాంతిచేత, మహిత = మిక్కిలి ప్రకాశింపఁజేయఁబడిన,
ఆనన=ముఖమును, హాసం=చిఱునవ్వును, గలిగినట్టియు, లేక
అబ్జ=చంద్రునియొక్కయు, పద్మముయొక్కయు, శంఖముయొ
క్కయు, కాంతి=కాంతులవంటి కాంతులుగల, మహిత=త్రిశూ

లమును, ఆనన=ముఖమును, హాస=చిఱునగవును, గలిగినట్టి యు, (అబ్జాశ్చ, అబ్జంచ, అబ్జంచ, అబ్జాని, అబ్జానాంకాంతయ ఇవ కాంతయః, యేషాంతే, అబ్జకాంతయః, మహితంచ ఆననంచ, హాసశ్చ, మహితాననహాసాః, అబ్జకాంతయః, మహితాననహాసాః, యస్యతం. అబ్జకాంతి మహితాననహాసం, అని సమాసము) అనిగాని, మహాశయం, మహత్=గొప్ప (పూజ్యమైన) ఆశయం=అంతఃకరణము గల, త్వాం=నిన్ను అని శ్రీశైలేశ్వరపరము. అహం=నేను. శ్రీఘనాచలసమృద్ధిం, శ్రీ=శోభాయుక్తమైన, ఘన=గొప్ప, లేక శ్రీచేతగొప్పదైన, అచల=స్థిరమైన, సమృద్ధిం=సంపదను, అభీప్సుః=పొందనిచ్ఛకలవాఁడనగుచు, ఈడే = కొనియాడుచున్నాను.

చ. అతిరుచిరాబ్జకాంతి మహి
తాననహాసు సుపర్వనిత్యస
న్నుతపదు ధర్మరాజసఖు
ణున్ సశివుం బ్రశమోల్లసన్మహో
యతనుతు శ్రీఘనాచలమ
హాశయు నిన్ను భజింతు నేఁ బ్రశ
స్తతరసదావిరాజదురు
సంపదలన్ దలకొల్పి బ్రోవఁగన్.

తా. సత్యము, అహింసమున్నగుధర్మముల కెల్లఁ బ్రవర్తకుఁడవైనట్టియు, యోగలక్ష్మిచేఁ బరిపూర్ణుఁడవై మెరయునట్టియు నో బుద్ధదేవా! ఎల్లభూతములయందు, మిక్కిలిదయ గలిగినట్టియు, మంగళంబులచే విరాజిల్లునట్టియు, పద్మచంద్రుల

కాంతివంటి కాంతిగల ముఖమ్ము చిఱునగవు గలిగినట్టియు, స్థిర మైనగొప్పమనంబుఁ గలిగినట్టియు నిన్ను సుస్థిరసంపదల నొందఁ గోరికతో స్తుతిసేయుచుంటిననియు, ఓ శ్రీశైలేశ్వరా! భక్తుండగు మార్కండేయుబాధింపంజొచ్చిన యమునిదర్పంబడంచినట్టియు, అర్ధశరీరమ్మునఁ బార్వతీదేవితో విరాజిల్లుచున్నట్టియు, శిరమ్మునందలి చంద్రకళచే మిక్కిలి ప్రకాశింపఁజేయఁబడిన ముఖమ్మును చిఱునగవు గలట్టియు, లేక చంద్రునియొక్కయు, పద్మముయొక్కయు, శంఖముయొక్కయు కాంతులవంటి కాంతులుగల త్రిశూలము, ముఖము, చిఱునగవుగలట్టియు, పూజ్యాంబైన గొప్ప హృదయముఁగలట్టియు నిన్ను నిత్య సంపదల నొందుటకొఱకు నే భజించుచుంటిననియుఁ దాత్పర్యము.

శ్లో. ఆశ్రితాళి సుమనోమహితం త్వాం
వర్ధమాన కమనీయ సుశాఖం
స్కంధ బంధుర మహం షడభిజ్ఞ
ప్రార్థయే విబుధకల్పనగాఢ్యం, 10

టీ. హే షడభిజ్ఞ = ఓబుద్ధదేవుఁడా! ఆశ్రి ... హితం, ఆశ్రిత = ఆశ్రితసంఘమైన, సుమనః = పండితులనే, ఆశ్రిత= ఆశ్రయించిన, అళి = తుమ్మెదలుకల, సుమనః = పూవులచేత, మహితం = ఒప్పుచున్న, అనిశ్లిష్టరూపకము. లేక, ఆశ్రిత = ఆశ్రయించు జనులయొక్క, ఆళి = పఙ్క్తియను, సుమనః = పువ్వులచేత, మహితం = ఒప్పుచున్నట్టియు, వర్ధ ... శాఖం. వర్ధమాన = వృద్ధిపొందుచున్న, కమనీయ = మనోహరమైన, సు = యోగ్యమైన, శాఖం = బౌద్ధశాఖ

లను, కొమ్మలుఁగలిగినట్టియు, (శ్లిష్టరూపకము) స్కంధ బంధురం, స్కంధ = స్కంధపంచకంబను, స్కంధ = మొదలుచేత, బంధురం = దృఢమైనట్టియు, (ఇదియుశ్లిష్టరూపకము) విబుధకల్పనగాఢ్యం,విబుధ=విబుధులకు(పండితులకు-దేవతలకు) లేక, విబుధ = దేవతలయొక్క, కల్పనగ = కల్పవృక్షంబై, ఆఢ్యం=ఒప్పుచున్నట్టి, త్వాం=నిన్ను, అహం=నేను, ప్రార్థయే= ప్రార్థించుచున్నాను. రూపకాలంకారము.

చ. నిరుపమవర్ధమానకమనీయసుశాఖవిరాజి స్కంధబం
ధురగురు సంశ్రితాళిమనోగణభాసి సమస్త సద్గుణా
కర పడభిజ్ఞ తద్విబుధకల్పతరున్ నినుభక్తిసక్తితో
గురువులువాఱ భద్రములుకోర్చిసిరుల్ నెలకొల్పఁగొల్చెదన్.

తా. ఓ బుద్ధదేవా! ఆశ్రితులను పుష్పములచే విరాజిల్లుచున్నట్టియును, వృద్ధిపొందుచున్న మనోహరములగు బౌద్ధశాఖలను కొమ్మలుగలిగినట్టియును, స్కంధపంచకంబను మొదలుచే దృఢమైనట్టియు, కల్పవృక్షమై విరాజిల్లుచున్న నిన్ను నేను అభీష్టసిద్ధికొరకుఁ బ్రార్థించుచుంటిని.

బుద్ధావతారనుతి సమాప్తము.

---

# దశావతార స్తుతిశతకే - కల్క్యవతారః

కల్క్యవతారస్తుతి ప్రారంభము.

శ్లో. యోయందేవ ముపాస్తే
తత్క్రతునయతో భవేత్తుతత్సదృశః ।
కల్కిన్ దాసజనస్తే
ప్రత్యుత భవితా బతాకల్కీ!

టీ. హే కల్కిన్=ఓకల్కిదేవా, యః = ఎవ్వఁడు, యం= ఏ, దేవం = దేవుని, ఉపాస్తే = సేవించుచున్నాఁడో, సః = వాఁడు, తత్క్రతునయతః, తత్ = ఆప్రసిద్ధమగు, క్రతు నయతః = క్రతున్యాయమువలన, తత్సదృశః, తత్ = ఆదే వునితో, సదృశః = సమానుఁడు, భవేత్ = అగును. తే = నీయొక్క, దాసజనస్తు = సేవకజనుఁడైతే, ప్రత్యుత=వైపరీ త్యముచేత, అకల్కీ = కల్కికానివాఁడు, అని యాభాసము. (పాపికానివాఁడు, కల్కం, అస్యాస్తీతి, కల్కీ, న. కల్కీ, అకల్కీ, అని సమాసము, కల్కమనఁగా, పాపము) అని పరి హారము, భవితా = కాఁగలఁడు, బత = ఆశ్చర్యము!

క. ఎవ్వం డెవ్వనిఁ గొల్చునో
యవ్వాఁడాతనికిఁ దుల్యుఁడగుఁ గ్రతునీతిన్
ఎవ్వఁడు నినుఁ గొల్చునో వాఁ
డవ్విధి కెదురుగ నకల్కియగు కల్కివిభూ!

తా. ఓ కల్కిదేవా! లోకమ్మునఁ గ్రతున్యాయము చేత నెవ్వండే దేవు నుపాసించునో, యవ్వాఁ డా దేవునితో సమానుఁ డగు నని ప్రసిద్ధియుండఁగా దానికి విరుద్ధముగ కల్కి వగు ని న్నుపాసించు జనుఁ డకల్కి యగును, అని యాశ్చర్యము. పాపములేనివాఁ డగు నని భావము.

శ్లో. పరమార్థైకవిచారం

పరిహృత్యనరా దురాశయాః కల్కిన్

పరమర్థైకవిచారః

పరమార్థేహాస్స్యు రీశ కల్యంతే.

టీ. ఈశ = ఎల్లలోకములకునుం బ్రభువా! కల్కిన్ = ఓకల్కిదేవా! కల్యంతే = కలియుగాంతమందు, నరాః = మనుష్యులు, పరమార్థైక విచారం, పరమార్థ = యథార్థమందు, లేక మోక్షమందు అనిగాని, ఏక = ముఖ్యమైన, విచారం = ఆలోచనమును, పరిహృత్య = విడనాడి, దురాశయాః = దుష్టహృదయు లగుచు, పరం = మిక్కిలి, అర్థైకవిచారాః, అర్థ = ధనమందు, ఏక = ముఖ్యమైన, విచారాః = ఆలోచనము కలవారలగుచు (కేవల ధనలుబ్ధు లగుచు) పరమార్థేహాః, పర = ఇతరులయొక్క, మార్థ = ఐశ్వర్యము కొఱకైన, ఈహాః = ఇచ్ఛ కలవారలు, (పరేషాం, మా, పరమా, పరమాయై, ఇయం పరమార్థా, పరమార్థా ఈహా, యేషాంతే, పరమార్థేహాః అని సమాసము. వా॥ అర్థేననిత్య సమాసో విశేష్యలింగతాచేతి వక్తవ్యం) స్యుః = అగుదురు.

మ. నరులీకల్యవసానమందు సతతా
నంతార్థ లుబ్ధాత్ములై
దురితంపుంబనులందు డెందములు సం
తోషంబుతోఁ గూర్చుచుం
బరకాంతా ధనముల్ హరింప మిగులన్
భావమ్ము సంధించుచున్
బరమార్థైక విచారదూరు లగుచున్
వర్తింత్రు కల్కీశ్వరా!

తా. ఓ కల్కీశ్వరా! కలియుగాంతమ్మున నరులు దుష్ట
హృదయు లగుచుఁ బరమార్థబుద్ధి యొక్కింతయు లేక కేవల
ధనార్జన పరులై, ఇతరుల సంపద నపహరింపఁ గోర్కెఁగలవా
రలై మెలంగుదురు. అట్టియెడ నీ వవతరించి వారల నెల్లరూ
పడంతు వని తాత్పర్యము.

శ్లో. అవనాయ సజ్జనానాం యవనానాం హననాయపాపినాంచ।
భువనస్య మంగలాయ స్వవతారం లప్స్యసే కలే రంతే ॥

టీ. హేకల్కిన్ = ఓకల్కిదేవా! త్వం = నీవు (ఈపదద్వ
యమధ్యాహార్యము.) సజ్జనానాం = సుజనులయొక్క, అవ
నాయ = రక్షణముకొఱకును, పాపినాం = దుష్టులైన, యవనా
నాం = తురుష్కులయొక్క, హననాయచ = సంహరించుట
కొఱకును, భువనస్య = లోకముయొక్క, మంగలాయ = శుభ
ముకొఱకును, కలేః = కలియుగముయొక్క, అంతే = అంత
మందు, స్వవతారం, సు = యోగ్యమైన, అవతారం = అవ
తారమును, లప్స్యసే=పొందఁగలవు.

చ. అవనము సజ్జనాళికెస
లారఁగ దుర్యవనాళి ప్రాణపుం
బవనము లాత్మశాతకర
వాలఫణీంద్రముగ్రోల నిత్యమున్
భువనములందు భద్రములు
పొంపిరివ్రోవ సమస్తదేవతా
స్తవనము లొప్ప భూమి కవ
తారము సేసెదు కల్కినాయకా!

తా. ఓ కల్కిదేవా! కలియుగాంతమున దుర్జనులం జెండుజెండాడి సజ్జనులం గాపాడి లోకమ్మునకు శుభమ్ముఁ గూర్ప నీవు పుడమిలో నవతరింపఁగలవు.

శ్లో. పటుతర ఘోటక వాహా
స్తీక్ష్ణతరాద్విష్టర శ్రవస్తరవారేః।
పుల్కసపాశ్చాత్త్యాదీన్
హంతా భవితాసి కలియుగ స్యాంతే త్వం ॥

టీ. హేవిష్టరశ్రవః = ఓ కల్కిరూపవిష్ణుదేవా! త్వం=నీవు కలియుగస్య = కలియుగముయొక్క, అంతే = అంతమందు, పటుతర ఘోటక వాహః, పటుతర = మిక్కిలి బలవేగములుగల, ఘోటక=గుఱ్ఱము, వాహః=వాహనముగాఁ గలవాఁడ వగుచు, తీక్ష్ణతరాత్ = మిక్కిలి వాఁడిగల, తరవారేః=ఖడ్గమువలన, పుల్కసపాశ్చాత్త్యాదీన్, పుల్కస = కిరాతులు, పాశ్చాత్త్య = యవనులు. ఆదీన్ = మున్నగు వారలను, హంతా=సంహారించు వాఁడవు, భవితాసి=కాఁగలవు.

మ. భువిలోనం దగఁ గల్కిరూపమున సం
భూతుండ వై నీ వాఁగిక్
జవసత్త్వమ్ములనిస్తులం బయిన యా
జానేయవాహమ్ము నె
క్కి విరాజతర్కవాలధారలఘు భం
గిన్ మ్లేచ్ఛులం జెండి సం
స్తవముల్ సెందెదు దేవ యీ కలియుగాం
తం బందు దైత్యాంతకా!

తా. ఓ విష్ణుదేవా! నీవు కలియుగాంతమ్మునఁగల్కిరూ పమ్మునంబుడమిలో నవతరించి మిక్కిలి బలవేగములుగల గుఱ్ఱ మ్మ నెక్కి యెంతయు వాడిగల కరవాలమ్ముచేఁ గిరాత యవ నాది దుర్జనులనెల్ల సంహరించఁగలవు.

శ్లో. విష్ణో విష్ణు యశోభవమాప్యాగమపాలనాత్ఖలచ్ఛేదాత్।
విష్ణుయశోభ్యుదయస్తే యుక్తోయం కాణభుజ్నయాద్భవితా॥

టీ. హేవిష్ణో=ఓకల్కిరూపవిష్ణుదేవా! విష్ణుయశోభవం విష్ణుయశః=విష్ణుయశునివలన, భవం=పుట్టుకను ఆప్య=పొంది ఆఙ్పూర్వకాదాప్నోతేః,సూ॥సమాసే ఉనఞ్ పూర్వేక్త్వోల్య బితి, క్త్వోల్యశాదేశే, ఆప్యేతి రూపంసిద్ధం. అవతరిష్యతః=అవ తరించఁబోవుచున్న (అధ్యాహారము) తే=నీకు, ఆగమపాలనా త్, ఆగమ = వేదవిహితధర్మములయొక్క పాలనాత్=రక్షణ వలనను) ఖలచ్ఛేదాత్=దుష్టసంహారమువలనను, అయం=ఈ, విష్ణుయశోభ్యుదయః, విష్ణు=ఎల్లెడవ్యాపించు యశః = యశస్సు యొక్క, అభ్యుదయః=అభివృద్ధి, లేక, యశంబను, (శేయస్సు

(విష్ణుయశునియొక్క (శ్రేయస్సు) అనియు రెండర్థములకు నభేద ము) కాణభుజ్నయాత్ = కాణాదశాస్త్రవాక్యమువలన కణభుజః, నయః, కణభుజ్నయః, కణభుజ్నయస్యేదం, కాణభుజ్నయం, త స్మాత్ ,అని వృత్తి. (తర్కవాక్యమువలన) యుక్తః=తగినది, భవితా=కాఁగలదు.

మ. ఇలలో విష్ణుయశోభవమ్మునగని వే
 దద్ధోరుసద్ధర్మముల్
చెలువొప్పారఁగఁజేయుటన్ ఖలతతిం
 జేడ్పాటునొందించుటన్
విలసద్విష్ణుయశఃప్రవృద్ధి దనరన్
 విద్యోతమానుండ వౌ
టలకాణాదవచోను సారము నయో
 గ్యంబౌను కల్కీశ్వరా!

తా. ఓకల్కిరూపవిష్ణుదేవా! విష్ణుయశునిపుత్రుఁడవై యవతరించఁబోవునీకు వేదవిహితధర్మరక్షణమ్మునను దుష్టసం హారమ్మువలనను, విష్ణుయశోభ్యుదయమ్ము (విష్ణుయశునియభివృ ద్ధియనియు, నెల్లెడవ్యాపించుకీర్తియనియు) కారణగుణమ్ములుకా ర్యమ్మున సంక్రమించునని తెలుపుతర్కశాస్త్రవచనమువలన, తగినది కాఁగలదు.

శ్లో. కారణ గుణాస్తు కార్యే
 సంక్రామంతీతి శాస్త్రతో జ్ఞాతం
 విష్ణుయశో నందనతా
 విష్ణుయశోనందనస్య నో చిత్రం.

వ. పూర్వశ్లోకార్థమే ఇందును రచనాంతరమ్మున
యెను.

, హేకల్కిన్ =ఓకల్కిరూపవిష్ణుదేవా! యత్ = ఏ
లన (అధ్యాహారము) కారణగుణాః=కారణగుణము
ాయకారణ గుణములు) కార్యే=కార్యమందు, (జ
) సంక్రామంతి=సంక్రమించుచున్నవి, ఇతి = ఈలాగు
తః=తర్కశాస్త్రమువలన, జ్ఞాతం=తెలియఁబడినదో,
ఆ కారణమువలన (అధ్యాహారము) విష్ణుయశోనంద
యశుని పుత్రుఁడవైన నీకు, విష్ణుయశోనందనతా =
నందనత్వము అనఁగా విష్ణు=అంతటవ్యాపించు, యశః=
, నందనతా=సమృద్ధియనియు, విష్ణుయశః=విష్ణుయశుని
ందనతా=సమృద్ధి, అనియును రెండర్థములకు నభేదము.
్చర్యము, నో=కాదు.

రయఁగారణగుణము కార్యమున సంక్ర
ంచునంచుశాస్త్రంబువకించు హేతు
చను విష్ణుయశోనందకునుకుఁగల్కి
ంథ! విష్ణుయశోనందకనతపాసంగు.

ం. ఓకల్కిదేవా! సమవాయ కారణగుణనులు కార్య
్రకమించునని తర్కశాస్త్రము నుడువుటంజేసి విష్ణు
నుఁడవైన నీకు విష్ణుయశోనందనత్వ మాశ్చర్యము

ాపాపనోదన మపార కృపాపగావ
ప్తస్యమేభవత పాతపతాపత స్త్వం

కల్కిన్ కరోషియది విశ్వసితోభవేయం
కర్తాసి సేవకజనాదరణం పురేతి ॥

టీ. హేకల్కిన్ = ఓ కల్కిరూపవిష్ణుదేవా ! అపారకృపా పగా, అపార = అంతములేని (అపరిమితమైన) కృపా = దయ కు,ఆపగా= నదివైన, (కరుణాసముద్రుఁడవైన, యని భావము) త్వం = నీవు, భవ తపాతపతాపతః, భవ = సంసారంబను, తప = గ్రీష్మఋతువు సంబంధమైన, ఆతప = ఎండయొక్క, తాపతః = తాపముచేత, అవతప్తస్య= మిక్కిలి తపింపఁజేయఁ బడిన, మే = నాయొక్క, పాపాపనోదనం, పాప = పాపముల యొక్క, అపనోదనం = నాశనమును, కరోషియది = చేయుదు వేని, పురా = మున్ను, సేవక జనాదరణం, సేవకజన = భక్త జనులను, ఆదరణం = ఆదరించుటను, (భక్తజన విషయ కాదరణమును) కర్తా = చేయువాఁడవు, అసి = అయితివి. ఇతి = ఈలాగున, విశ్వసితః = నమ్మకము కలవాఁడనై, భవే యం = అగుదును.

**మ.** కరుణాసాగర కల్కిదేవ, యతిదుఃఖప్రాయసంసారదు
ర్భరనైదాఘదురాతపాపభవసంత్రగ్రస్తుండనై ప్రుక్కునా
దురితంబుల్ దునుమాడిఁ బ్రోచిన రహిన్ శ్రితోల్లింటిభక్తాళినా
దరమొప్పారఁగనేలితీవనుచుఁడెంపదంబందునేనమ్మెదన్.

తా. ఓ కల్కిదేవా, దయాసముద్రుండవని, ప్రఖ్యాతి కెక్కిన నీవు సంసారంబను, మండుటెండచే మిక్కిలి తపింపం జేయఁబడిననాయొక్క తాపమ్ములెల్ల దునుమాడి శాశ్వతను

ఖము, గూర్తువేని మున్ను భక్తులనెల్ల మిక్కిలి దయతోఁ బ్రోచితివని విశ్వసించుదు నని భావము.

శ్లో. మధుకాలాఽగమసుమనశ్శాఖానాం పాలనాన్న తేచిత్రం
ప్రభవిష్యత్యాశ్చర్యం భ్రమరోద్ధరణాత్పురాకల్కిన్.

టీ. హేకల్కిన్ = ఓ కల్కిరూపమున్నన నవతరించిన వాఁడా, మధుకాల, మధు = మధ్వసురునకు, కాల = సంహారకుఁడవైన విష్ణుదేవా! (మధుసూదనా అనియు, వసంత కాలమైనవాఁడా, అనియు, రెండర్థములకు నభేదము.) తే = నీ యొక్క ఆగమ ... ఖానాం, ఆగమ=శాస్త్రముల యొక్కయు, సుమనః = విద్వాంసులయొక్కయు, శాఖానాం = వేదశాఖల యొక్కయు లేక, ఆగమ = శాస్త్రములయందు, సు = యోగ్యమైన, మనః = మనస్సు కలిగినవారలయొక్క, శాఖానాం = శాఖలయొక్క అనిగాని, పాలనాత్ = రక్షించుటవలన అనియు, అగమ = వృక్షములయొక్క, సుమనః= పుష్పముల యొక్కయు, శాఖానాం = కొమ్మలయొక్కయు, పాలనాత్ = వృద్ధినొందించుటవలన అనియు, రెండర్థములకు నభేదము, చిత్రం = ఆశ్చర్యము, న = లేదు, కింతు = ఇఁకేమనిన, పురా = ముందు, భ్రమరోద్ధరణాత్, భ్రమర = స్వేచ్ఛా సంచరణ శీలురగు వారలయొక్క, అనఁగా దుష్టుల యొక్క, భ్రమర = తుమ్మెదలయొక్క అనియు రెండర్థములకభేదము. ఉద్ధరణాత్ = సంహరించుట వలన, అనియు, ఉద్ధరణాత్ = అభివృద్ధి నొందించుట వలననని యు రెం డర్థము

లకు నభేదము. ఆశ్చర్యం = వింత, ప్రభవిష్యతి = ఉద్భవించఁగలదు.

గీ. ఇలను మధుకాల రూపక కల్కీశ నీమ
హాగమ ను మనోరమ్యశాఖా వనంబు
యుక్త మగుఁగాని భ్రమర సముద్ధరణము
మాత్ర ముదయింపఁ జేయు వైచిత్రి మిగుల.

తా. ఓకల్కిదేవా! మధు కాలస్వరూపుఁడవగు నీయొక్క మహాగమ ను మనశ్శాఖా పాలనమ్ము వలన చిత్రంబు లేదు కాని భ్రమరోద్ధరణంబు వలన మిక్కిలి యాశ్చర్యంబు పొడమఁగలదు, అని తాత్పర్యము.

శ్లో. గురుతర గురువర కరుణా
పరిణతధిషణోహ మద్య తవ కల్కిన్!
అరుణానుజధ్వజనుతిం
శరణార్థియత్తనోమి నో చిత్రం. 9

టీ. కల్కిన్=కల్కిరూపమున నవతరించినవాఁడా! అరుణానుజధ్వజ, అరుణ=అనూరునికి అనుజ=తమ్ముఁడైనగరుత్మంతుఁడు, ధ్వజ=జెండాయందుఁగల విష్ణుదేవా! గురు ... షణః, గురుతర=మిక్కిలి గొప్పవాఁడగు గురువర=దేశికోత్తమునియొక్క కరుణా=దయచేత, పరిణత=పరిపాకమునుపొందిన, ధిషణః=బుద్ధికల, అహం=నేను అద్య=ఇప్పుడు. శరణార్థీ, శరణ=రక్షణను, అర్థీ=కోరుచున్నవాఁడ నగుచు, తవ=నీయొక్క. నుతిం=స్తోత్రమును. తనోమి=ఆతియత్=చేయుచున్నాననుట యేదిగలదో, తత్=అది చిత్రం= ఆశ్చర్యము. నో=కాదు.

చ. అతిమహితాను భావయుతుఁ
డై తగు దేశికవర్యు సత్కృపా
వ్యతికృతినీషదా కలిత
పండితభావము గల్గువాఁడ నౌ
కతమున నేను నీచరణ
కంజములన్ శరణొంది యిట్లు సం
స్తుతి యొనరింప నేరుటయు
చోద్యము గా దిది కల్కినాయకా!

తా. ఓ కల్కిదేవా, గురువరేణ్యుని కరుణచేఁ బరిపాకమ్ము నొందింపఁ బడిన బుద్ధిగల, అనఁగా గురుశిక్షచే జ్ఞానము వడసిన నేను రక్షణను కోరుచున్న వాఁడ నగుచు నిన్నుం గొనియాడ నేర్చుట చిత్రమ్ము కాదు. అనఁగా సంసార బద్ధుండనై, కామక్రోధాదులచే నాకర్షింపం బడు చిత్తమ్ము గలవాఁడ నై నను గురువరుని కరుణావిశేషమ్మున జ్ఞానమ్ము నొందుటం జేసి నిన్నుం గొనియాడ నేర్చుట వింత కాదని భావము.

శ్లో. కలికలుషం హర తేషాం
కలయేయు ర్యే తవ స్తుతిం కల్కిన్!
లలనా లలామలక్ష్మ్యా
విలసదురోదేశ! ప్రార్థయే హం త్వామ్॥

టీ. లల ... దేశ, లలనా = స్త్రీలకు, లలామ = అలంకారమగు (స్త్రీరత్నమగు) లక్ష్మ్యా = లక్ష్మీదేవిచేత, విలసత్ =

మిక్కిలి ప్రకాశించుచున్న, ఉరోదేశ = వక్షస్స్థలముగలవాఁడా, కల్కిన్ = కల్కిరూప విష్ణుదేవా, యే = ఏజనులు, తవ = నీ యొక్క, స్తుతిం = ఈస్తుతిని, కలయేయుః = చేయుదురో, పఠింతురో, తేషాం = ఆజనులయొక్క, కలికలుషం, కలి = కలికాలమువలనఁ గలుగు, కలుషం = పాపమును, హర = నశింపఁజేయుమా, అహం = నేను త్వాం = నిన్ను, ప్రార్థయే = ప్రార్థించుచున్నాను.

చ. అలరఁగ నీ స్తవంబు ధరఁ గనాదృతితోఁ బఠియించువారలం
గలిదురితంబుల న్దునిమి కౌతుక మొప్ప సమస్తసంపదల్
వెలయఁగఁ జేసి బ్రోవుమనిఁ వేమరు వేఁడెద భక్తిసక్తితోఁ
గలుములకల్కి వక్షమునఁ గల్గిన దేవర కల్కినాయకా!

తా. ఎల్లప్పుడు లక్ష్మీదేవిచే నలంకరింపఁబడిన వక్షస్థలంబుగల కల్కిరూప విష్ణుదేవా! నాచేరచింపఁబడిన యీదశావతార స్తుతి నెవ్వరు పఠింతురో వారలదోషంబులెల్ల మొదలంటం దునిమి సమస్త శ్రేయమ్ములు సంధింపుమా యని నిన్నుం బ్రార్థించు చుంటినని భావము.

ఇతి కల్క్యవతారః

కల్క్యవతారనుతిసమాప్తము.

శ్లో. శ్రీదామెరాన్వయ పయోనిధి పూర్ణచంద్ర
శ్రీపెద్దవేంకటసుధీవరనందనేన
శ్రీచిన్న వేంకమసతీ మృదుగర్భశుక్తి
ముక్తాఫలేన చిన వేంకటనామకేన.

శ్లో. పూతేన గాలవరగోత్ర సముద్భవేన
శ్రీవేంకటేశ్వర గురుప్రియశిష్యకేణ
దుష్టేంద్రియాఘజయహృష్టహృదంబుజేన
శ్రీశావతారదశకస్య నుతిః కృతేయం.

సీ. శ్రీదామెరాన్వయ క్షీరవార్ధిందు శ్రీ
పెద్దవేంకట సుధీ ప్రియసుతుండు
శ్రీచిన్నవేంకమ క్షితిసతీ మణిపూత
తరగర్భశుక్తి ముక్తాఫలమ్ము
అతిపవిత్రేనగాలాభిఖ్యగురువిస్తృ
తోన్నతగోత్రస ముద్భవుండు
శ్రీవేంకటేశ్వర శిష్యుండు దుష్టేంద్రి
యాజయాతి హృష్టహృదంబుజుండు

గీ. చిన్నవేంకట బుధమౌళి సన్నుతముగ
నీరజానాయకవశావతారనుతిశ
తక మతిప్రౌఢి దనరఁగౌతుకముతోడఁ
జెలువు పెంపెసలార రచించి మించె.

శ్లో. పవనేందుదిగ్గజగ్లా సంఖ్యాఢ్యే శాలివాహనస్య శకే
విజయాబ్దే ఫల్గున్యాంతార్తీయే దివసకే సితేపక్షే.

స్థిరవాసరేచ దామెర చినవేంకటరాయధీశాలీ
క్షీరరథపురనివాసీ కృతవాన్ నారాయణస్య నుతిశతకమ్.

గీ. పవనపీయూషరుచిదిగి | భ హిమకిరణ
సంఖ్యఁదగుశాలివాహన | శకమునందు
మహిత విజయాబ్దఫాల్గున | మాసశుక్ల
పక్షమునను తృతీయది | వసమున స్థిర
వాసరమ్మున ధరణిలోఁ | బాలతేజు
నామనగరనివాసియౌ | దామెర చిన
వేంకట సుకవిమణి నిష్క | ళంకముగను
దీని విరచించె నాచంద్ర | దినకరముగ.

సీ. శాపురం బవని వి | ద్యాపీఠమనెడు పే
ర్వడసినకాకర | పర్తిపురము
తలిదండ్రులా సతీ | తిలకమ్మ లచ్చమ
యును సుబ్బరాయబు | ధోత్తరుఁడును
సన్నుఁయుంబా తృతీ | యామ్నాయనిష్ణాత
విద్వత్ప్రసిద్ధద్వి | వేద్యభిఖ్య
మాచార్యులా దైవ | తాచార్యసంకాశు
లగుభాష్యకార నా | రాయణవిబు

గీ. భావతంసులు పదవి కా | ప్రాపుపట్టు
జేశునాస్థానమందు క | వీశ్వరత్వ
మెవని కా రామ శాస్త్రియె | యీశతకము
మొగి తెనింగించి భావార్థ | ము లిఖంచె.

దశావతారనుతి శతకము సర్వము సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 19 | మాసస | మానస |
| 6 | 19 | పరిభ్రమ | పరిభ్రమి |
| 9 | 2 | పర | వర |
| 9 | 17 | భువిదగు | భువిఁదగు |
| 10 | 1 | యిష్టము | నిష్టము |
| 10 | 21 | బని | బను |
| 14 | 2 | దయివారగా | దయివారఁగా |
| 17 | 21 | అందోరు | అందోఱు |
| 20 | 3 | తల్లజ్లైః | తల్లజ్జైః |
| 24 | 12 | దాలవులకు | దానవులకు |
| 32 | 15 | చెప్పుమాజి | చెప్పుమా |
| 34 | 21 | ఇచ్చునా | ఇచ్ఛునా |
| 35 | 16 | అసక్తి | ఆసక్తి |
| 37 | 16 | లక్ష్మి | లక్ష్మీ |
| 37 | 18 | సర్వజ్ఞు | సర్వజ్ఞ |
| 38 | 6 | బోల్పె | బోల్పె |
| 38 | 7 | హాద | హ్లాద |
| 38 | 11 | బ్రికతా | ప్రకృతా |

| పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 38 | 12 | వురుష | పురుష |
| 39 | 15 | ఆఘ | ఆఁగ |
| 40 | 12 | లక్ష్మి | లక్ష్మి |
| 40 | 19 | నమస్క | నమస్క |
| 42 | 20 | ప్రహాదుని | ప్రహ్లాదుని |
| 42 | 21 | న్లరచే | నెల్లరచే |
| 42 | 22 | లె్ల | లెల్ల |
| 43 | 14 | ఉసురు | ఉసుఱు |
| 43 | 19 | మెరయు | మెఱయు |
| 43 | 14 | వెసకసి | వెసఁగసి |
| 43 | 12 | నకు తుష్టి | నకుఁదుష్టి |
| 44 | 3 | పొందెంచిన | పొందించి |
| 44 | 9 | చీక్కాడితి | చక్కాడితి |
| 44 | 12 | జీల్చి | జీల్చి |
| 45 | 7 | తత్షణ | తత్క్షణ |
| 46 | 8 | స్ఖుట | స్ఫుట |
| 48 | 7 | భయం | బాధా |
| 56 | 18 | పుడమి | పుడమి |
| 58 | 10 | త్రియ | త్రయ |
| 60 | 4 | ప్రగల్బం | ప్రగల్భం |
| 61 | 21 | వాస్యత | పాస్యత |

| పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 64 | 20 | ఘుస | ఘున |
| 64 | 23 | వామ=దేవ | వామన దేవ |
| 65 | 5 | అనిగాని | అనిగాని శివపరము |
| 65 | 11 | (స్మరహరుఁడు) | (స్మరహరుఁడు అని శివపరము |
| 66 | 7 | ధృతి | దృతి |
| 70 | 13 | బొర్చి | బొనర్చి |
| 71 | 12 | గరకుం | గఱకుం |
| 72 | 11 | కొనిస | కొనిన |
| 74 | 9 | వందను | నందను |
| 76 | 1 | బ్రాహ్మ్యము | బ్రాహ్మము |
| 76 | 8 | భవాన్ః | భవాన్॥ |
| 76 | 15 | నాయుఘ | సాయుధ |
| 76 | 21 | మెరయు | మెఱయు |
| 76 | 19 | పౌర్వ్యంధన | పౌర్వ్యంధ |
| 77 | 11 | ధ్వాత | ధృత |
| 80 | 10 | విద్ధంబు | విరుద్ధంబు |
| 80 | 14 | చేత్త్రా | ఛేత్త్రా |
| 80 | 16 | హేరామా | హేరామ |
| 80 | 19 | వాఢపు | వాడవు |
| 87 | 14 | మెరుంగ | మెఱుంగ |

| పేజీ. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 87 | 17 | రాక్షప | రాక్షస |
| 96 | 10 | మహాతనపతం | మహితనయేతం |
| 105 | 18 | ప్రకృతిపద= | ప్రకృతిపదగుణోఽపి ప్రకృతిపద= |
| 106 | 22 | హేముసలపాణే= ఓబలరామదేవా, ఐన, త్వం=నీవు. | ఐన, త్వం=నీవు, హే ముసలపాణే = ఓ బలరామదేవా, ఆత్మీయచేతః |
| 107 | 2 | మరియు | మఱియు |
| 108 | 10 | ఆత్మ | ఆత్మా |
| 112 | 7 | గురించి | గుఱిచి |
| 116 | 7 | సంహరించినవాని | సంహరించి వాని |
| 116 | 16 | కావున | కావు |
| 117 | 11 | విద్యతే | నవిద్యతే |
| 117 | 15 | వర్తతతి | వర్తతఇతి |
| 117 | 17 | అనమః | అసమః |
| 118 | 9 | బసు | బను |
| 118 | 15 | నుమన | సుమన |
| 121 | 14 | భవమ్మది | భవమ్మున |
| 121 | 15 | శరణంబన | శణరంబది |
| 122 | 7 | తృన్ | తృచ్ |

| పేజీ. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 123 | 1 | కృష్ణుని | కృష్ణ |
| 124 | 7 | కొడుకగు,అర్జునునకు | కొడుకగు, అర్జున=అర్జుననకు |
| 127 | 11 | దం | ప్రదం |
| 133 | 8 | సంన్కా | సంస్కా |
| 135 | 16 | ఆట్టి | అట్టి |
| 137 | 3 | సజ్ | నక్ష |
| 137 | 4 | వైకల్పిత | వైకల్పిక |
| 139 | 8 | వక్కాణించుఁ | వక్కాణించు |
| 140 | 17 | పక్షిపాతీ | పక్షపాతీ |
| 146 | 5 | తాసన | తానన |
| 147 | 17 | ఆశ్రిత | ఆశ్రితాళి |
| 150 | 8 | విచారః | విచారాః |
| 153 | 5 | విరాజతర్కవాల | విరాజత్కరవాల |
| 156 | 17 | పాపభవ | పాభిభవ |
| 160 | 10 | మనిఁ | మని |
| 160 | 8 | వారలం | వారికిం |
| | | ఉపోద్ఘాతము | |
| 1 | 16 | మూహాత్మ్యము | మాహాత్మ్యము |
| 4 | 18 | గనబుని | గవనంబు మిగుల |